PRSVHORA196

సాహిత్య ప్రస్థానం
ఏప్రిల్ 2019

సంపుటి : 18 సంపాదకీయం సంచిక : 4

# ఓటర్ల నిర్దేశం అంతిమం

ప్రజాస్వామ్యంలో ప్రజలే అంతిమ నిర్ణేతలు. వారిచ్చే తీర్పులే ప్రభుత్వాల ఏర్పాటుకు బాటవేస్తాయి. తద్వారా ఎలాటి విధానాలు వచ్చేది పరోక్షంగా నిర్దేశిస్తాయి. ఎన్నికల సమయంలో సరైన నిర్ణయం తీసుకుంటేనే ప్రజాస్వామ్య ప్రక్రియ సజావుగా పనిచేస్తుంది. 1977లో అత్యవసర పరిస్థితి రూపంలో వచ్చిన నిరంకుశత్వాన్ని కూలగొట్టడంలోనూ, అవినీతి మతతత్వ రాజకీయాలను ఓడించడంలోనూ దేశ ప్రజలు చారిత్రక పాత్ర నిర్వహించి శభాష్ అనిపించుకున్నారు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోనూ మొదట్లో కమ్యూనిస్టులను తర్వాత తెలుగుదేశంను ప్రత్యామ్నాయంగా తీసుకొచ్చారు. ప్రపంచీకరణ నేపథ్యంలో అప్పటి జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు సమూలంగా మారిపోయాయి. తెలుగువారికి ఎపి తెలంగాణ రెండు రాష్ట్రాలైనాయి. ముఖ్యమంత్రి కెసిఆర్ ముందస్తుకు వెళ్లిన ఫలితంగా తెలంగాణలో ఎన్నికలు పూర్తయి టిఆర్ఎస్ తిరిగి రాగా ఎపి అసెంబ్లీ ఎన్నికలు, దాంతో పాటే దేశ వ్యాపితంగా లోక్‌సభ ఎన్నికలు ఏప్రిల్11 నుంచి మొదలవుతున్నాయి. విభజనానంతరం జరుగుతున్న ఈ తొలి ఎన్నికలలో ఇచ్చే తీర్పు నూతన రాష్ట్ర భవిష్యత్తుకు బాట వేస్తుంది. రాష్ట్ర ప్రభుత్వ తప్పొప్పులు, ప్రత్యేక హోదా విషయంలో కేంద్రం వాగ్దానభంగం, విభజన హామీల ఉపేక్ష ఇలాటి చాలా సమస్యలు ముందున్నాయి. 2014లో దేశంలో మెజార్టి తెచ్చుకున్న బిజెపి నేత ప్రధాని నరేంద్ర మోడీ పాలనపై అసహనం, రచయితల మేధావుల భావస్వేచ్ఛపై దాడి, గోవులు పేరిట మానవ మేధం వంటి కొత్త సమస్యలు వచ్చాయి. కల్బుర్గి, గౌరీ లంకేశ్ వంటి వారు హత్యకు గురయ్యారు. విశ్వవిద్యాలయాలూ వివాద నిలయాలయ్యాయి. ఇదిగాక నోట్లరద్దు వంటి నిర్ణయాలు జనజీవితాన్ని అతలాకుతలం చేస్తే రాజ్యాంగ వ్యవస్థల సంక్షోభం సవాలుగా మారింది. సరిహద్దుల్లో పాక్ ప్రేరిత ఉగ్రవాదుల దాడి, వారిని నిరోధించేందుకు సైన్యం చర్యలు కూడా ఎన్నికల ప్రచారాలుగా మారిపోయాయి. ఎపికి హోదా నిరాకరణ కూడా ఈ క్రమంలో అదనపు అంశంగా మన ముందుంది. గత ఎన్నికల్లో టిడిపి నేత చంద్రబాబు నాయుడు పవన్ కళ్యాణ్ జనసేన, బిజెపిల మద్దతుతో అధికారంలోకి రాగా వైసీపీ ఏకైక ప్రతిపక్షంగా సభలో ప్రవేశించింది. ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రత్యేక హోదాసమస్య తర్వాత పవన్ బయిటకు నడిచారు. వైసీపీ కూడా ప్రత్యేక హోదాపై ఆందోళనలు చేస్తూ వచ్చింది. అయితే తమ ఎంఎల్ఎలను పాలకపక్షం భారీఎత్తున ఫిరాయింప చేసిందనే ఫిర్యాదుతో వారు దాదాపు రెండేళ్లుగా శాసనసభను బహిష్కరించారు. ఉద్యమాలలో ముందుండే వామపక్షాలు యథావిధిగా హోదా, ఇతర ప్రజాసమస్యలపై, భూ స్వాధీనం వంటి అంశాలపై తమ పాత్ర నిర్వహిస్తూ వచ్చాయి. హోదా కన్నా మెరుగైన ప్యాకేజీ ఇచ్చామన్న కేంద్రం వాదనను చాలా కాలం సమర్థించిన తెలుగుదేశం చివరకు అది కూడా ఇవ్వకపోవడంతో బిజెపితో

⇨



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- • 5 సంవత్సరాల చందా రూ.1000/
• 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## కథలు



## కవితలు



## వ్యాసాలు



సంపాదకీయం...

తెగతెంపులు చేసుకుంది. జాతీయంగానూ దానికి వ్యతిరేకంగా కాంగ్రెస్‌తో చేతులు కలిపింది. ప్రస్తుతం టిడిపి వంటరిగా పోటీ చేస్తుండగా జనసేన, కమ్యూనిస్టులు, బిఎస్‌పితో కలసి రంగంలో నిలిచింది. వైసీపీ నేత జగన్‌కు టిఆర్ఎస్ మద్దతు ప్రకటించడంతో పాటు బిజెపితో పరోక్ష స్నేహం ఆరోపణలు ఎదుర్కొంటున్నది. జగన్ చిన్నాన్న వివేకానందరెడ్డి హత్యతో వాతావరణం ఒకింత ఉద్రిక్తత కూడా సంతరించుకుంది. వైసీపీ టీడీపీ నిందారోపణల మధ్య తృతీయ ప్రత్యామ్నాయ శక్తిగా జనసేన వామపక్షాల కూటమి రంగంలో వుంది. హోరాహోరీ పోరాటం సాగుతున్న నేపథ్యంలో సరైన తీర్పు నిచ్చి కేంద్ర రాష్ట్రాలలో లౌకిక ప్రజాస్వామ్య ప్రభుత్వాలనుఏర్పాటు చేసుకోవలసిన బాధ్యత ఓటర్లపైనే వుంది. పార్టీల నేతల నిత్య నిందారోపణలు, ఉద్వేగాల మధ్య వారే దేశానికి రాష్ట్రానికి దిశానిర్దేశం చేయగలరు. కుల మత తత్వాలు, అవినీతి అరాచకాలు, అసహన రాజకీయాలకు భరత వాక్యం పలికి రాజ్యాంగ విలువలను కాపాడుకోవడం, విభజిత ఆంధ్ర ప్రదేశ్‌ను సరైన దారిలో ముందుకు నడిపించే ప్రభుత్వాన్ని ఎన్నుకోవడం ఓటర్ల బాధ్యతే. ఈ చారిత్రక మూలమలుపులో అందుకు తగిన తీర్పే ఇవ్వాలని కోరుతున్నాం. ♦

# బాంది

- షేక్ హుసేన్ సత్యాగ్ని
9866040810




ఖాదర్ బాషా... ఖాదర్ బాషా... ఖాదర్ బాషా...

అరిచినట్లుగా పిలిచాడు కోర్టు జవాను. వరండాల్లో ఒకరితో మాట్లాడుతున్న ఆమె అర్థాంతరంగా మాటలు ముగించి, కూతురు రెట్ట పట్టుకుని ఈడ్చుకుంటూ బిరబిర కోర్టు హాలులోకొచ్చింది. జస్టిక్ దండం పెట్టి అక్కడున్న విజిటర్స్ బెంచి మీద కూర్చుంది.

ఖాదర్ బాషా ముద్దాయిల బోన్లో చేతులు కట్టుకుని నిల్చున్నాడు. ఆమె జడ్జీ ఏం చెప్తాడోనని కుతూహలంగా గుటకలు మింగుతూ అతని వైపే చూస్తూ ఉంది.

జడ్జీ ఖాదర్ బాషా వైపు చూస్తూ ఈ రోజు సాయంత్రం నీ కేసు జడ్జిమెంటు చెప్తా, అంతవరకు బయట ఉండు అన్నాడు. ఖాదర్ బాషా తల వంకించి జడ్జీకి దండం పెట్టి బయటికిపోయాడు. ఆమె కూడా మెల్లగా కాళ్లీడ్చుకుంటూ బయటికొచ్చింది.

కోర్టు బయట ఉన్న వేప చెట్టు క్రింద అరుగుమీద కూర్చుంది. వళ్ళో కూతుర్ని కూర్చోబెట్టుకుని రెప్పవాల్చకుండా తదేకంగా చూస్తూ ఉద్వేగంతో కన్నీళ్ళు పెట్టుకుంది. తన వడిలో కునుకు తీస్తున్న బిడ్డను జోకొడుతూ దీర్ఘాలోచనలో మునిగింది.

•••

పెళ్ళి కాకముందు తానెన్నో కలలు కనింది. భర్తకు అనుకూలవతిగా, అత్త, ఆడబిడ్డల అనురాగాన్ని చూరగొని సంసారాన్ని ఆనందమయం చేయాలని. అవ్వన్నీ కల్లలయ్యాయి. కూలిపోయాయి. తన పెండ్లి తర్వాత అత్తగారింట్లో చోటుచేసుకున్న కొన్ని సంఘటనలు హృదయంలో శూలాలవలే నాటుకున్నాయి. ఎంత ప్రయత్నించినా మర్చిపోలేకుంది. అవి గుర్తుకు వచ్చినప్పుడు బాధతో కుమిలిపోతుంది.

తన పెండ్లి నిశ్చయమైంది. తొందరగా పెండ్లిచేసి ఇవ్వాలని అబ్బాయి తల్లిదండ్రులు బ్రతిమాలుకున్నారు. మొదట తన డాడి ఇంత తొందరగా అని నీళ్లు నమిలినా తర్వాత సరేనని ఒప్పుకున్నారు.

నికా తర్వాత ఆ రోజు సాయంత్రమే "జుల్వా" సాంగ్యం ముగించారు. అప్పగింతలప్పుడు మమ్మీ, డాడిలిద్దరు ఖాదర్ బాష తల్లిదండ్రుల చేతులు పట్టుకుని "ఆడపిల్లయినా కొడుకనుకుని గారాబంగా పెంచాము. ఆమె కోరినట్లే పెద్ద చదువు చెప్పించాము. ఈ రోజు నుండి మీరే తల్లి తండ్రి మీ చేతుల్లో పెడుతున్నాము. చిన్న పిల్ల తెలియక ఏదైనా పొరపాట్లు చేస్తే క్షమించండి" అంటూ కన్నీటి పర్యంతమయ్యారు. 'దిగులుపడకండి భాయి యిక మీ బిడ్డ కాదు మా బిడ్డ. ఏ లోటు రాకుండా చూసుకుంటా'మని భరోసా ఇచ్చారు.

తనకిచ్చిన 'జెహజ్' సరంజామానంతా వలీమాకు వచ్చేటప్పుడు వ్యానులో వేసుకొని రావాల్సిందిగా తన డాడిని పురమాయించారు. రాత్రికి పెండ్లికొడుకు ఇంటికి చేరుకున్నారు.

ఒక చిన్న గదిలో పడక ఏర్పాటు చేశారు. భోజనాల తర్వాత చాలాసేపు పెండ్లి ఊసులు మాట్లాడుకున్నారు. కాసేపటికి పెండ్లికొడుకు గదిలోకి పోయాడు. తానక్కడే హాలులో కూర్చుని ఉంది. అత్త ఆడబిడ్డలను పిలిచి తనను పెండ్లికొడుకు గదికి తీసుకపొమ్మని సైగ చేసింది.

ఖాదర్ బాషా తన భుజం మీద చెయ్యివేసి "చూడు సాబిరా! అప్పగింతలప్పుడు మన బంధువులందర్నీ వరుసలతో సహా పరిచయం చేశారు. మరి నిన్ను నేను ఏమని పిలవాలో చెప్పలేదే" అని వెకిలిగా నవ్వాడు. ఏం సమాధానం చెప్పాలో తోచక తాను మౌనంగా ఉండిపోయింది.

"మా జేజి నాయన జేజెమ్మను "బాంది" (బానిస) అని పిలిచేవాడు. మా అబ్బాజాన్ కూడా అంతే, మరి నేను... అంటూ సూటిగా తన కళ్ళల్లోకి చూశాడు. తన మనసు చివ్వుక్కుమంది. మారు మాట్లడకుండా ఒక మూల వొదిగి కూర్చుంది. అతను మాట్లాడించడానికి చాలాసేపు ప్రయత్నం చేశాడు. అయినా తను పలకలేదు.

పొద్దునే రుసరుసలాడుతూ దిగులు మోహంతో ఖాదర్ బాషా గదిలోనుండి పోయాడు. అతని మనస్తత్వం ఏమిటా అని ఆలోచనలకందక రాత్రంతా సతమతమైంది తాను.

అందరూ కలిసి నాస్టా ముగించాక తాను గదిలోకి పోతూ ఉండగా అబ్బాజాన్ (మామ) 'సాబిరా' అని పిలిచాడు. తాను అతనివైపు తిరిగి 'ఏమీ' అన్నట్లు చూసింది. 'మరేం లేదు మీ అమ్మగారు పెట్టిన బంగారు నగలన్నీ దస్తీ(కర్చీఫ్)లో మూటగట్టి ఇయ్యమ్మా' అన్నాడు. తాను ఒక్క నిమిషం తటపటాయించి వెంటనే సర్దుకుని 'అలాగే' అంది.

ఎందుకు నగలడిగారూ? ఎక్కడికి తీసుకపోయారు? ఏం చేయాలని వారి ఉద్దేశ్యం? అని పరిపరి ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. చాలా సేపటి వరకు ఒంటరిగా గదిలో కూర్చున్న తాను "భాబి మిమ్మల్ని అబ్బాజాన్ పిలుస్తున్నారన్న" చిన్న ఆడబిడ్డ పిలుపుతో తేరుకుని ఆమెను అనుసరించింది.

హాల్లో కూర్చున్న అబ్బాజాన్ తన్ను చూస్తూనే "చూడమ్మా నీ నగలు తూకం వేయించాను పదునైదు తులాలకు నూరు మిల్లీగ్రాములు తక్కువున్నాయి. అంటే మూడు వేలు అవుతుంది. మొర్నాడు మీ వాళ్ళు వలీమాకు వచ్చేటప్పుడు తెమ్మని మీ డాడికి ఫోన్‌చేసి చెప్పు" అన్నాడు ముక్తసరిగా. తాను జంకుతూ, మెల్లగా 'తరుగూ...' అనింది. అవ్వన్నీ వీల్లేదు ఒప్పుకొన్న పదహైదు తులాలు ఖచ్చితంగా ఇవ్వాల్సిందే అన్నాడు ఖరాఖండిగా.

◆◆◆

పెండ్లై నాలుగు శుక్రవారాలు గడిచింది. మూడు వారాలు దగ్గర బంధువుల ఇండ్లలో దావత్‌లు ఏర్పాటు చేశారు.

నాల్గవ శుక్రవారం విధిగా తన ఇంట్లో జరగాలి. తమ దగ్గర బంధువులందర్నీ పిలుస్తాము ఘనంగా చేయాలంది అమ్మీజాన్ (అత్త). ఇప్పటికే బోలెడంత ఖర్చు అయ్యింది మా వల్ల కాదన్నారు తన మమ్మీ డాడీ.

తామిద్దర్నీ పిలిచి సాంగ్యం చేసి ముగించారు.

అమ్మీజాన్‌కు కడుపు మండింది. "బంగారంలాంటి పిల్లోన్ని ముదనష్టపు కొంపలో తోశామమ్మా వాడి అచ్చటా ముచ్చటా చూసే అదృష్టం లేకపాయ మాకు" అంటూ కొత్త దంపతులను చూడనొచ్చిన అమ్మలక్కలతో అంగలార్చటం మొదలు పెట్టింది. తాను విని విననట్టు వూరకుండిపోయేది.

అయిదవ శుక్రవారం తన అత్తగారింట్లో జరిగింది. భోజనాల తర్వాత సాంగ్యం ముగించుకొని తామిరువురు గదిలోకొచ్చారు. ఖాదర్ బాషా తన వొడిలో తలపెట్టుకుని కబుర్లు చెప్తూ తాంబూలం నములుతున్నాడు.

వారగా మూసిన వాకిలి తోసుకొని ఆడబిడ్డ లోనికి వచ్చింది. ఖాదర్ బాషా తటాలున లేచి కూర్చుని చికాకుగా 'ఏమన్నట్లు' చూశాడు. 'తాంబూలం తట్ట తెమ్మని అమ్మీ పంపించింది' అంది. వెంటనే తానందించింది.

కాసేపటికి "ఖాదర్ బాషా" అని కేక వేసింది అమ్మీజాన్. బిరబిర లేచిపోయాడు ఖాదర్ బాషా. ఏంచేస్తున్నావ్ అంది గద్దిస్తూ. అతనేం సమాధానం చెప్పాడో తనకు వినిపించ లేదు. "కాలి చెప్పురా భార్య, దాని జాగాలోనే దాన్ని ఉంచాలి. ఎత్తి నెత్తిన పెట్టుకుంటావా?" అంటూ మందలించింది. అది విన్న తనకు వొళ్ళు జలదరించింది.

తామిద్దరూ సంతోషంగా ఉంటే చూచి కళ్ళలో నిప్పులు పోసుకుంటారు అమ్మీజాన్, ఆడబిడ్డలు. ఆడపాదడపా "జోరు కా గులామ్" అని ఖాదర్‌బాషాను దెప్పిపొడిచేవారు.

రంజాన్ నెల వచ్చి అప్పుడే పది రోజులు గడిచాయి. "మీ ఇంట్లో నీదే తొలి పెళ్ళి అనుకుంటా. అందుకే మీ వాళ్ళకు

సాంగ్యాలు, సంబరాలు బొత్తిగా తెలిసినట్టుల్యా. పెండ్లి అయిన తర్వాత మొదటి రంజాన్ పండక్కు ఈదీ (వంటలు) తీసుకరావాలి. మీ వాళ్ళకు ఫోన్ చేసి చెప్పు" అంటూ హెచ్చరిక చేసింది అమ్మీజాన్.

తర్వాత ఒక రోజు ఈది తెచ్చిన తన తమ్ముణ్ణి చూసి కలవల పడింది అమ్మీజాన్. కాసేపటికి తేరుకుని తన వైపు చూస్తూ ఈది తెచ్చినట్లుందే అంది. అవునని తల పంకించింది తను. డైనింగ్ టేబుల్‌పై అమర్చిన వాటివైపు పరిశీలనగా చూచి 'ఇంతేనా-ఇదా ఈది' అని వెటకారంగా చేయితిప్పుతూ. 'అదింతా ఇదింతా తెచ్చి మా మొహాన కొట్టడానికి మేమేం పకీర్లమనుకున్నారా? గతిలేకపోతే మా వల్ల కాదనాల్సింది. ఇట్లా అరకొర పంపించి నలుగురిలో మమ్మల్ని నవ్వులపాలు చేస్తారా? ఇదో ఈది అని మదనపల్లె నుండీ ఊగులాడించుకుంటూ వచ్చినాడు. సిగ్గులేకపోతే సరి' అని చిర్రుబుర్రులాడుతూ బిరబిర బయటికి పోయింది.

ఆమె మాటలకు బిత్తరపోయిన తన తమ్ముడు చెప్పాపెట్టకుండా మెల్లగా అక్కడినుండి జారుకున్నాడు.

వీధిలో ఉన్న అమ్మలక్కలందర్ని తోడుకొని ఓ పెద్ద కిష్కింధ పటాలం మాదిరి వచ్చింది. డైనింగ్ టేబులు మీదున్న వంటకాల మూతలు తీసి చూపిస్తూ "ఈ బిరియాని ఎంతమంది కొస్తుందమ్మా. ఈ ఊర్లోనే మా దగ్గరి బంధువులు నలభై ఇల్లున్నాయి. ఇది చూడండి ఈ సేమియా పాయసం వీధిలో ఉన్నోళ్ళకు ఇంటికొక కప్పన్నా వస్తుందా? మీరే చెప్పండి" అంటూ వైరాగ్యంగా 'ఇంతకూ మన బంగారం గట్టిదైతే ఒకర్ని అనాల్సిన పనేముందిలేమ్మా. కోడల్ని నట్టింట్లో నిలబడి కులకడం కాదు. జరగాల్సినవన్నీ పుట్టింటి వాళ్ళను నిలదీసి చేయించుకోవాలి. మేమంతా చేయించుకోలా' అంటూ ఆ రోజు పెద్ద రాద్ధాంతమే చేసింది అమ్మీజాన్. తాను నిస్సహాయంగా నిలబడి కుమిలిపోవడం తప్ప మారు మాట్లాడలేకపోయింది.

తనకు నెల తప్పి ఆరు మాసాలు దాటిందో లేదో అప్పుడే ఫర్మాయిష్‌లు మొదలు పెట్టింది అమ్మీజాన్. "సత్వాస (సీమంతం) సాంగ్యం ఎప్పుడు తెస్తారో రెండ్రోజులు ముందే ఫోనుచేసి చెప్పమనుమ్మా. అప్పటికప్పుడు తెస్తే ఏం జేయాలో నాకు దిక్కుతోచదు అని కటువుగా చెప్పింది. ఆ మాట వింటూనే తనకు భయం పట్టుకుంది. రెండ్రోజులుగా ఒకటే ఆలోచన సత్వాస్వాకు ఏమేమి డిమాండ్ చేస్తుందోనని. చివరకు ఒక నిర్ణయానికొచ్చింది తాను. ఆమెనే అడిగి తెలుసుకుంటే బాగుంటుంది కదా అని.

ఒకరోజు అందరిముందు 'అమ్మీజాన్ నాకు అట్టే తెలియదు సత్వాసాకు ఏమేమి తేవాలో' అంది. ఆమె నవ్వుతూ 'ఆ మాత్రం తెలియదా, మీ ఇంట్లో చేయకపోతే సరి ఎక్కడైనా చూడలేదా? ఏం లేదమ్మా సరిపడ్డమొయిన పది రకాల తీపి వంటకాలు మీ ఆలుమొగుళ్ళ కిద్దరికీ కొత్త బట్టలు, ఆ రోజు మధ్యాహ్నం భోజనాలకయ్యే ఖర్చులూ... అదేనమ్మా బియ్యము, మాంసం, నెయ్యి సమస్తమూ అనుకో – ఇంకా వాళ్ళకు ప్రేమ ఉంటే అల్లునికి నజరానాగా బంగారు ఉంగరం కూడా ఇయ్యచ్చు' అంది నవ్వుతూ.

తాను వాళ్ళ వాళ్ళతో మాట్లాడింది. వాళ్ళు తమ ఇరుకులు ఇబ్బందులు ఏకరువు పెట్టారు. ఆ మాటముందే అమ్మీజాన్‌కు చెప్తే బాగుంటుంది కదా అని. 'అమ్మీజాన్ ఉంగరం లేదుకానీ తగినన్ని తీపి వంటకాలు ఇంటిల్లిపాదికి భోజనాలకయ్యే ఖర్చులు, బట్టలు తెస్తామని ఒప్పుకున్నారు' అని తెగేసి చెప్పింది. దానికి అమ్మీజాన్ కోపంగా తనవైపు చూస్తూ 'అట్లంటే ఎట్లమ్మ దగ్గరి బంధువులనన్నా భోజనాలకు పిలవాలి కదా! మరీ అంత గిర్రగీసుకుంటే ఎట్లా?' అని దీర్ఘం తీస్తూ కస్సుబుస్సుమంటూ లోనికి పోయింది.

తాను ఎనిమిదో నెల పడిన తర్వాత కాన్పుకు పోతానంటే వినకుండా సాంగ్యం తెచ్చినవాళ్ళ వెంటే తన్ను కూడా బలవంతంగా పంపించివేసింది అమ్మీజాన్.

ఖాదర్ బాషా ప్రతి ఆదివారం ఒక నెల రోజులొచ్చాడు. తర్వాత ఆపని ఈపని అంటూ కుంటిసాకులు చెప్తూ రావడమే మానుకున్నాడు.

ఎంతో అన్యోన్యంగా ఉన్న ఖాదర్‌బాషా ఎందుకిట్లా మారిపోయాడా అని ఆలోచనలో పడింది తను.

తనకు ఆడపిల్ల పుట్టిందని ఫోన్‌చేసి చెప్పారు తన డాడి. అయినా ఎవ్వరూ తిరిగి చూడలేదు. నాలుగు రోజుల తర్వాత అమ్మీజాన్, ఖాదర్‌బాషా ఆడబిడ్డ పాపకు నాలుగు గౌన్లు తీసుకొని వచ్చారు. పెద్దాయన ఆడబిడ్డ పుట్టిందని అసంతృప్తితో రాలేదని మాటల సందర్భంగా చెప్పారు.

పాపకు ఫాతిమా అని నామకరణం చేశారు. ఆడబిడ్డ అని తాస్కారం చేయకుండా మా ఇంట్లో మొదటి బిడ్డ కాబట్టి పురుడు ఘనంగా చేయాలని తన డాడితో మరీ మరీ చెప్పింది అమ్మీజాన్.

పాపకు చేతుల్లో ఒక్కోతులం బంగారు కాపులు, కాళ్ళకు వెండి గట్టి గొలుసులు, స్టీలు ఊయల, చిన్న పరుపు దిండ్లు, అల్లుడూ ఆడబిడ్డకు కొత్త బట్టలు, ఖాదర్ బాషాకు బంగారు ఉంగరం ఇంకా అభిమానం ఉంటే సన్నా చిన్నా ఆట బొమ్మలతో సహా ఇయ్యచ్చని ఒక పెద్ద లిస్టే ఏకరువు పెట్టింది అమ్మీజాన్. అన్నట్లు మరచాను మా తరపున ఆ రోజు అరవైమంది వస్తారని గట్టిగా నొక్కిచెప్పింది. వీటిలో ఏవీ తక్కువ చేసినా బాగుండదని కటువుగా చెప్పింది.

పురుడు ఫంక్షన్‌కు వచ్చిన ఇరువైపు బంధువులు భోజనాలు ముగించారు. ఇక తమ ఇద్దరికీ సాంగ్యం చేయాలి. తన డాడి అన్నీ సమకూర్చారు గానీ ఉంగరం తీసుకరాలేదు. తేవాలని విశ్వప్రయత్నం చేశారు. కానీ పెండ్లి అప్పుల్లోనే నిండా మునిగిన డాడికి కొత్త అప్పు పుట్టలేదు. తను ముందే చెప్పింది. వాళ్ళు కఠినాత్ములు ఒప్పుకోరని. డాడి వియ్యంకుడితో మాట్లాడి బ్రతిమలాడుకుంటానన్నారు. బహుశా ఆయనకు తెలియకపోవచ్చు. ఖాదర్ బాషా, వాళ్ళ డాడి ఇద్దరూ ఆమె చేతిలో కీలుబొమ్మలని.

తాననుకున్నట్లే అయ్యింది. ఉంగరం లేకపోతే సాంగ్యం చేయించుకోనని మొండికేశాడు ఖాదర్ బాషా. తాను కూర్చున్న గదిలో కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు డాడి. ఆయన అవస్థ చూసి తన గుండె తరుక్కు పోయింది. ఏడ్పు ఆగలేదు.

ఇంతలో మధ్యవర్తులొచ్చి రెండు మాసాలకు ఉంగరం ఇచ్చేటట్టు ఒప్పించామన్నారు.

పొద్దున్నే ఊరికి బయలుదేరేముందు అమ్మీజాన్ తన వద్దకొచ్చి మా వెంట నిన్ను పిలుచుకపోవడం లేదు. ఒకేసారి ఉంగరం తీసుకొని రా అంటూ విసురుగా వెళ్ళిపోయింది.

నానా అవస్థలుపడి డాడి నెలరోజులకే ఉంగరం సిద్ధం చేశాడు. వెంటనే ఖాదర్ బాషాకు ఫోన్ చేశాను. తాను బయలుదేరి వస్తాను అని. "వద్దూ నాకు నెలరోజులు కడపలో ట్రైనింగ్ క్లాసుంది. నేను అక్కడ ఉండవలసి వస్తుంది. నువ్వు ఎప్పుడు రావలసింది ఫోన్ చేసి చెప్తానులే" అన్నాడు.

తాను ఫోను చేసినప్పుడంతా అదో ఇదో అని కుంటిసాకులు చెప్తూ జరగదోశాడు. ఎందుకిట్ల చేస్తున్నాడో తనకు అర్థం కాలా. మనసులో ఏవేవో ఆలోచనలు తన్ను భయపెడుతున్నాయి. ఇక బయలుదేరి పోవడమే మేలని నిశ్చయించుకొంది.

తాను అత్తగారింట్లో అడుగుపెడుతూనే ఏదో వెలితి కొట్టవచ్చినట్లు కన్పించింది. చాలాసేపు తనను ఎవ్వరూ పలకరించలేదు. కనీసం బిడ్డనుకూడా గారాబంగా ఎత్తుకోలేదు. తానేదైనా అడిగితే పొడి పొడి సమాధానాలు చెప్పడం తప్ప ఎవ్వరూ మనసు విప్పి తనతో మాట్లాడలేదు.

ఖాదర్ బాషా కూడా రెండు మూడు రోజులు ఇంటికి రాలేదు. ఎందుకు అని అడిగితే ఎవ్వరినుండి సమాధానం లేదు. తాను ఫోనుచేసి అడిగితే పనులున్నాయి వస్తానులే అని విసుక్కుంటున్నాడు. ఒక రోజు ఏమైందని ఇంటికొచ్చిని ఖాదర్ బాషాను నిగ్గదీసింది తాను. మొన్న ఫంక్షన్‌లో మాకు అవమానం జరిగిందని, మా బంధువులంతా మనసు నొచ్చుకున్నారని, నెత్తిన గింజపడినప్పటినుండి ఏ సాంగ్యమూ సంతోషంగా ఘనంగా చేయడం లేదని మా వాళ్ళంతా ఈ సంబంధం... అంటూ నీళ్ళు నములుతూ ఊరుకున్నాడు.

పాపకు పాలు తనకు భోజనాలు కూడా సరిగా విచారించడం లేదు. అతికష్టంమీద నెల రోజులు గడిపింది తాను. చివరకు ఖాదర్ బాషాకు చెప్పి పుట్టింటికి వచ్చేసింది.

వాళ్ళ వాలకం చూస్తే ఏదో అనర్థానికి ఒడిగట్టినట్లే ఉందని తన మనసు శంకిస్తూ ఉంది. తన తర్వాత ముగ్గురు చెల్లెల్లకు పెళ్ళిళ్ళు కావాలి. ఈ విషయం తెలిస్తే డాడి బాధతో గిలగిలలాడిపోతారు. రేయింబవళ్ళు ఒకటే ఆలోచన ఏం జరుగుతుందోననే భయంతో ఆర్నెల్లు గడిచిపోయింది.

ఖాదర్ బాషా రెండో పెళ్ళి చేసుకున్నాడని తన దగ్గరి బంధువొచ్చి చెప్పాడు. ఇంట్లో అందరూ దిగులుతో కూలిపోయారు. అందరి ముఖాల్లో నైరాశ్యము ఆవరించుకుంది.

తాను మాత్రం ఇసుమంత చలించలేదు. ఎన్నాళ్ళీ బానిస బతుకు? ఈ అన్యాయాన్ని ఎదుర్కోవాలని నిర్ణయించుకుంది. గుండె దిటవు చేసుకుంది. మరుసటి రోజు చంటిబిడ్డ నెత్తుకొని రాయచోటికి బయలుదేరింది. నిఖా చేసే సర్ఖాజీని కలుసుకుంది. పెళ్ళి తానే చేశానని ఒప్పుకున్నాడు. ముస్లిం పురుషులు నాలుగు పెళ్ళిలైనా చేసుకోవచ్చని షరియత్‌ను వల్లించాడు. సరేనని నిఖా సర్టిఫికెట్ ఇవ్వమని అడిగింది. ఆయన పది రోజులు సతాయించి విధిలేక ఇచ్చినాడు.

నాలుగు పెళ్ళిళ్ళ మాట ముస్లిం పెద్దల నడిగింది. వాళ్ళూ తప్పులేదన్నారు. పోలీస్ స్టేషనులో కేసుపెట్టింది. రేపు మాపు అని పది రోజులు తిప్పుకొని తుదకు వాళ్ళూ అదే చెప్పారు.

మూడు నెలలు తిరిగినా శ్రమ తప్ప ఏం ఫలితం

# గుర్తుందా..?

ఎర్రెక్కినట్టు, కైపు మీమన్న
నింగిలో అంత పుష్కలంగా చుక్కలు
నేనెన్నడూ ఎరగను !
నీ కంటిపాపల్లో
నా ఆత్మను నేను చూసుకున్న
ఆ రాత్రి నేలా నింగీ నేనూ నీవై
సమాంతర నాగేటి ఛాళ్ళలా
నిలబడిపోవాలన్న
నిర్ణయం తీసుకున్న
ఆ మనోహర రాత్రి.
కాళ్ళ కింద పరచుకున్న
కాలాతీత జలధి యేదో
జీవితం తాలూకు
గందరగోళాన్నంతా
మెరిసే గవ్వల్లో కూరి
గగనంలోకి విసిరినట్టు
ఆ నక్షత్రాల కాళరాత్రి !
పంతం మానేసి
పండిపోయిన యెండుటాకుల్లా

- తిరువాయపాటి రాజగోపాల్
5957316905 7



నువ్వూ నేనూ . మాట్లాడుకుంటామని
మళ్ళీ మళ్ళీ మళ్ళీ
నాకు నేను సర్ది చెప్పుకుంటూనే ఉంటాను
పరువాలనాడు
నీపైన నాకు పిచ్చి వ్యామోహముండేదని
ఒప్పేసుకుంటాను
అది నీకు తెలుసని నువ్వు కప్పిస్తావా?
నీకు తెలుసని నాకూ తెలుసని
నేనూ నవ్వేస్తాను .
నీకూ నాకూ కలవడానికింత
చోటివ్వని ఇరుకు సామ్రాజ్యం
ఈ సువిశాల విశ్వం !!!

---

కన్పించలేదు. అయినా తాను నిరుత్సాహపడలేదు. సహాయం చేయమని అడ్డమైన వాళ్ళ నడిగింది. అందర్నీ అర్థించింది. నిద్రాహారాలు అనుకోకుండా తిరిగింది.

ఒకరోజు డిఈవోను కలిసి తన గోడును వెళ్ళబోసుకుంది. తన నికా సర్టిఫికెట్ చూసి నిట్టూర్చింది ఆమె. 'టీచర్ రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడా?' అంటూ మహజర్ రాసి యిమ్మంది. అతన్ని సస్పెన్షన్ చేస్తాను పొమ్మని భరోసా ఇచ్చింది. తనలో ధైర్యం ఇనుమడించింది.

ఒక రాజకీయ పెద్ద మనిషితో పోలీసు స్టేషనుకు ఫోను చేయించుకొని మళ్ళీపోయింది. సస్పెన్షన్ ఉత్తర్వులు చూసి వాళ్ళు రిపోర్టు తీసుకున్నారు. విచారించి కేసు రిజిస్టర్ చేస్తాం పొమ్మన్నారు.

సాక్షులందర్నీ విచారించి కేసు కొలిక్కి రావడానికి రెండున్నరేళ్ళు పట్టింది. కాళ్ళరిగేలా తాను కోర్టు చుట్టూ తిరుగుతూ ఉంది.

కోర్టు జవాన్ పిలుస్తున్నాడు. ఆమె గుండె దడదడలాడుతూంది. ఆమె, బిడ్డ యిద్దరు కోర్టు హాలులోకి వచ్చారు. ఖాదర్ బాష మరో వైపునుండి వచ్చాడు.

'సైలెన్సు' అన్న కోర్టు జవాను కేకతో హాలంతా నిశబ్దం ఆవరించుకుంది. లోపల గదిలోనుండి గంభీరంగా తన సీటు వద్దకు వచ్చిన జడ్జీ సభికులందరికి నమస్కరించి కూర్చున్నాడు. అందరూ లేచి నిల్చుని ప్రతి నమస్కారం చేశారు.

జడ్జీ ముద్దాయిని ఉద్దేశించి 'తీర్పు చెప్పేముందు నీవేమైనా చెప్పుకుంటావా' అన్నాడు. అతను 'నేను ముస్లింను సార్. నాలుగు పెళ్ళిళ్ళైనా చేసుకోవచ్చు. అందరికి ఇదే చెప్పాను' అన్నాడు నిర్భయంగా.

ప్రభుత్వ ఉద్యోగి రెండు పెళ్ళిళ్ళు చేసుకోవడం నేరం. చట్ట సమ్మతం కాదు కాబట్టి "మూడు సంవత్సరాలు జైలు శిక్ష, ఇరవై అయిదు వేలు జరిమానా విధిస్తున్నామని చెప్పి" జడ్జి బెంచి దిగిపోయాడు. ◆

# మనిషి లాంటి దేవుడు

- అల్లూరి గౌరీ లక్ష్మి
9948392357




ఒకప్పుడు దేవుడిలాంటి మనుషులుండేవారు
సామాన్యులు దేవుడి స్థాయికి ఎదగాలనుకునేవారు
ఈ కలిలో కాలం తిరగబడింది, మనిషి దేవుడయ్యాడు
ఇప్పుడింక దేవుడే అతడిని అనుకరిస్తున్నాడు

పూర్తిగా మనిషిలా మెలగాలని తపిస్తున్నాడు
మానవుడి ఎత్తు జిత్తులన్నీ వంటబట్టించుకున్నాడు
లాభ నష్టాల లెక్కలు పూర్తిగా నేర్చేసుకున్నాడు
వజ్రాల కిరీటం కోసం అక్రమ దీవెనలిస్తున్నాడు

వెండితొడుగుల కాశపడి మాఫియాకి వరాలిస్తున్నాడు
అమ్మవారితో చెప్పి పట్టుచీరల్ని మాయం చేస్తున్నాడు
గుడికట్టిస్తానంటే మురిసి ఏసీబీ నుంచి రక్షిస్తున్నాడు
తన చుట్టూ జరిగే మోసాలు చూడనట్టు నిద్ర నటిస్తున్నాడు

భగవంతుడిప్పుడు అచ్చంగా మనిషిలా మారిపోయాడు
పీఠం పెద్దల్ని రప్పిస్తే పాపాలన్నీ మాఫీ అంటున్నాడు
క్విడ్ ప్రోకో ఆటలో చేరి నీకిది నాకది అని నవ్వుతున్నాడు
రాజకీయ యాగాలకి పొంగిపోయి ఏకగ్రీవంగా
గెలిపిస్తున్నాడు

నేడు దేవుడు తననే నమ్మే భక్తులను
విదిలించుకుంటున్నాడు
నిస్వార్థంగా నడిచే వాళ్ళను నిర్దయగా శిక్షిస్తున్నాడు
స్వార్థంతో ప్రజల కడుపు కొట్టేవాళ్లను
కనికరిస్తున్నాడు

సత్తె కాలపు సత్తెయ్యల్ని కష్టాల పాల్చేస్తున్నాడు
నిజాయితీగా నడిచేవాళ్ల నడ్డి విరుస్తున్నాడు
కబ్జాకోరుల్ని కరుణతో కోటేశ్వరుల్ని చేస్తున్నాడు

ఒకనాటి మనుజులకి దేవుడాదర్శంగా ఉండేవాడు
ఇప్పుడు దేవుడు మనిషి ఎత్తుకి చేరుకున్నాడు
ఇద్దరూ చెట్టాపట్టాలేసుకుని ఈ నేలనేలుతున్నారు ◆

---

# భావమొక్కటే

- అమూల్యాచందు
9059824800

ఎన్ని రణగొణ ధ్వనులు చెవుల్ని బద్దలు
కొడుతున్నా
అవి నన్నంటుకోవడం లేదు...
ఎన్ని శబ్దాలు నాలో
ప్రవహించాలనుకుంటున్నా
ఇనుప కచ్చడాలేవో నాలోకి రానివ్వడం
లేదు...
పరధ్యానాన్నంతా పోగేసుకుని చేతుల్లోకి చేరిన
టీ తాగుతున్నాను...
చాలా తెలివిగలది కదా ఆ కప్పు
నెమ్మదిగా నా నిశ్శబ్దాన్ని తాగుతోంది...
నా పెదాలను తాకిన పంచదార
ఎప్పుడు ఆత్మహత్య చేసుకుందో
గమనించనేలేదు...
ఉన్నట్టుండి నా నాలుక చేదుకు
బానిసైపోయింది...




నా నిర్జీవ ముద్దులకు కప్పు కూడా
ముడుచుకుపోయింది...
చప్పరింతల మధ్య ఎన్నో ప్రశ్నల్ని
గొంతులో ఘాటుగా ఒంపుతోంది...
తన ఒంటి చివర్లను నిమిరే వేళ్ల కన్నీళ్లు
చదివిందేమో...
అప్పటి వరకూ సెగలు, పొగలు కక్కిన
టీ చప్పున చల్లారిపోయింది....
బుగ్గ మీద ఆరిన కన్నీటి చార...
కప్పు అడుగున ఎండిపోయిన టీ చుక్క
చార...
భాషలు వేరైనా...భావాలొక్కటే ◆



కందుకూరి వీరేశలింగం
**(16.04.1848 -27.5.1919)**

# వీరేశలింగం రచనలు సమాజ అభ్యుదయం

- డా॥ వీపూరి వేంకటేశ్వర్లు
9885585770

**19**వ శతాబ్దం ఉత్తరార్థం నుంచి సంఘ జీవనంలోనూ, శాస్త్ర సాంకేతిక రంగాల్లోనూ చాలా మార్పులు వచ్చాయి. దీనికి చారిత్రక కారణాలెన్నో దోహదం చేశాయి. సంఘంలో వేళ్ళూనికొనిపోయిన మూఢనమ్మకాలు, ఆచారాల వల్ల కలిగే నష్టాల్ని ప్రజాభ్యుదయం కాంక్షించేవాళ్ళు అడ్డంకులుగా గుర్తించారు. వీటి నుంచి ప్రజల్ని బయటపడేటట్లు చెయ్యడానికి భారతదేశంలో ఎంతోమంది ఉద్భవించారు. రాజా రామమోహన్‌రాయ్ లాంటి స్వదేశస్థులే గాకుండా, విలియం బెంటింగ్ లాంటి విదేశస్థులు కూడా భారతీయ సమాజోద్ధరణకు శ్రమించారు. ఈ దుస్సంప్రదాయాల్లోని సత్యాసత్యాల్ని ప్రజలకు తెలియజెప్పగల సదవకాశం కవులకూ - రచయితలకూ ఉన్నతంగా మరే రంగంలోనూ ఉండదు. ఈ అవకాశాన్ని ఆంధ్రదేశంలో వీరేశలింగం గారు చేజిక్కించుకున్నారు. తెలుగు సాహిత్య, సామాజిక, శాస్త్ర రంగాల్లో అవిరళకృషికి కారకుడై, సంఘ సంస్కరణోద్యమానికి ఉజ్జ్వల ధృవతారగా చరిత్ర పుటలలో నిలిచిపోయారు.

వీరేశలింగం సుబ్బరాయుడు, పున్నమాంబ దంపతులకు క్రీ.శ.1848వ సం॥ ఏప్రిల్ 16వ తేదీ రాజమండ్రిలో జన్మించారు. వీరేశలింగానికి నాలుగేళ్ళు రాకముందే తండ్రి మరణించడం వల్ల పెదతండ్రి వెంకటరత్నం పంతులు గారి దగ్గర పెరిగారు. ఆయన తన విద్యాభ్యాసంలో అనేక ఒడుదుడుకుల్ని ఎదుర్కొన్నారు. అయినప్పటికీ తరగతిలో మేటి విద్యార్థిగా ఉండి, అన్ని పరీక్షల్లోనూ ఉత్తీర్ణుడవుతూ వచ్చారు. ఆయన చిన్నతనంలోనే 'సోమరాజు' గారి బడిలో బాల రామాయణం, అమరకోశం, రుక్మిణీకల్యాణం, సుమతీ శతకం, కృష్ణ శతకం, ఆంధ్రనామ సంగ్రహం మొదలైన గ్రంథాల్ని చదువుకున్నారు. తర్వాత ఉద్యోగం చెయ్యడానికి తగిన తర్ఫీదు పొందడం కోసం 'పోతరాజు రఘురామయ్య' గారి దగ్గర చేరి, అక్కడ పని నేర్చుకుంటూ రఘువంశం లాంటి కావ్యాల్ని చదువుకోసాగారు. ఆ తర్వాత ఆంగ్లం నేర్చుకోవడానికి పన్నెండేళ్ళ మండల పాఠశాలలో చేరారు. పురాణాల్ని చదవడానికి ఆ వయస్సులోనే వయస్సులో వారికి ఆసక్తి కలిగింది.

వీరేశలింగానికి 13 ఏళ్ళ వయస్సులో నుండగా తొమ్మిదేండ్ల రాజ్యలక్ష్మితో వివాహమయ్యింది. ఆమె విద్యావంతురాలు. ఆమె భర్త అడుగు జాడలలో నడుస్తూ, అహర్నిశలు శ్రమిస్తూ, అన్ని విధాలుగా జీవితాంతం భర్తకు సహాయసహకారాలను అంది[illegible]. అయితే వారికి సంతానం కలుగలేదు. 1[illegible] సం॥లో గోగులపాటి శ్రీరాములు గారి కుమారుణ్ణి ఆమె దత్తతకు తీసుకొని, అతనికి

కూడా 'వీరేశలింగం' అనే పేరును పెట్టి పెంచి, పెద్ద చేసింది.

వీరేశలింగం 1870లో మెట్రిక్యులేషన్ పరీక్షల్లో ఉత్తీర్ణుడైనప్పుడు ఆయన పెదతండ్రి మరణించాడు. కుటుంబ పోషణ కోసం చదువుమాని, ఉద్యోగం కోసం ప్రయత్నించి, 1871లో రాజమండ్రిలో మండల పాఠశాలలో అప్పటి ప్రధానోపాధ్యాయులైన 'కుప్పుస్వామి శాస్త్రుల' వారి సహాయం వల్ల సహాయోపాధ్యాయుడుగా నియమితుడయ్యారు. విద్యార్థులకు ఆంగ్లం, గణితం, భారతదేశ చరిత్రలను బోధించేవారు. శిష్యులను దగ్గరగా తీసుకొని, వారికి మంచినీతి వాక్యాలను బోధిస్తూ తన వృత్తికి కీర్తి ప్రతిష్ఠలను సంపాదించారు. క్రమశిక్షణ లోపించిన శిష్యులను శిక్షించడంలో పక్షపాతం గానీ, భయం కానీ లేకుండా ఉండేవారు.

1871లో ఎల్.ఎల్.బి పరీక్షలో ఉత్తీర్ణుడయి, న్యాయవాద వృత్తిని చేపట్టారు. కాని ఆ వృత్తిలోనున్న లోటుపాట్లను సహించలేకపోయారు. తర్వాత 1872 సం.లో కోరంగిలో ఆంగ్ల పాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగా అమావాస్య రోజు ఉద్యోగంలో చేరి, మూఢ నమ్మకాల్ని కొట్టిపారేశారు. 1874లో ధవళేశ్వరంలోని ఆంగ్లోవెర్నాక్యులర్ స్కూల్లో హెడ్‌మాస్టర్‌గా, 1876లో రాజమండ్రి గవర్నమెంట్ స్కూల్లో అసిస్టెంట్ తెలుగు టీచర్‌గా, తర్వాత 1899లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో సీనియర్ తెలుగు పండితుడుగా చేరి, బోధనా వృత్తిలో రాణించారు. మరొక వైపు తెలుగు సాహిత్య రంగంలోను – సంఘంలోను పేరుకుపోయిన దురాచారాలను నిర్మూలించడానికి తన జీవిత సర్వస్వాన్ని ధారపోశారు.

మూఢాచార నిర్మూలన, స్త్రీ పునర్వివాహం, స్త్రీవిద్య, బాలికా పాఠశాలల స్థాపన, గ్రంథాలయ స్థాపన, పత్రికా నిర్వహణ ద్వారా ప్రజలకు ఉపయోగపడాలనే ఉద్దేశ్యంతో తన రచనల ద్వారా అహర్నిశలు శ్రమించారు.

తెలుగు భాషలో మృదువైన సులభ శైలిలో–సలక్షణమైన వచన రచన చేయటం కోసం; ప్రజల్లోనున్న దురాచార దుర్వర్తనాలను పోగొట్టి, వారికి అభ్యదయ మార్గాన్ని చూపి, నీతిమంతులుగా చేయటం కోసం; దేశాన్ని ఉన్నత స్థితిలోకి తీసుకొని రావడానికి శక్తివంచన లేకుండా పాటుపడడం కోసం 1874లో అక్టోబర్‌లో వివేక వర్ధిని అనే మాస పత్రికను ప్రారంభించారు. అయితే కనీసం పెట్టుబడి కూడా రాక నష్టాలతో నడుస్తున్నా, పత్రికను నిలుపు చెయ్యకుండా ఖర్చుల్ని భరిస్తూ, దేశంలో జరిగే అన్యాయ–అక్రమాలను పత్రిక ద్వారా అందరికీ తెలియజేయడానికి కృషిచేశారు. అందుకే ఈ పత్రిక తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసి, తెలుగు సారస్వతంలో ప్రక్రియా వైవిధ్యాన్ని తెచ్చిపెట్టి, శాశ్వతమైన కీర్తిని సంపాదించిపెట్టింది.

1876లో 'హాస్య సంజీవని' అనే పేరుతో హాస్యరస ప్రధానమైన ఒక మాసపత్రికను వివేకవర్ధినికి అనుబంధంగా ప్రచురించారు. 1883లో స్త్రీల కష్టాలను దృష్టిలో ఉంచుకొని 'సతీహిత బోధిని' అనే మరొక మాసపత్రికను ప్రారంభించారు. ఇంకా 'పురుషార్థ ప్రదాయిని', 'ఆంధ్రభాషా సంజీవని' మొదలైన పత్రికలను కూడా నడిపారు.

తర్వాత వీరేశలింగం 1875లో నాటక రచనకు పూనుకొని దాదాపు 27 ఏళ్ళ కాలవ్యవధిలో 20 నాటకాలను రచించారు.

ఆంగ్ల కవులలో అగ్రగణ్యుడిగా వినుతికెక్కిన షేక్‌స్పియర్ రాసిన 'కామెడి ఆఫ్ ఎర్రర్స్'ను 'చమత్కార రత్నావళి' అనే పేరుతో; 'మర్చెంట్ ఆఫ్ వెనీస్' అనే నాటకాన్ని 'వెనీస్ వర్తక చరిత్రం' అనే పేరుతో; అలాగే ఆర్.బి.ఫెరడాన్' రాసిన 'డ్యానా' అనే నాటకాన్ని 'రాగమంజరి' అనే పేరుతో; షెరిడాన్ రాసిన 'దిరైవల్' అనే నాటకాన్ని 'కల్యాణ కల్పవల్లి' అనే పేరుతో అనువాదం చేశారు. అంతేకాదు సంస్కృతంలో కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలం–మాళవికాగ్ని మిత్రం, శ్రీహర్షుని రత్నావళి, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయం అనే నాటకాలను కూడా అనువాదం చేశారు.

1885లో మహాభారత విరాటపర్వంలోని 'దక్షిణ గోగ్రహణం' ఆధారంగా 'దక్షిణ గోగ్రహణం' అనే అయిదు అంకాల స్వతంత్ర నాటకాన్ని రచించారు. ఇంకా ప్రహ్లాద చరిత్రం, సత్యహరిశ్చంద్ర నాటకాలను కూడా వ్రాసి, ప్రజల ఆదరాభిమానాల్ని సంపాదించారు.

1876లో 'బ్రహ్మ వివాహం' అనే సాంఘిక నాటకాన్ని రచించి, తన 'హాస్య సంజీవని' పత్రికలో ప్రచురించి పండితపామర ప్రశంసల్ని పొందారు. తర్వాత వ్యవహార ధర్మబోధిని, మహారణ్య పురాధిపత్యం, తిర్యగ్విద్వన్మహాసభ, మూషికాసుర విజయం, కలిపురుష శనైశ్చర విలాసం, వేశ్యాప్రియా ప్రహసనం, కౌతుక వర్ధని, వినోద తరంగిణి అనే స్వతంత్ర ప్రహసనాలను రచించారు. అంతేకాదు ఆంగ్ల

రచనకు అనుసరణగా అపూర్వ బ్రహ్మచర్యం, విచిత్ర వివాహం, మహాబధిర ప్రహసనం, రంభాచార్య విలాసం, పునర్మరణ ప్రహసనం, బలాత్కార గాన వినోదం, కలహప్రియా ప్రహసనం, మహామహోపాధ్యాయ, యోగనిద్ర, మహావచన, అసహాయశూర ప్రహసనాలును కూడా రచించారు.

ప్రహసనం దృశ్య రూపకం. ఇందులో హాస్యం ప్రధాన రసంగా ఉంటుంది. దీనిని ఆంగ్లంలో 'రెస్టోరేషన్ డ్రామా' అంటారు. వీరేశలింగం ఈ ప్రక్రియను ప్రధానంగా సమాజాభ్యుదయాన్ని సాధించడానికి వాడుకున్నారు.

1880లో స్త్రీ పునర్వివాహం, వివేక దీపిక లాంటి అసంపూర్తి నాటకాలను కూడా స్త్రీ సంక్షేమం కోరి రచించారు.

వీరేశలింగం తన చిన్నతనంలోనే మార్కండేయ శతకం, గోపాలశతకం అనే రచనలను కంద పద్యాల్లో రాశారు. వీటిని పాఠశాలల్లో పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించారు. ఇంకా శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం, రసికజన మనోరంజనం, శుద్ధాంధ్రోత్తర రామాయణం, నీతి దీపిక, శుద్ధాంధ్ర భారత సంగ్రహం మొదలైన పద్య కావ్యాలను కూడా రచించారు. తర్వాత పద్య కావ్యాల కంటే వచన కావ్యాల వల్ల ప్రయోజనమెక్కువని ఆలోచించి, మొదటగా నీతిచంద్రికను వ్రాసి 1874లో ముద్రించి ప్రచురించారు. తర్వాత భారత సంగ్రహం, అభాగ్యోపాఖ్యానం వంటి వచన కావ్యాలను రచించారు.

1883లో ప్రత్యేకంగా మహిళా మనోవికాసాన్ని ఆశించి వీరేశలింగం 'సతీహిత బోధిని' అనే పత్రికను ప్రారంభించి, అందులో స్త్రీలు – పిల్లలు వినోదంగా చదువుకోవడానికి వచన రూపంలో పదహారు కథలను సులభశైలిలో వ్రాసి, ప్రచురించారు. అవేవంటే చమత్కార రత్నావళీ, సతీమణి విజయం, సుమిత్ర చరిత్రం, రఘుదేవ రాజీయం, కురంగేశ్వర వర్తక చరిత్రం, కళావతీ పరిణయం, గయ్యాళిని సాధు చేయుట, చిత్రకేతు చరిత్రం, దానకేసరి విలాసం, వైదర్భ విలాసం, భానుమతీ కల్యాణం, సరసజనమనోభిరామం, మాలతీ మధుకరం మొదలైన కథలు వీటిలో కొన్ని కథల్ని కళాశాలల ప్రవేశ పరీక్షకు పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించారు.

వీరేశలింగం తన ముప్పయవ యేట నవలా రచనకు పూనుకున్నారు. 1878లో మొదటగా 'రాజశేఖర చరిత్ర' అనే నవలను వ్రాశారు. ఈ నవల అలీవర్ గోల్డ్‌స్మిత్ రాసిన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్'కు ఛాయానుసరణ. స్త్రీల కోసం 'సత్యవతీ చరిత్ర' అనే నవలను వ్రాశారు. తర్వాత సత్యరాజా పూర్వదేశ యాత్రలు అనే నవలను జొనాథన్ స్విఫ్ట్ రాసిన గలీ వర్స్ ట్రావెల్స్‌కు ఛాయానుసరణగా రచించారు. ఆ తర్వాత చంద్రమతీ చరిత్రం, సత్య సంజీవని అనే నవలను కూడా వ్రాసినా, అవి నవలలు కావని పలువురు విమర్శకులు తేల్చారు.

వీరేశలింగం చాలా సభల్లో ఉపన్యాసాలిచ్చారు. ఇవన్నీ తర్వాత పురుషార్థ ప్రదాయిని పత్రికలో అచ్చయ్యేవి. 1879 జులై నెలలో 'శ్రీ విజయ నగర మహారాజు' గారి బాలికా పాఠశాలలో మొట్టమొదటిసారి స్త్రీ పునర్వివాహం గురించి ఉపన్యసించారు. తర్వాత దానధర్మాల గురించి, వేశ్యల గురించి, ఐకమత్యం గురించి, దేశీయ మహా సభల గురించి, స్త్రీ విద్య గురించి, మూఢనమ్మకాల గురించి వరకట్నాన్ని గురించి చాలా ఉపన్యాసాలు చేశాడు.

వీరేశలింగం చదువువేరు – సద్గుణము వేరు, దయ్యములు, విద్య, వైద్యులు, హిందూ దేశాభివృద్ధి మార్గము, కన్యాశుల్కము, త్రాగుబోతు తనము, దేశాభిమానము, సంఘ విద్యాభ్యాసము, కృష్యాది వ్యాపారము, దేశ భాషలు, దేశాభివృద్ధి సాధనము, మతకలహములు, భార్యాభర్తల ఐక్యమత్యము, స్వబంధు జనాభిమానము అనే వ్యాసాలను ప్రచురించారు. వీరి వ్యాస రచనల్లో లౌకిక–సాంఘిక దృక్పథం, సంస్కరణ ప్రబోధం కన్పిస్తాయి.

1878లో జనులలో ఉన్న మూఢ విశ్వాసాలను పోగొట్టడానికి శాస్త్రీయ గ్రంథ రచనను శ్రీకారం చుట్టారు. మొదట ప్రజలకు ప్రకృతి శాస్త్ర జ్ఞానం ఉండాలని ప్రకృతి శాస్త్ర గ్రంథాన్ని రచించారు. తర్వాత పదార్థ వివేచన శాస్త్రాన్ని ప్రశ్నోత్తర రూపంలో ప్రచురించారు. 1888లో శరీర శాస్త్రాన్ని, 1895లో జ్యోతిశాస్త్ర సంగ్రహాన్ని చిత్ర పటాలతో సహా ప్రచురించారు. ఇంకా భూగోళ స్వభావ దీపిక అనే శాస్త్రీయ గ్రంథాన్ని కూడా రచించారు.

వీరేశలింగం 'స్వదేశ సంస్థాన చరిత్రములు' అనే దేశ చరిత్ర గ్రంథాన్ని మొదటగా వ్రాసి, 'చింతామణి' పత్రికలో ప్రచురించారు. తర్వాత జీసస్ చరిత్రం, రాజారామ్ మోహనరాయల చరిత్రం, విక్టోరియా మహారాజ్ఞి చరిత్రం, శంకరాచార్యుల చరిత్రం, జోన్ ఆఫ్ ఆర్క్, ఎలిజబెత్ వంటి ప్రముఖుల జీవిత చరిత్రల్ని వ్రాశారు. అంతేకాదు ఆంగ్ల ప్రభావంతో వచ్చిన 'స్వీయ చరిత్ర'ను కూడా మొదటగా

# స్వేచ్ఛా సరిహద్దు

- వైష్ణవిశ్రీ
8074210263

రాత్రి నిద్రెందుకో గతాన్ని తోడుతుందెప్పుడూ
అందమైన అబద్ధంతో మోసగించటం చేతకాదు కాబోలు

అప్పుడే తెగిపడిన పక్షిరెక్కల శబ్దం
చెవిని తాకక ముందే
గుండెలో గునపాలు దిగుతాయి
కలత నిద్రకు ఉలిక్కిపడిన కళ్లు టపేలున
తెరుచుకుంటాయి
పసిపాప లేలేత పాదాలు పరుగులు తీయలేక
అలసిపోతాయప్పుడు



పచ్చని చెట్టొకటి ఉరితీయబడిందనటానికి సూచనగా
పక్షి గూడు చెదిరి
పిల్లలన్నీ తలా దిక్కుకు విసిరేయబడతాయి
దేశం గుండె బద్దలైనట్టుంది

నగ్నశరీరాన్ని మోయలేక మోస్తోందిప్పుడు

అంకెల్ని గుచ్చే గడియారంలో
రేయింబగళ్ళ ముళ్ళు రెండూ
గోడ మీదే ఆరు కాలాల్ని
ఆరగించుకుంటాయి
పసిపాప లేలేత పాదాలతో పోటీపడుతూ

నా నిద్ర రాని రాత్రి తెల్లారట్లేదని
నేను కలల్ని జోకొడుతుంటాను
నిద్రమత్తును విడిచిన దేశ మిప్పుడు
స్వేచ్ఛా సరిహద్దును ముద్దాడుతోంది
వందేమాతరమంటూ... ◆

---

తెలుగులో వీరేశలింగం గారే రాశారు. అలాగే 19వ శతాబ్దం చివరలో పరిశోధన కావించి మొదట ఆంధ్రకవుల చరిత్రను కూడా రాశారు.

ఇంకా 'కర్నల్ మేక్డానల్డు దొర' గారు విద్యా విచారణాధికారిగా నున్న కాలంలో వీరేశలింగం ప్రభుత్వం కోసం రెండవ పాఠ్య పుస్తకాన్ని రాశారు. 'మార్సుడన్' దొరగారి కోరిక మీద 'మాక్మిల్లన్' కంపెనీ వారికి నాల్గవ, అయిదవ, ఆరవ తరగతి వాచకాలను రాసిచ్చారు.

పాశ్చాత్యుల నాగరికతలోని విపరీత ధోరణులను చూసి, అసహ్యించుకున్న ప్రథమ జాతీయవాదులలో వీరేశలింగం గారు ప్రసిద్ధులు. వీరు సాహిత్యంలోని పలు ప్రక్రియలను ఆకళింపు చేసుకొని, ఆంధ్ర శారదను నూతనాభరణాలతో అలంకరించాలని సంకల్పించుకొని తన వ్యాసాలు - ఉపన్యాసాల ద్వారా సారస్వత విమర్శ చేశారు.

ఆ రోజుల్లో భాగవతం వ్రాసిన బమ్మెర పోతన కడప జిల్లాలోని ఒంటిమిట్ట వాడా? వరంగల్లు జిల్లాలోని ఏకశిలా నగరం వాడా? అనే వాద వివాదాలు ఉద్ధృతంగా నడుస్తున్నాయి. దీనిమీద వీరొక వ్యాసం ఆంధ్ర పత్రికకు వ్రాయాలను కొన్నాడు. వ్యాస రచన పూర్తి అయ్యేలోపుగా వారికి పెద్ద పెట్టున జ్వరం వచ్చి, అది విషజ్వరంగా పరిణమించింది. అయినప్పటికీ ఆ వ్యాసాన్ని చదవటంలో, ప్రూఫ్‌లు దిద్దటంలో వీరు ఇతరుల సాయాన్ని తీసుకోవడానికి ఇష్టపడలేదు. అలాగే ఆ పని పూర్తి చేశారు. ఆ సాయంత్రానికి జ్వరం లక్షణాలు తీవ్రంగా పరిణమించి, 1919 మే నెల 27న ఉదయం 4:20 ని.లకు తుది శ్వాసను విడిచారు. తెలుగు తేజానికి సూర్యుడయ్యారు.

వీరేశలింగం గారి కృషిని 1898లోనే ఆంగ్ల ప్రభుత్వం వారు గుర్తించి 'రావు బహద్దూర్' అనే బిరుదునిచ్చి సన్మానించారు. మద్రాసులో జరిగిన భారతీయ సాంఘిక సభకు అధ్యక్షత వహించి, 'మహదేవ గోవిందరనడె' ద్వారా 'దక్షిణ భారత విద్యాసాగర్' బిరుదును పొందారు. తెలుగులో అనేక వచన గ్రంథాలు రాసి 'గద్య తిక్కన' అనే బిరుదును పొందారు.

ఇలా వీరేశలింగం గారు గొప్ప పండితునిగా, కవిగా, విమర్శకునిగా, జిజ్ఞాసువుగా, తత్త్వవేత్తగా, అన్నింటికీ మించి గొప్ప ధైర్యశాలిగా పేరును పొందారు. వీరు తన రచనల ద్వారానే కాకుండా, ఆచరణల ద్వారా కూడా సమాజాభివృద్ధి కొరకు పాటుపడ్డారు. విశ్రాంతి లేని జీవితాన్ని గడిపి, ఆంధ్రవాఙ్మయ వికాసానికి నన్నయలాగా కృషి చేశారు. ఆంధ్రులందరికీ ప్రాతఃస్మరణీయుడయ్యారు. ◆

## పురస్కారాలు

# సాహిత్య ప్రస్థానం మార్చి 2019 పురస్కారాలు

**జీబ్రాన్ ప్రవచనాలు - జీవిత మౌలిక భావనలు**
వ్యాసం: రూ.500/-
రచయిత : డా॥ జి. వెంకటరమణ

**మూలాలు**
కవితకు : రూ .500/-
రచయిత : బాల త్రిపుర సుందర తేజ

■■■

కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

■■■

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. తగిన రచనలు లేనప్పుడు పురస్కారాలు ప్రకటించబడవు.

- ఎడిటర్

## కవిత

# బలి పునరుత్థానం

- డా. కె. శ్రీనివాసులు రెడ్డి
7013809288

ఎవ్వడికైనా తల శరీరంపైనే ఉంటుంది
తక్కువోడికి పైన ఉండకూడదని నరికేస్తావా ?

తల ఉన్న ప్రతోడికీ ఆలోచన ఉంటుంది
ఆలోచనే నేరమని అండ్రాయిడ్ సెల్లో బంధిస్తావా?

రూపు దాల్చిన ప్రతి ఆలోచన ప్రశ్నను కలిగి ఉ
ంటుంది
ప్రశ్నకు సమాధానంగా తూటాలిస్తావా?

రగులుకునే ప్రతి ప్రశ్నా చైతన్యమై ఉంటుంది
చైతన్యమే దేశ ద్రోహమని అర్బన్ నక్సలైట్
అంటావా?

పిడికిలెత్తిన చైతన్యం ఎరుపై ఉంటుంది
ఎరుపంటే భయపడే పిరికిపందల్లారా!

మేము లేస్తే మీ ఉనికికే ప్రమాదమని
మా నుదుటిన రాక్షసులనే ముద్రలేసి
అవతారాలెత్తి మరీ హత్యలు చేశారు
పాతాళానికి తొక్కేశారు



మా చైతన్యం ఎర్రని ఉదయమై
పాతాళంలోనూ ఉదయిస్తుంది
తరతరాల చీకట్లను చీల్చుకుంటూ
పాతాళం నుండీ
బలి సూర్యుడై ఉదయిస్తాడు

సూర్యోదయాన్ని తొక్కి పెట్టగలవా?
వెలుతురును పిడికిట పట్టగలవా? ◆



# సలీం కథల్లో స్త్రీ మనోభావాల చిత్రీకరణ

- డా. వి. గీతానాగరాణి

చదువుల్లో, ఉద్యోగాల్లో, వ్యాపారాల్లో పురుషులకు దీటుగా రాణిస్తున్నా స్త్రీలు సైతం సాధికారత కోసం పోరాడుతూనే ఉన్నారు. ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసం మెండుగా ఉన్న స్త్రీలు సరిపడని భర్తలకు దూరంగా తమకిష్టమైన రీతిలో జీవితాల్ని మల్చుకుంటున్నారు. స్త్రీ స్వేచ్ఛకు మొదటి మెట్టు చదువు... రెండో మెట్టు ఆర్థిక స్వావలంబన. ఈ రెండూ తప్పకుండా ఆత్మ స్థైర్యాన్ని పెంపొందిస్తాయి. చదువు లేకున్నా ఆర్థిక స్వేచ్ఛ స్త్రీలో ధైర్యాన్ని నింపుతుంది. భర్త సంపాదన మీద ఆధారపడకుండా కూలి చేసుకుని బతికే మహిళ సైతం భర్త దాష్టీకాల్ని ఎదిరించడానికి వెనుకాడదు.

సలీం కథల్లో స్త్రీవాద కథల నిర్వచనంలో ఒదిగే కథలు తక్కువే. స్త్రీల మనోభావాల్ని అద్భుతంగా వాళ్ళలోకి పరకాయప్రవేశం చేసినట్టు చిత్రించిన కథలే ఎక్కువ. అచ్చమైన స్త్రీవాద కథ సలీం రాసిన 'ఆకాశమంత' కథ. తన భర్త జీవితంలో మరొక స్త్రీ ఉందని తెలిసినా అది విధిరాత అనుకుని రాజీపడటానికి ఇప్పటి మహిళలు సిద్ధంగా లేరు. దీనికి ఈ కథలోని మాలతినే ఉదాహరణ. మాలతిని ప్రేమించి పెళ్ళి చేసుకున్న కుమార్. ఇద్దరు పిల్లలు పుట్టాక ఆమెను వదిలేసి మరో అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. విడాకులు తీసుకున్నాక, మాలతి తను స్థాపించిన బిజినెస్ 'కుమార్ గార్మెంట్స్' నడపడంలో లీనమైపోతుంది. విడాకులు తీసుకున్నాక కూడా అందరూ తనని మిసెస్ కుమార్ అని పిలవడాన్ని భరించలేకపోతుంది. మార్కెట్లో కుమార్ గార్మెంట్స్‌కి ఉన్న గుడ్‌విల్ దృష్ట్యా పేరు మార్చడం వల్ల నష్టపోవాల్సి వస్తుందని తెల్సినా కుమార్ అనే పేరు తనకు విన్పించకూడదని సంస్థ పేరుని 'మాలతి గార్మెంట్స్'గా మార్చి వేస్తుంది. మిసెస్ కుమార్ అని పిలిచే వాళ్ళతో 'కాల్ మీ మాలతీ' అంటూ అనంతమైన ఆత్మ విశ్వాసంతో హెచ్చరిస్తుంది. భర్త వదిలేసినా తమదైన జీవితాన్ని తాము నిర్మించుకోవడం ఈ తరం మహిళలు సాధించిన విజయం.

చదువులో, ఉద్యోగాల్లో రాణించడంతో మహిళల్లో వస్తున్న మార్పుల్ని 'మూడు చలికాలాలు' కథ ద్వారా ఆవిష్కరించారు. ఇంటిపనుల్లో ఇంట్లోని మగవాళ్ళని భాగస్వాములుగా చేసిన ఈ తరం కోడలి కథ ఇది. ఇందులో మూడు దశల్ని ఆవిష్కరించారు. ఎముకలు కొరికే చలిలో సైతం అమ్మ పొద్దున్నే లేచి పనులు చేస్తుంటే నాన్న గుర్రుపెట్టి నిద్రపోవడం ఆ కుర్రాడికి నచ్చదు. అమ్మనడిగితే 'ఆయనంటే మగాడు కదా. నన్ను పెళ్ళి చేసుకున్నది చాకిరీ చేయడానికేగా నాయనా' అంటుంది. ఆ కుర్రవాడు పెద్దవాడై పెళ్ళి చేసుకున్నాక భార్య చలిపొద్దున లేచి చన్నీళ్ళతో అంట్లు తోముతుంటే, లేచి సాయపడ్దామని అనుకున్నా దుప్పటికిందున్న వెచ్చదనం అతన్ని లేవనిచ్చేది కాదు. మగాడినన్న అహం... అమ్మ కష్టపడ్తుంటే

అల్లాడిపోయిన అతను భార్య విషయానికొచ్చేటప్పటికి వక్రభాష్యం చెప్పుకొనే స్థితికి దిగజారిపోయాడు.

అతనిప్పుడు రిటైరై నాలుగేళ్ళు, భార్య చనిపోయింది. కొడుకూ కోడలు దగ్గర ఉంటున్నాడు. చలికాలం... రక్తం గడ్డకట్టించేలాంటి చలి... కోడలు లేపి పాలప్యాకెట్ తీసుకురమ్మని చెప్తుంది. 'ఆయనెన్నెందుకు ఇబ్బంది పెట్టడం... నేను వెళ్ళి తెస్తాలే' అన్న భర్తతో 'మీరు చెయ్యాల్సిన పనులు చాలా ఉన్నాయి. మొదట కూరగాయలు తరిగివ్వండి. పిల్లల్ని లేపి చదువుకోమని చెప్పండి' అంటూ పనులు పురమాయిస్తుంది. శ్రమ విభజనలో భాగంగా ఎవరేం పనులు చేయాలో నిర్మొహమాటంగా చెప్పిన కోడల్ని చూసి అతను సంతోషపడ్డాడు. చిన్నప్పుడు తన అమ్మ విషయంలో తీరని కోరిక, పెళ్ళయ్యాక భార్య విషయంలో తను నిర్లక్ష్యం చేసిన కోరిక.. ఇప్పుడు కోడలు తీరుస్తున్నందుకు సంతృప్తి అతన్లో... ముసలితనంలో కోడలు పనులు చెప్పి సతాయిస్తుందని ఫిర్యాదులు చేసే తన తోటి ముసలివాళ్ళకు భిన్నంగా పాలప్యాకెట్ కోడలి చేతికిచ్చి 'ఇంకేమైనా పనుంటే చెప్పు తల్లీ.. చేస్తాను' అంటాడు.

ఈ కథలో కోడలు 'పాపం మగవాళ్ళు... ఈ పన్లు ఏం చేస్తారులెమ్మని' మొహమాటానికి పోదు ఇంటిపని కేవలం ఆడవాళ్ళే చేయాలి అన్న ధోరణిని తిరగరాసిన ఈ తరం స్త్రీ ఆమె. తన భర్త, మామ ఎవరేం పనులు చేయాలో నిర్దిష్టంగా చెప్పి చేయిస్తుంది. ఈ విషయాన్ని చెప్పడానికి చలికాలాన్ని ఎంచుకోవడం బావుంది. మూడు తరాల వారు ఎదుర్కొన్న చలికాలాల్లో వాళ్ళ ప్రవర్తన ఎలా ఉండిందో చెప్పి పద్ధతి కథకి బలాన్నిచ్చింది. ఇక్కడే రచయిత శిల్పనైపుణ్యం కన్పిస్తుంది. కొడుకు మీద, కోడళ్ళ మీద ఫిర్యాదులు చేయడంలోని నిరర్థకత ఏమిటో కూడా ఈ కథ చెప్తుంది. 'పని చేయడం తప్పనప్పుడు సంతోషంగా చేయండి. మానసిక శారీరక ఆరోగ్యాలకు మంచిది' అని తనతోపాటు రిటైరైన వాళ్ళకి చెప్పడం బావుంది. వ్యక్తిత్వ వికాసాన్ని కలిగించే కథ ఇది. తమవాళ్ళ గురించి పదిమందిలో ఫిర్యాదులు చేసేవారికి ఈ కథ కనువిప్పు కలిగిస్తుంది.

తల్లిదండ్రులు తమ ప్రేమని, పెళ్ళిని ఆమోదించకపోతే నిరాశలో నిస్పృహలో కూరుకుపోయి ఆత్మహత్యలు చేసుకునేవారి గురించి తరచూ పత్రికల్లో చదువుతుంటాం. చనిపోయి సాధించేదేమీ లేదని, పాజిటివ్‌గా ఆలోచించి పెద్దల్ని ఒప్పించడం ద్వారా అనుకున్నది సాధించవచ్చని ప్రేమికుడికి మార్గనిర్దేశం చేసే ఒకమ్మాయి కథ 'సంజీవని', ఈ కథలో వాళ్ళమ్మ తమ పెళ్ళికి ఒప్పుకోవడం లేదని, ఇక తమ పెళ్ళి జరగదని, ఇద్దరం కలిసి ఆత్మహత్య చేసుకుందామని అనూషని రమ్మంటాడు సుధాకర్. 'మనం ఎందుకు చచ్చిపోవాలి? అని అడిగితే 'మన ప్రేమ కోసం' అంటాడు. 'నీవు ప్రేమామృతమనే పదం విన్లేదా? ప్రేమ చాలా గొప్పది. అది అమృతంతో సమానం. చావబోతున్న వాళ్ళని కూడా పునరుజ్జీవింపజేసే శక్తి దానికుంది. అది సంజీవని మనలో ప్రాణశక్తిని పూదుతుంది. అది మనల్ని బ్రతికిస్తుంది కానీ చంపదు. ప్రేమ మనలో జీవితేచ్ఛను పెంపొందిస్తుంది' అంటుంది అనూష. ఈ మాటలు ప్రేమికులకు శిరోధార్యం కావాలి. మన సమాజంలోని ప్రేమ సంబంధాల పోకడల్ని చర్చించే ఈ కథ ప్రేమకు ఉన్న ప్రాశస్త్యాన్ని వివరిస్తుంది. అంతేగాక ఈ తరం అమ్మాయి ఆలోచనలోని పరిణతిని సూచిస్తుంది.

'ఒంటరి శరీరం' అనే కథ కూడా ఫక్తు స్త్రీవాద కథే. ఆమె ప్రేమించి పెళ్ళి చేసుకుంది. ముప్పయ్యేళ్ళక్రితం... ఇప్పుడు వెంటాడుతూ ఒంటరితనం.. సమూహాల్లో మసలుతున్నా ముల్లులా గుచ్చుకునే ఒంటరితనం.. మంచానికి ఆ చివర వశిష్ట ఈ చివర తను... నిద్ర రాదు. నిద్ర మాత్ర వేసుకుని పడుకో అంటాడు వశిష్ఠ. మల్లెమొగ్గల కౌగిలింతలా సుత్తిమెత్తగా హత్తుకుని.. పూల మృదుపరిమళంలా ఉదారంగా వాలే నిద్రా, మొరటుగా ఈడ్చుకొచ్చి కళ్ళ లోగిళ్ళలో కట్టేసుకునే నిద్రా.... రెండూ ఒకటెలా అవుతాయి అనుకుంటుందామె. ఒకప్పటి కలయికలో శరీరవాంఛతో పాటు ముడిపడిన గాఢమైన అనురాగం ఉండేది. గుండెనిండా తడి... ఆర్ద్రత.. నిండు జలాశయంలా... ఇప్పుడేమైందో.. ఎండిన కాసారంలా.. ఎడారిలా... అంతా పొడిపొడిగా... ఓ తీయటి కబురుండదు.. కవ్వింత ఉండదు... కౌగిలింతలుండవు.. రొటీన్‌గా... సెక్స్ శరీరానికి పరిమితమా.. మనసుక్కాదా...

శరీరాలు కబుర్లాడుకోవాలని ఆమె వాంఛిస్తుంది. చేతివేళ్ళు స్వీట్ నథింగ్స్‌ని గుసగుసలుగా చెప్పుకోవాలి. వీణ మీటినట్లు పులకింతలు కలగాలి. కేవలం యంత్రస్పర్శలా మిగిలిపోతే మనసు బండలా మారిపోదూ... మసాజ్ పార్లర్‌లో తన శరీరం మీద సుతారంగా కదిలే నీరజ వేళ్ళు కలిగించే

హాయి... సాంత్వన,.. ఓదార్పు.... స్పర్శ అనేది ప్రేమకు గుర్తు. అది శరీర భాష. ఆమె వేళ్ళకు తన శరీరానికేం కావాలో తెలుసు... జీవకణాలు తీయగా కబుర్లాడుకుంటూ.. హాయిగా, మత్తుగా శరీరం స్పందిస్తూ... 'నా శరీరం ఇప్పుడు ఒంటరిది కాదు' అనుకుంటుందామె.

ఇంటికి ఇల్లాలు దీపం మాత్రమే కాదు ఇంటిని పడిపోకుండా కాపాడే మూలస్థంభం కూడా. తన భర్త కోసం, పిల్లల కోసం అహరహం తాపత్రయపడ్తూ వారి బాగోగుల్ని చూసుకుంటూ తన గురించి పట్టించుకునే సమయం దొరక్క తనలో తనే మగ్గిపోతూ ఉంటుంది. సలీం రాసిన 'గరిమనాభి' కథలో భర్త అనారోగ్యంతో బాధపడ్తుంటే అతనికి ధైర్యం చెప్తుంది. క్రమం తప్పకుండా మందులిస్తుంది. రెండో కూతురు అమెరికా నుంచి ఫోన్‌చేసి తన భర్తతో గొడవల గురించి చెప్పి 'డిప్రెషన్‌కి లోనవుతున్నామా' అంటే సంసారంలో ఎలా సర్దుకుపోవాలో చెప్తుంది. డిప్రెషన్ నుంచి బైటపడేలా చేస్తుంది ఇంటికొచ్చిన పెద్దమ్మాయికి తన జీవితగమ్యాన్ని ఎలా చేరుకోవచ్చో విశదపరుస్తుంది. మనవడికి జ్వరంగా ఉందంటే వాడి ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకుంటుంది. భర్త 'కస్తూరీ... ఆరోగ్యం బాగోలేదా? డల్‌గా కన్పిస్తున్నావు' అని అడిగితే 'నాకేమండీ. గుండ్రాయిలా ఉన్నాను' అంటూ అబద్ధం చెప్తుంది.

రాత్రి ఆయనకు భోజనం పెట్టి మందు బిళ్ళలిచ్చాక పడకమీద వాలితే ఆమెను ఆక్రమిస్తూ భయంకరమైన నిస్సత్తువ. శరీరమంతా చచ్చుపడినట్టు.. జ్వరం తగ్గినట్టు లేదు. వేసుకున్న హోమియో మందు పనిచేసినట్టు లేదు. తనకున్న అనారోగ్యానికి ఇక ఏ మందులూ పనిచేయవేమో. తన భర్తా పిల్లలూ తమ అనారోగ్యాల గురించి, భయాల గురించి, దిగుళ్ళ గురించి తనతో చెప్పుకుని సాంత్వన పొందారు. తనెవరితో చప్పుకోవాలి? 'తప్పదు. నాకు నేనే ధైర్యం చెప్పుకోవాలి. వీళ్ళందరి కోసం మానసికంగా బలాన్ని తెచ్చుకోవాలి. నాకు ఆసరాగా ఎవరి భుజమూ దొరకదు. నా భుజం మీద నేనే వాలి విశ్రాంతి పొందాలి. నన్ను మా ఆయనా పిల్లలూ యింటికి మూలస్థంభం అని భ్రమ పడ్తున్నారు. దానికి చెదలు పడ్తున్న విషయం ఎవ్వరికీ తెలియదు. అది నన్ను లోపల్నుంచి తినేస్తూ, గుల్ల చేస్తూ...' అనుకుని నిశ్శబ్దంగా కన్నీళ్ళు కారుస్తుంది.

స్త్రీ నిర్లక్ష్యానికి గురవుతున్న వైనం, తన వాళ్ళకోసం హారతి కర్పూరంలా హరించుకుపోతున్న తీరు పై కథలో దృశ్యమానం చేశారు రచయిత.

సెల్‌ఫోన్లలో వీడియో రికార్డింగ్ సౌకర్యం వచ్చాక ఆడపిల్లల నగ్న దృశ్యాల్ని చిత్రించి వాళ్ళని బ్లాక్‌మెయిల్ చేసి లొంగదీసుకోవడం ఎక్కువైంది. కాలేజీలో చదువుతున్న రితిక వయసు తొందరలో తప్పటడుగు వేసింది. క్లాస్‌మేట్ అన్వేష్ ప్రేమిస్తున్నానని వెంటబడితే అతన్ని నమ్మి శరీరాన్ని అర్పించింది. ఓ రోజు కారుణ్య నుంచి ఫోనొచ్చింది. 'అన్వేష్ నీతో గడిపిన మధుర క్షణాల్ని తన సెల్‌ఫోన్లో బంధించాడు. ఇప్పుడా సెల్ నా చేతిలో ఉంది. ఈ వీడియో వైరల్ కాకుండా ఉండాలంటే నువ్వు నాతో గడపాలి' అంటూ యస్ ఆర్ నో చెప్పడానికి ఇరవై నాలుగు గంటల సమయం ఇస్తాడు. రితిక ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకుంటుంది. కూతురు దిగులుగా ఉండటం గమనించిన వాళ్ళమ్మ రితికని ఓదారుస్తూ 'ముందే తొందరపడ్డావా? ప్రెగ్నెన్సీనా?' అంటూ ఏ మాత్రం కోపం ప్రదర్శించకుండా మృదువుగా అడుగుతుంది. తనని చుట్టుకుని ఏడుస్తున్న కూతురితో 'నువ్వు ఒంటరిదానివి కాదు. నేను తోడున్నాను. ఒకవేళ నువ్వు తప్పుచేసి ఉంటే దాన్ని నేను సమర్థిస్తాననుకోకు. అలాగని నీ ఖర్మకు నిన్నొదిలేసి బలి చేసుకోలేను. నాకు వివరంగా ఏం జరిగిందో చెప్పు. అది నిజంగానే సమస్య ఐతే దాన్నుంచి ఎలా బైటపడాలో ఇద్దరం కలిసి ఆలోచిద్దాం" అంటుంది.

రితక చెప్పేదంతా విన్నాక 'పద పోలీస్ స్టేషన్లో కంప్లెయింట్ చేద్దాం' అంటుంది. 'వాడు ఆ వీడియోని వైరల్ చేస్తాడేమో' అని భయపడ్తున్న రితికతో 'తెలివున్నవాడెవడూ అలా చేయడు. అది వాడి శిక్షని పెంచుతుంది. కాబట్టి... ఇలా బ్లాక్ మెయిల్ చేసేవాళ్ళు బేసిక్‌గా పిరికవాళ్ళయి ఉంటారు. దేన్నో అడ్డుపెట్టుకుంటే తప్ప తమక్కావల్సింది పొందలేని బలహీనులు' అంటూ ధైర్యం చెప్తుంది. అన్వేష్‌ని, కారుణ్యని పోలీసులు అరెస్ట్ చేస్తారు. సెల్‌ఫోన్లో నిజంగా ఏమీ చిత్రించలేదని, అలా చెప్పి లొంగదీసుకోవాలని పన్నాగం పన్నారని ఎంక్వయిరీలో తెలుస్తుంది.

రితికతో వాళ్ళమ్మ 'చూశావా... భయం వల్ల ఎన్ని పొరపాట్లు జరిగే ప్రమాదముందో? నిజంగానే సెల్‌ఫోన్లో రికార్డయి ఉందని ఎంత హింస పడ్డామో కదా. కర్రముక్కని

వీపుకి ఆనించి పిస్తోలని బెదిరిస్తే ఆ కంగారులో అది పిస్తోలేనని నమ్మి వాళ్ళు ఆడమన్నట్లు ఆడతాం' అంటుంది. 'ఒకవేళ నిజంగానే ఆ రోగ్ వీడియో తీసిఉంటే, అది యూట్యూబ్‌లో పెడ్తే ఏంచేసేవాళ్ళం?' అని అడిగిన కూతురితో 'సింపుల్. అది నా కూతురు కాదు. ఎవడో వెధవ ఎవరిదో శరీరానికి నా కూతురి తలను అతికించి మార్ఫింగ్ చేశాడని చెప్పేదాన్ని అందరి నోళ్ళూ మూతపడేవి" అంటుందామె.

అటువంటి తల్లులే అందరికీ ఉంటే, బురదలో పొరపాటున కాలేసి, వెనక్కి తీసుకుని ఎలా కడుక్కోవాలో తెలీక భయంతో ఆత్మహత్యలు చేసుకునే కొన్ని వందలమంది ఆడపిల్లలు బతికిపోతారు. సమస్యనుంచి పారిపోవడం కాదు. దాన్ని ధైర్యంగా ఎలా ఎదుర్కోవాలో తల్లిదండ్రులే పిల్లలకు నేర్పాలి. ముఖ్యంగా సెల్‌ఫోన్ బ్లాక్‌మెయిలింగ్‌లు పెచ్చుమీడిపోతున్న ఈ రోజుల్లో ఆడపిల్లలకు వెన్నుదన్నుగా నిలబడి వాళ్ళలో ధైర్యం నూరిపోయాలి. అప్పుడే మగపిల్లల ఆగడాలకు అడ్డుకట్ట పడ్తుంది.

మగసంతానం కోసం వెంపర్లాడటం మనదేశంలో ఓ జాడ్యంలా మారింది. పుట్టబోయేది ఆడపిల్లని తెలిస్తే చాలా అబార్షన్ల కోసం ఆరాటపడటం.. పుట్టింది ఆడపిల్లని తెలిశాక భ్రూణహత్యలకు పాల్పడటం ఇప్పుడు సమాజంలో నెలకొన్న దుస్థితి. సలీం రాసిన 'అమ్మలగన్న అమ్మ' కథలో కూడా కథకుడి కూతురు తనకు ఆడపిల్ల వద్దనుకుని అబార్షన్ చేయించుకోడానికి తయారవుతుంది. అతని స్నేహితుడి మనవడికి గుండెల్లో రంధ్రం ఉందని ఆస్పత్రిలో చేరుస్తారు. మగపిల్లాడు కాబట్టి ఎలాగైనా బతికించుకోవాలని అతని స్నేహితుడి ఆరాటం... పరామర్శించడానికి ఆస్పత్రికెళ్ళిన అతనికి ఫ్లోర్‌ని డెట్టాల్‌తో శుభ్రం చేస్తున్న ఫాతిమాబీతో పరిచయం అవుతుంది. ఫాతిమాబీకి ఆరుగురు ఆడపిల్లల తర్వాత మరో ఆడపిల్ల పుట్టి చచ్చిపోతుంది. ముప్పయ్యేళ్ళు గడిచినా ఫాతిమా ఆ పిల్లను తల్చుకుని దుఃఖపడ్తో ఉంటుంది.

'నీకప్పటికే ఆరుగురు ఆడపిల్లలున్నారుగా బూబమ్మా... మరో ఆడపిల్ల లేకపోతేనే?' అంటాడతను.

ఆమె కస్సుమని లేస్తుంది. 'ఎంతమంది ఆడకూతుర్లుంటే మాత్రం.. అది నా కూతురు కాదా? నా పేగు తెంచుకుని పుట్టలేదా? నా రక్త మాంసాలు కరిగించి కన్న బిడ్డ బాబూ.. ఆ కడుపు కోత ఎంత బాధగా ఉంటుందో తల్లికే తెలుస్తుంది. ఏ రంజాన్‌కో బక్రీద్‌కో పిల్లలందరూ యింటికొస్తే నాకు ఆ పిల్లే గుర్తొచ్చి గుండె బరువెక్కుతుంది' అంటుంది.

పుట్టబోయేది ఆడపిల్లని తెలిసి అబార్షన్ చేయించుకునే ఆడపిల్లలకు ఫాతిమాబీ ఓ చెంప పెట్టు.. ఆమె అతని కళ్ళకు అమ్మలగన్న అమ్మలా కన్పిస్తుంది.

పురుషాధిక్య సమాజంలో స్త్రీకి కష్టాలు, కన్నీళ్ళు తప్పడం లేదు. మిగతా స్త్రీలతో పోలిస్తే ముస్లిం స్త్రీకి మరికొన్ని సంకెళ్ళు అదనం. ఇష్టంలేని భార్యని మూడు సార్లు తలాక్ చెప్పి వదిలించుకోవడం, విడాకుల తర్వాత భరణం ఇవ్వాల్సిన అవసరం లేకపోవడం, నలుగురు భార్యల్ని చేసుకునే వెసులుబాటు, పరదా, ఘోషా, ఇలా ఎన్ని నిగళాలో.. వాటిని తెంచుకోవడం అంత సులభం కాదు. దానికి కారణం ముస్లిం స్త్రీలకి చదువు, సంపాదన లేకపోవడమే. ఐనా తెగించి తన భర్త దుర్మార్గాలకు ఎదురునిలుస్తుంది. 'ఖులా' కథలో ఫాతిమా.

ఆమె ఆరేళ్ళ కూతురు నాజియాని ఆ వూరి మోతుబరి కొడుకు రేప్ చేసి కాలువలో ముంచి చంపేస్తాడు. వాడి వయసు పద్నాలుగేళ్ళు. ఇంటర్నెట్‌లో బూతు వీడియోలు చూసి, వాటి ప్రభావంతో ఈ దుర్మార్గానికి పాలు పడ్తాడు. ఫాతిమా భర్త ఫకీర్ అనుభవిస్తున్న దుర్భర దారిద్ర్యాన్ని ఆసరాగా చేసుకుని, అతనికి డబ్బు ఆశ చూపి పోలీస్ కేస్ పెట్టకుండా సర్దుబాటు చేస్తాడు ఆ వూరి సర్పంచ్. ఫాతిమా దానికి ఒప్పుకోదు. తన కూతురి ప్రాణం తీసినవాడికి ఉరిశిక్ష పడాల్సిందేనని పట్టుబడ్తుంది. 'నోరు మూసుకుని పడుండు లేదా గొంతే పిసికి చంపేస్తాను' అని బెదిరిస్తాడు ఫకీర్. మూడు వేలు ఇప్పిస్తానంటాడు సర్పంచ్. ఐదు వేలు లేందే గిట్టుబాటు కాదంటాడు ఫకీర్

'ఒరేయ్ అది నా కూతురి ప్రాణంరా... దేన్ని ఎవరికి అమ్ముతున్నార్రా మీరు? ఏది ఎవరికి గిట్టుబాటు కాదురా? మీ కూతుర్లనో పెళ్ళాలనో పాడుచేసి చెరువులో ముంచేసి చంపేస్తే అప్పుడు తెలుస్తుందిరా ఆ బాధేమిటో' అంటూ ఫాతిమా గుండె కన్నీరు కారుస్తుంది. బిచ్చగాడిలా వంగి సర్పంచ్ కాళ్ళకు దండాలు పెడ్తున్న ఫకీర్ని చూసి 'ఛీ.. నువ్వూ ఓ తండ్రివేనా? ఓ అబ్బకూ అమ్మకూ పుట్టినోడివైతే నీ కూతుర్ని చంపినోడి దగ్గర బిచ్చమెత్తుకు[illegible]... నామర్ద్' అని మనసులో అనుకుని అసహ్యం[illegible] పుక్కున వూస్తుంది.

ఎంక్వయిరీకి వచ్చిన పోలీసుల్తో 'డెంగూ జొరమొచ్చి

సచ్చిపోయింది సాబ్. పేదోణ్ణి.. మందులిప్పించలేకపోయాను' అంటాడు ఫకీర్. బైటికి విసురుగా వచ్చిన ఫాతిమాతో 'నువ్వెందుకొచ్చావ్? పో లోపలికి. నోరెత్తావా తలాక్ ఇచ్చేసాను' అంటూ బెదిరిస్తాడు. 'నువ్వేంట్రా నాకు తలాక్ ఇచ్చేది? నేనే నీకు ఖులా చెప్తున్నా... నువ్వు నా కాళ్ళు పట్టుకున్నా నీలాంటి నీచుడితో కాపురం చేయడానికి తయారుగా లేను' అంటూ పోలీసులతో నిజం చెప్పడానికి ఉద్యుక్తురాలవుతుంది. ఖులా అనేది ముస్లిం ఆడవాళ్ళు ఇచ్చే విడాకులు. తన భర్త దాష్టికాలను, దుర్మార్గాలను సహించని ఫాతిమా అతన్తో తెగతెంపులు చేసుకుని స్వేచ వైపుకు ప్రయాణిస్తుంది.

మరో కథలో... తన భర్తని చంపేయాలని గత నెల్రోజుల్నుంచి ఆలోచిస్తుందామె. ముప్ఫై ఐదేళ్ళు కలిసి కాపురం చేసిన భర్త.. ఎలా చంపాలీ... గొంతు నులిమి చంపేస్తే.. ఆమ్మో.. కళ్ళు తెరిచి తన కళ్ళల్లోకి వేదనగా చూస్తే తను తట్టుకోగలదా? పట్టు జారిపోతుంది. మనసు కరిగిపోతుంది. విషం కలిపి తినిపిస్తే నో... అతను గిలగిలా కొట్టుకుంటుంటే తన ప్రాణం విలవిల్లాడిపోదూ.. అప్పుడే అమృతమిచ్చి బతికించుకోగలదు? అతని మథన పడే భార్య మానసిక వేదనని కళ్ళకు కట్టినట్టు చిత్రించిన కథ 'విముక్తి' తర్వాతి కాలంలో కారుణ్యమరణాల నేపథ్యంలో సలీం రాసిన నవల 'మరణకాంక్ష'కు తొలిమెట్టు ఈ కథ.

ఐదేళ్ళ క్రితం స్కూటర్ మీద తిరిగొస్తున్న శివరాంని లారీ గుద్దేసింది. నాలుగు రోజులు కోమాలో ఉన్నాడు. వెన్నుపూస బాగా దెబ్బతిన్నందువల్ల కాళ్ళూ చేతులు చచ్చుబడిపోయాయి. తన భర్తని పసిపిల్లాడిలా చూసుకుందామె. ఆమెకు తనభర్తంటే ప్రాణం. అతను చచ్చిపోతే బావుండునన్న ఆలోచన ఎప్పుడూ రాలేదు. కానీ తనకు యుటెరస్ క్యాన్సరు బాగా ముదిరిపోయిన దశలో ఉందని తెల్సినపుడు ఆమె తన చావు గురించి బాధ పడలేదు. కానీ శివరాం బతుకు గురించి బాధపడింది. తను చనిపోతే తన భర్తని ఎవరు చూసుకుంటారు? అతని మల మూత్రాదుల్ని ఎవరు ఎత్తిపోస్తారు? కనీసం తన దగ్గర డబ్బున్నా ఓ నర్సుని పెట్టుకోవచ్చు. లేదా మంచి వృద్ధాశ్రమంలో చేర్పించవచ్చు. కానీ డబ్బు లేదు కాబట్టి అతను చచ్చిపోతేనే బావుండుననుకుంది.

ఈ కథలో ఆమె పడే మానసిక సంఘర్షణని అద్భుతంగా చిత్రించారు రచయిత. స్త్రీలోని సున్నిత మనోభావాల్ని ఒడిసి పట్టుకోవడంలో కృతకృత్యుడైనారు.

పెళ్ళయ్యాక అమ్మాయి అత్తారింటికి వెళ్ళిపోవాలి. భర్తతోపాటు అత్తామామల్ని చూసుకోవాలి. ఒకరో ఇద్దరో ఆడపిల్లలున్న తల్లిదండ్రుల పరిస్థితేమిటి? వృద్ధాప్యంలో వాళ్ళను చూసుకునేవాళ్ళెవరు? ఈ సాంప్రదాయాన్ని ఇలా కొనసాగించాల్సిందేనా? అమ్మాయే అత్తారింటికి ఎందుకు వెళ్ళాలి? అబ్బాయే రావొచ్చుగా. మగవాళ్ళతో సమానంగా చదువుకుని ఉద్యోగాలు చేస్తున్న ఈ కాలంలో కూడా ఎందుకీ వివక్ష? దీనికి ఎదురుతిరిగి పోరాడటానికి సిద్ధపడిన స్త్రీ కథే 'కొత్తనీరు'. ఆమెకు తండ్రి లేడు. తను ఒక్కతే సంతానం. కష్టపడి పెంచి పెద్ద చేసిన తల్లిని ఉద్యోగం వచ్చాక పువ్వుల్లో పెట్టుకుని చూసుకోవాలని కలలు కంటుంది. కానీ పెళ్ళయ్యాక జీతం మొత్తం తన భర్త చేతుల్లో పోయాల్సి వస్తుంది. అత్తకు బాగాలేకపోతే ఆమెను చూసుకోడానికి తను, తన భర్త, మామ, మరిది... ఇలా ఎంతమందో. అమ్మ బాత్రూంలో పడి కాలు విరిగి మంచాన పడితే చూసే దిక్కుండదు. ఒకే వూళ్ళో ఉన్నా ఎక్కువ రోజులు తల్లి దగ్గర ఉండటానికి అనుమతివ్వని భర్త. అందుకే తెగిస్తుంది.

భర్తకు తన నిర్ణయాన్ని తెల్పుతుంది. 'నా నిర్ణయానికి మీ కుటుంబం ఆమోదం తెల్పుతుందని అనుకోను. నీ కుటుంబమే కాదు మగపిల్లల్ని కన్న తల్లిదండ్రులెవరూ ఒప్పుకోరు నేనె ఆర్నెల్లు అమ్మదగ్గరుంటాను. మిగతా ఆర్నెల్లు అత్తగారింట్లో ఉంటాను' అంటుంది. ఆమె మనసులో ఓ ప్రణాళిక రూపుదిద్దుకుంటుంది. సోషల్ నెట్‌వర్క్ సైట్ల ద్వారా ఆడపిల్లల తల్లిదండ్రుల మద్దతుని కూడగట్టుకోవాలి. పెళ్ళయి తల్లిదండ్రుల్ని చూసుకోలేకపోతున్న ఆడపిల్లల మానసిక వేదనని ఆవిష్కరించాలి. ఒకరో ఇద్దరో ఆడపిల్లలున్న ముసలి తల్లిదండ్రుల బాధ్యత కూతురు అల్లుడే తీసుకునేలా చట్టాలు తీసుకురావాలి. మార్పు కోసం పోరాడటానికి ఆమె సర్వసన్నద్ధురాలవుతుంది.

సలీం కథల్లో స్త్రీల అంతరంగ ఘోష విన్పిస్తుంది. స్త్రీల దృష్టికోణం నుంచి చూసే చూపు కన్పిస్తుంది. స్త్రీ హృదయంలోకి పరకాయ ప్రవేశం చేసి ఆమె సున్నిత భావాల్తో పాటు, సుదృఢమైన మానసిక స్థైర్యాన్ని కూడా ఆవిష్కరించేలా కథలు రాయడంలో సలీం సిద్ధహస్తుడు. ◆

# అ'శోక'వన సీతను కాను

- జంధ్యాల రఘుబాబు
9849753298



నేనిక ఏ మాత్రం
అశోకవనంలో సీతను కాను
ఏ శోకాన్ని దరి చేరనివ్వను
ఎండాకాలం సూర్యుడివలె
రగిలే నా సమీపానికూడా
ఏ రావణున్ని శూర్పణఖనూ
రానివ్వని మనోధైర్యం నాది
హనుమంతుని రాకకోసం
అసలే ఎదురు చూడను
ఏ త్రిజట తన కలల్ని
నాతో పంచుకునే పనిలేదు
నే జీవిస్తున్నది నిజంలోనే
స్వప్న సీతను కాను నేను

ఏ రాముడు నన్ను
వనాలకు పంపలేడు
కావలిస్తే డి.ఎన్.ఎ పరీక్ష
చేసుకోమంటా చూసుకోమంటా
ఏ లక్ష్మణుడు నాకోసం
బాధపడే పనే లేదు
ఏ వాల్మీకి ఆశ్రయం
నాకు అవసరం లేదు

కుశ లవులు
తమ సంకీర్తనలతో
ఎవరినీ కీర్తించే
అగత్యం లేదు రాదు

నా గురించి నేనే
రాసుకుని పాడుకుంటా
ఎవరో తమ భుజాలపై
మోసేంత అశక్తురాలిని కాను
నా నిత్య కీర్తిని
నా స్వరంలోనే వినిపిస్తా
ఏ శక్తి స్వరూపంపై
నాకు నమ్మకం లేదు

చేవకలిగిన నా చేతలే
నా మనోధైర్యం మనోస్థైర్యం
నా జీవిత గణితంలో
నేనే సరళరేఖను
నేనే వృత్తాన్ని
నేనే క్రమషడ్భుజిని
అక్రమాలకు ఆఖరిరోజును
చూసే టెలిస్కోపును నేను
సూక్ష్మదర్శినిలో గమనించి
బ్యాక్టీరియాను ఏరిపడేస్తా
ఖననం చేస్తా
దహనం చేస్తా ◆

---

# జీవితం

- సర్వమంగళ
918240497942



ఆశయం ఒక వస్తువైంది
మార్కెట్‌లో ఆశ ఒక సరుకై
జీవితం ప్రతీ క్షణం
ఒక దుర్భర దృశ్యమై
సమాజపు పంటి గాట్లతో
పెను బాధల చుట్టూ ప్రదక్షిణ.

వీపు తాకిన కడుపుతో
సిర దమనులలో చెమట ప్రవహిస్తే
దేహపు శ్రమ అక్కడే ధార పోస్తుంటే

గుక్కెడు గంజి తనపై అలిగి
మెతుకులు చేసే ధర్నాతో
బక్క చిక్కిన ఆమె పొట్ట
ఆత్మ హత్య చేసుకుంటానంటే
ఆ శరీరపు ప్రతిఘటన!

కన్న పేగుకు మాతృశోకం
మిగిలించలేని

ఒకానొక పొడుగాటి బంధం
మదిలో ముళ్ళులా గుచ్చుతోంది
పూటకో పురిటినొప్పి చొప్పున
బతుకు గమ్యం
చితి మంటలో చిక్కి శల్యమై
ఇప్పుడు షరాబు
పాన్ బ్రోకర్ల చేతికి చిక్కింది!! ◆

# మూడు మరణాలు

- యం.శబరీష్
9885566388



రెండ్రోజులుగా ఎడతెరపి లేకుండా కురస్తానే ఉంది ఈ ఎర్రిముండ వాన. కురవాల్సిన సమయానికి కురవనేలేదు. ఇప్పుడీ ఊరంతా వల్లకాడయ్యాక సంబరం చేసుకునేదానికన్నట్లు కురస్తా ఉంది.

వర్షం కురవడంతో ఎండిన ప్రతి చెట్టూ వాన తాకిడికి పులకరించి ఆనందంతో రెమ్మలు వెయ్యడానికి సిద్ధమవుతుంటే అది చూసి పక్షులు చినుకుల మధ్య కేరింతలు కొడుతున్నాయి. వర్ణవికారంగా తయారైన భూమాత మునుపటి తేజస్సును సంతరించుకుంటోంది. ఏడాది క్రితం వానలు కురవక సేద్యం సాగక ఊర్లో నాల్గు పెద్దతలకాయలు ఉరికి వేలాడాయి. ఊర్లో ప్రజలు జీవచ్ఛవాలయ్యారు. కన్నీళ్లు కార్చడం తప్పా కడుపులు మాడ్చడం తప్పా ఏమీ చేయలేకపోయారు.

ఆ సమయంలోనే వట్నమెళ్లి బతకాలనే నిర్ణయానికొచ్చారు. కనీసం తమ బిడ్డల్నన్నా బతికించుకోవాలనే ఆశతో తల్లులంతా తమ పిల్లల్ని పట్నం తీస్కెల్లిపోయారు. ఊరు ఒంటరిదయ్యింది. నెర్రులు చీలిన భూమి ఊరి ప్రజల ఆశలు నెరవేరాలని కోరుకుంది. శోకాన్ని దిగమింగుతూ తిండిగడిచి బతుకుబాగుపడాలని పట్నానికి ఊరంతా వలసెల్లిపోయాక పాపమ్మ మాత్రం ఎప్పుడూడుతుందో తెలియని తన గుడిసిల్లును పట్టుకుని కదల్నంటా ఉంది.

ఇప్పుడు వాన కురవంగానే తమ కులదైవం ఇరపచ్చమ్మకి మొక్కుకుంది. దండాల మీద దండాలు పెట్టింది. ఈ వానను చూస్తా ఉంటే పాపమ్మకు పెద్దపండగే వచ్చినట్లుంది. వలసెల్లినోళ్లంతా తిరిగొస్తారనే ఆనందంతో వయసును కూడా మర్చిపోయి గెంతులేస్తా ఉంది. తన మనవరాలు జలజ జీవాల కాడికి పోయింది. రాగానే గుడికి పోయి తమ కులదైవానికి ప్రసాదం పెట్టాలని నిర్ణయించుకుంది. బలమైన చినుకులు టపటపమనే శబ్దం చేసుకుంటా గుడిసె మీద కురస్తా ఉండాయి. ఆ సినుకుల దెబ్బకు గుడిసె సూరు చిల్లు పడి ఇంట్లోకి నీళ్లు పడ్తాండాయి. ఇక ఊర్లోని ముప్పై గుడిసిండ్లకు పాపమ్మే దిక్కు. ఆమెకు తోడుగా మనవరాలు జలజ. వారిద్దరికీ జతగా మరో రెండు జీవాలు. ఇవే ఆ ఊరిని పాలించే రాజులు. ఇక పాపమ్మ, జలజలు మరో మనిషిని చూడాలంటే నాలుగు మైళ్లకు అవతల ఉండే ఊరికెళ్లాల్సిందే. పలకరింపులకు దూరంగా ఆకలికి దగ్గరగా మగపురుగులేని ఒంటరి ఊర్లో ఆప్యాయంగా బతుకీడుస్తున్నారు పాపమ్మ, జలజలు. ఎప్పటికైనా ఊరిడిచి వెళ్లినోళ్లు తిరిగొస్తారని మర్రిచెట్టును అంటిపెట్టుకుని ఉండే గుడిసింట్లోనే కాలాన్ని తరుముతున్నారు.

గుడిసిల్లును ఆనుకుని లావైన ఊడలతో ఎత్తైన మర్రిచెట్టుంది. ఏపుగా పెరిగిన ఆ చెట్టు ఎన్నో పక్షులకు

నిలయమైంది. మర్రిచెట్టు తొర్రలో ఓ గుడ్లగూబ కాస్కోనుండాది తన పెనిమిటి కోసం. వేట కోసం వెళ్లిన తన పెనిమిటి ఈ వానలో యాడ సిక్కుకొని ఉండాడో, ఎన్ని కష్టాలు పడ్తాండాడో.. ఇదే దిగుల్తో తిండి నీళ్లు కూడా పట్టించుకోకుండా ఎదురుచూస్తా కాస్కోనుండాది.

ఆకాశానికి తాకేటట్లుండే ఆ మర్రిచెట్టు పైకెక్కి తన పెనిమిటి కోసం ఎన్నిసార్లు చూసొచ్చిందో లెక్కేలేదు. ఈసారైనా వస్తాండాడేమోనని చూసేదానికి బయల్దేరుతుండగా మర్రిచెట్టు కిందుండే గుడిసింట్లో పాపమ్మ అరుపులు. హోరు వానలో దీర్ఘంగా అరస్తా ఉంది తన ముద్దుల మనవరాలు జలజ కోసం. అరిసరిసీ గెస పుట్టేసరికి పాపమ్మ నోరు మూతపడింది. గుడ్లగూబ పెనిమిటి కోసం రెక్కలిదుల్చుకొని ఎగిరిపోయింది.

ఇక ఎదురుచూడ్డం వల్ల లాభం లేదని తెలిసి సూర్యకిరణాలను సైతం కప్పేసిన వానలో పాపమ్మ జలజ కోసం లాంతరు తీస్కొని బయల్దేరింది. జలజ చాలా అల్లరి పిల్ల. పట్టిన పట్టు వదలని గడసరి పిల్ల. అందుకే పాపమ్మ జలజకు ఈ రోజు జీవాల్ని మేపే పని అప్పగించింది. సద్దేలకాడ బయల్దేరిన పిల్ల సందేలైనా రాకపోయేసరికి పాపమ్మకు కంగారెక్కువైంది. ఈ వానలో ఎందుకు పంపిచాన్రా దేవుడా అని తనపైన తనే తిట్ల పురాణం కుమ్మరించుకుంది. పళ పళమని మెరిసే మెరుపులు, ఉరుములు వాటి శబ్దానికి పోటీగా ఓ జలజ.. ఓ జలజ.. అంటూ పాపమ్మ అరుపులు. ముళ్ల పొదలను, ఏపుగా పెరిగిన చెట్లను దాటుకుంటూ పాపమ్మ దారి బాటమ్మింటీ జలజ.. అమ్మా జలజ.. అంటూ వెళ్తోంది. అరిసరిసీ గెసపోస్తున్న పాపమ్మ ఉన్నట్లుండీ కళ్ల ముందున్న దృశ్యాన్ని చూసి ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. భూమి కంపించినట్లుగా, ఆకాశం బద్దలైనట్టుగా, అడవితల్లి భగభగమండే మంటలకు కాలిపోతున్నట్లుగా అరవసాగింది. పాపమ్మ అరుపుకి జీవాల మధ్య లేడిపిల్లలా ఎగిరెగిరి గెంతుతా అంజిగాడు పారిపోయాడు.

అయ్యో..! ఎంత ఘోరం జరిగిపోయింది. పొరపాటు చేశాను తల్లీ... అమ్మా జలజ...నన్ను క్షమించమ్మా... అమ్మా జలజ... నా బంగారు తల్లీ.. కళ్లు తెరువమ్మా... మీ అవ్వనమ్మ.. ఒక్కసారి చూడమ్మా... అంటూ వివస్త్రగా ఉన్న జలజని గుండెలకు పొదువుకుని కుమిలిపోతూ ఏడుస్తోంది పాపమ్మ. ఈ సారి మెరుపులు, ఉరుములు శబ్దాలకంటే పాపమ్మ అరుపులు, కేకలే ఎక్కువగా వినిపిస్తున్నాయి.

బంగారు తల్లి ఆ అల్లరి పిల్ల జలజ అంజిగాడి చేతిలో బలైపోయి జీవచ్ఛవంలా కొన ఊపిరితో కొట్టుకుంటోంది. పాపమ్మకు ఏం చేయాలో తోచడం లేదు. గుండెపగిలేట్టుగా ఉంది. ముళ్ల పొదల్లో చిక్కుకుని చిరిగి ఉన్న బట్టని తీసి జలజ మీద కప్పింది. శక్తినంతా కూడదీసుకుని తన భుజాలపై జలజను మోసుకొచ్చి గుడిసింట్లో పడుకోబెట్టింది. సొమ్మసిల్లి ఉన్న జలజ ఒక్క క్షణం కళ్లు తెరిచి అవ్వని చూసి దాహం..దాహం అంటూండగా పాపమ్మ దోసిడు నీళ్లు తెచ్చి జలజ నోటికి అందించింది. జీవాలు మిట్టచేన్లలో ఉండాయవ్వ.. అంటూ జలజ మళ్లీ కళ్లు మూసింది.

పాపమ్మకు ఏం చేయాలో పాలుపోలేదు. రక్షించే వాల్లు లేరు. పొరుగూర్లో కూడా ఎవరూ సాయం చేసేటోళ్లు లేరు. అప్పుడప్పుడూ ఈ గుడిసింటికి వచ్చి సాయపడే అంజిగాడే ఈ యాళ ఇంత అఘాయిత్యానికి పాల్పడినాడు. నిస్సహాయంగా తయారైంది పాపమ్మ పరిస్థితి.

వాన బీభత్సం ఎక్కువయ్యింది. ఊరి చివరుండే చెరువు వరద నీటితో నిండిపోతోంది. వాన తాకిడికి చెరువునానుకుని ఉండే చెట్టు కొమ్మలు ఊగసాగాయి. ఈ ఊపుకి తమ గూళ్ల నుంచి పక్షులు బయటికొచ్చేస్తున్నాయి. కొన్ని సంవత్సరాలుగా కాపురం ఉంటున్న తమ గూళ్లను తలుచుకుంటూ ఆ పక్షులు ఏడ్వసాగాయి. ఎన్నో కష్టాలు పడి కట్టుకున్న తమ గూళ్లు ఇక ఉండబోవని తెలిసి బాధపడుతూ మనసారా వాటిని హత్తుకుంటున్నాయి. వాన తీవ్రత ఎక్కువయ్యేసరికి పక్షులు చెదిరిపోతున్న తమ గూళ్లను.. వాటిలో బతికిన తమ జీవితాలను తలుచుకంటూ విషాదంగా ఆకాశం వైపుకి ఎగరసాగాయి.

గుడ్లగూబ మాత్రం తన చెంతకు వస్తున్న తన పెనిమిటిని చూసి ఆనందించింది. పరవశంతో పెనిమిటిపై ప్రేమతో పొంగిపోయింది. పెనిమిటి గూటికాడికి రాగానే చలి జ్వరంతో వణుకుతూ ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడు. గూటిలోకి దూరిపోయి గడగడా వణుకుతున్నాడు. పెనిమిటి బాధను చూసి గుడ్లగూబ మనసు తరుక్కుపోయింది. వాన చినుకులకు ముద్దగా తడిసొచ్చిన తన పెనిమిటిని చూసి ఏడ్చింది. తన వెచ్చటి రెక్కలతో పెనిమిటిని రుద్దసాగింది. తన పెనిమిటిని ఎలాగైనా కాపాడాలనుకుంది. గూటినొదిలి వెళ్లకుండా గూటిలోకి వాన చినుకులు చొరబడకుండా గూటి ద్వారానికి తన రెక్కల్ని అడ్డు పెట్టింది. గుడ్లగూబ తన పెనిమిటిని బాగు చేసే క్రమంలో

# ఓటున్నోడు

- డా.యస్. సత్యప్రసాద్
94405 44675

ఏంటి?
అలా కొత్తగా చూస్తావేం?
పోయిన ఓట్లప్పుడు వచ్చాడు..
గుర్తుపట్టలా?

నీకు దణ్ణాలు పెట్టాడు
నీ నోటికాడ అంబలి
కలబడి తాగాడు
చింపిరిగుడ్డల నీ బిడ్డని
చీమిడి తుడిచి ముద్దాడాడు
మీ బతుకులు మారుస్తానని
మంగమ్మ శపథం చేశాడు

మళ్ళీ ఇప్పుడేంటి, అంటావా?
మళ్ళీ ఓట్లొచ్చాయంట
ఓటెవరికెయ్యాలో తెలియక
తల పట్టుకుకూర్చుంటావని
నేనున్నాగా నీ వాడినని
గుర్తు చెయ్యడాని కొచ్చాడంట

నీ ఓటు తనకెయ్యాలంట
ఢిల్లీ విమానమెక్కించాలంట
అక్కడంతా ఉన్నోళ్ళంట
వాళ్ళంత ఎదుగుతాడంట

నీ బాధలు వినిపిస్తాడంట
ఈసారి మాత్రం మరవడంట
నీ పనిమీదే ఉంటాడంట

కావాలంటే..
కోనేటి నీటి మీద రాసిస్తాడంట
మళ్ళీ ఓట్లొచ్చేదాకా
నిన్ను విసిగించడంట
అవునంట
నీమీద ఒట్టంట

ఏంటి?
అలవాటుగా సరేనంటున్నావ్?
కట్టిపెట్టు నీ తలఊపుళ్ళు
డూడూ బసవన్నలా ఇంకెన్నాళ్ళు?

ఓటున్నోడివి
నే'తల' రాతలు మార్చే ధీటున్నోడివి
నీ బుర్రలోకి ఓసారి పరికించి చూడు
నరనరాన చైతన్యం పాకించి చూడు




మోసాల, వేషాల నిగ్గుతేల్చి చూడు
కుటిల రాజకీయాల చీల్చిచెండాడు

వేలికొనల నుండి విద్యుత్తు పాకించు
పుటం వేసి చూసి ఓటుమీట తాకించు
చరిత్రగతులు మార్చే శక్తిశాలి నీవు
'ప్రజలచేత పాలన'లో భాగస్వామి నీవు ◆

---

తను వానలో తడుస్తున్న సంగతే మర్చిపోయింది. అలా వానలో తడుస్తూ కూడా తన పెనిమిటిని రక్షించమని ఆ ఏడుకొండల వాడిని వేడుకుంది.

మర్రిచెట్టు కింద గుడిసింట్లో రోదన ఎక్కువైంది. ఈ చలిగాలి, భీకరమైన వానల మధ్య తన మనవరాలు జలజను చూస్తూ పాపమ్మ తల్లడిల్లిపోయింది. జలజను తన కౌగిట్లోకి తీస్కోని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఇంతలో ఆకాశం నుంచి ఓ మెరుపు ఆ మెరుపుతో పాటు ఓ ఉరుము ఒక్కసారిగా వచ్చాయి. అవి వెళ్తూ వెళ్తూ జలజ ప్రాణాలను కూడా తీసుకెళ్లిపోయాయి. ఆ విషయం తెలియని పాపమ్మ ఏడుస్తూ స్పృహ తప్పింది. వాన తగ్గుముఖం పట్టింది.

ఉదయం సూర్యకిరణాల తాకిడికి పాపమ్మకు మెలకువ వచ్చింది. ప్రాణం లేని తన మనవరాలిని చూసి ఏడ్వాలనుకుంది. రోధించాలనుకుంది. కానీ శక్తి చాలక మౌనంగా కండ్ల నీళ్లు మాత్రమే కార్చింది. పాపమ్మ రోదనను విన్న ఆ ఊరి చెరువు కట్ట ఒక్క ఉదుటున తెగిపోయింది. ఆ ప్రవాహం పోతూ పోతూ ఆ ఊరి గుడిసెలను జలజ మృతదేహాన్ని, ఆ జలజను తన కౌగిట్లో పొదువుకుని ఉన్న పాపమ్మని తనతో పాటు తీసుకెళ్లిపోయింది.

ప్రవాహంలో కొట్టుకుపోతున్న పాపమ్మ, జలజ దేహాల మధ్య రాత్రంతా చలిగాలికి, వానకి తట్టుకోలేక పెనిమిటిని కాపాడే ప్రయత్నంలో పీనుగైపోయిన గుడ్లగూబ కాయం జాలువారింది. అలా ఆ మూడు బతుకులు శవాలై ప్రవాహంలో కలిసిపోయాయి. వెలుతురు లేని ఆకాశంలో గాయాలై పచ్చి పుండులాగా ఉన్న మేఘాల నుంచి రక్తస్రావాలు రొమ్ము విరుచుకుని విర్రవీగుతూ కురవసాగాయి. ◆

# ప్రేమంటే

- గణేశ్వరరావు బొమ్మిరెడ్డిపల్లి
94407 97725



ప్రేమంటే
అందమైన గులాబీలు ఇచ్చి
స్వచ్ఛమైన మనస్సు ఇచ్చానని చెప్పడం కాదు
దేహాల దాహార్తికి
పార్కుల్లో జంటలై తిరుగడమూ కాదు

నిఖార్సయిన నిజాయితీ
ఆలంబనగా
జీవిత నౌకకు ఓ చుక్కాని ప్రేమ

భావవైరుధ్యాలున్నా
అభివ్యక్తీకరణ చేయలేని
అంతరంతరాలలో వుండే
ఆరాధనతో కూడిన నివేదన ప్రేమ

ప్రేమంటే
పైపైకి కనిపించే
భౌతిక అవయవ అమరికల
ఆకర్షణకాదు

అప్పుడప్పుడూ
కలిసిదిగిన ఫొటోను
ఫేస్‌బుక్ ప్రొఫైల్ పిక్చర్ గా
పెట్టుకునే సీనరీ కాదు
బహుమతులు ఇచ్చిపుచ్చుకోవడం
అనంతరం అభిజాత్యాలకు పోయి
స్వల్ప అభిప్రాయబేధాలతో
తనువులు చాలించటమూ అసలేకాదు

ప్రేమంటే
కోట్లాది భావాణువుల
నిత్యం ప్రవహించే
మనసుల అంతర్వాహిని

ప్రేమంటే
ఆహాలు పోయి
అంతరాలు మరచిపోయి
ఇద్దరూ ఒక్కటే నన్న
ఆప్యాయతల అమృతధార

ప్రేమంటే
ఆహాల అడ్డుగోడలు
సమాధుల్లా కట్టుకోవడం కాదు
ఒకరికోసం ఒకరం
ఎదురుచూపుల్లోనైనా
స్వప్నాల జగత్తులోనైనా
ప్రతి క్షణాన్నీ సుందరంగా
గడిపేయడం ♦

---

# బ్రతుకు చిత్రం

- కంచనపల్లి ద్వారకనాథ్
9985295605



ఉదయాన్నే నిద్రలేచి
నైరాశ్యపు కనురెప్పలపై ముఖపు కన్నటి చారలు
తుడుచుకుని నడకసాగించే గమ్యంలో
ఆహారాన్వేషణలో గగనంలో ఎగిరే పక్షిలా
సాగించే గమనంలో ...
ఆకలిపోరాటం కనిపిస్తుంది
మట్టిమరకల దేహంతో ఆకలిపై యుద్ధంచేయడానికి
ఝాన్సీ రాణిలా బిడ్డను నడుముకు కట్టుకుని
నగరపు రోడ్ల వెంట పడుతుంది
రైలుగేటు వేసినా ...రోడ్లల్లో సిగ్నల్ లైట్లు వెలిగినా
ఆగిన వాహనాల వైపుకు ఆశతో కళ్ళు చూస్తాయి
రెక్కాడితే కాని డొక్కాడని చేతులుచాచే ఆమె చేతుల్లో
పెన్నులు, పుస్తకాలు, బెలూన్లు, వాహన అద్దాలకు
అడ్డుపెట్టే షేడులు, బొమ్మలో,
బొమ్మతుపాకులలాంటి వన్నీ వ్యాపార వస్తువులైపోతాయి
ఆమె బిజినెస్ మేగ్నెట్ కాకపోయినా ...
మాటలతోనో, అర్థించో, ప్రాధేయాపడో తనచేతిలోని
వస్తువులమ్ముతూ
బతుకుభారం మోస్తూ
నిర్విరామంగా, నిరంతరంగా, అలుపెరుగక
శ్రమించే శ్రామికురాలామే
ఎన్ని వస్తువులమ్మినా , ఎన్ని పస్తులున్నా
ఆమె ఆవేదన,పరివేదన ,అన్వేషణ లో
ఈ ధరిత్రీ రంగస్థలంపై జీవన నాటకం ఆడాల్సిందే
బతుకు ఓటమిని జయించాలనే క్రీడాకారిణిలా
పట్టువదలక పోరాటం సాగించాల్సిందే
కష్టాలైనా ,సుఖాలైనా బతుకుసముద్రం అలల
పోటుకు తట్టుకుని ఈది గట్టు చేరాల్సిందే ! ♦

కథ

# ఎంపు

- చాగంటి సోమయాజులు



కుంటాడి కావేళ జోలి నిండిపోయింది. అది ఆవేళ వాడి అదృష్టం. జోలితో జోలెడు ముష్టి. అంటే రెండు కుంచాల బియ్యం. రేపటి చింత లేని బ్రతుకైనా తొడకి బరువుగా తగుల్తూ జోలి వేళాడుతూవుంటే కుంటాడి ప్రాణం సంతుష్టితో సుఖపడ్డాది. పది రోజుల గ్రాసం వాడి భుజాన్ని దిగలాగుతూ వేళ్ళాడుతున్నాది.

కుంటాడు కాలెగరేస్తూ ఊరవతల తోటల్లోకెళ్ళాడు. నెల్లాకు ఎండుపుల్ల లేరుకున్నాడు. మూడు మామిడి పింజలు దొంగిలించాడు. సాయంత్రానికి సత్రపు అరుగులు చేరుకున్నాడు. మూటలో మట్టిపిడత తీశాడు. మూడు రాళ్ళ మధ్య నిప్పుచేసి అన్నం ఎసరు పెట్టాడు.

ఎర్రగా పొయ్యి నిండా లేచింది మంట. చలితో చుట్టుకుపోయిన కుంటాడి శరీరం వెచ్చపడ్డాది. చుట్ట ముట్టించి అడ్డపొగ పెట్టాడు. వాడి తొడకానుకుని వున్న బియ్యపు జోలిని తడువుకుంటూ తనివితో కళ్ళు అరమోడ్చేడు. అన్నం ఉడుకట్టింది.

"ఎర్రీ!" అని కేకపెట్టాడు. సత్రపు అవతల వరండాలో ఎర్రి, దాని కుష్టురోగపు తండ్రి కాపురమున్నారు. ఎర్రి వచ్చింది.

"పులుసుదాకోపాలి యిద్దూ?" అన్నాడు.

"ఏం పులుసురో?" అన్నాది ఎర్రి.

"ఏం పులుసునే, మామిడికాయ నెల్లాకు!"

ఎర్రి పసికట్టింది. కుంటాడి చంకలోంచి దిగి తొడవార గుండ్రంగా మఠం వేసుకొని ఉన్నాది. రెండు కుంచాల బియ్యపు మూట. ఎర్రి బుర్రంతా ఆశ్చర్యంతో నిండిపోయింది.

"గింజలు బాగా దొరికినాయిరో! ఎవిడి మొకం చూసినావు?" అన్నాది.

"సీకటితో సలిమంట ఏసినారు. ఎర్రగా నీ మొకమే సూసినాను?" అన్నాడు.

"ఉన్ననాడూ తినవా? ఎదవ నెల్లాకు సేపలైనా కొన్రా? నానైతే మాంసం కొందును."

"అమ్మో గింజలైపోవు! ఆటితో నానూ పదేను రోజులు బతకాలి."

"రేపు తిరిపెమెత్తవా? జానడు పొట్టకేటోరె ఓ మూడు

పిడికిళ్లు దొరికితే సాల్దా? కొన్నా సేపలు!'' అని బలవంతపెట్టింది.

దాని మాటలో ఉన్నాది ముష్టివాళ్ల ఆర్థిక రహస్యం. మూడు పిడికిళ్ళు దొరికితే చావకుండా బ్రతకవచ్చు! నలుగురమ్మలకి దయగలిగితే పొట్ట నిండిపోతుంది. అదీ ముష్టివాళ్ళ ధీమా. సొట్టాడు లేచాడు. ముసిల్దాని కొట్టుకెళ్ళాడు. ముసిల్ది ముష్టి ముసాఫర్లకి కిరాణీ సామానులు కూరలు, కంప కట్టలూ అమ్ముతుంది. సోలెడు నూకలు వెల పుచ్చుకుని నాలుగెండుచేపల్తో సహా పులుసు సామానిచ్చింది. ఎర్రి పులుసుదాక తెచ్చింది.

"ఓరే, నానోటడుగుతాను!" అన్నాది.

"నువ్వడుగుతావని నాకు తెల్సును" అన్నాడు.

"ఏటివో?"

"బియ్యం!"

'మా యయ్యకి జొరం. మూణ్ణాళ్ళయి ముష్టి నేదు."

"నా నియ్యను."

"ఊరికే అక్కర్లేదురో నీ కాదున్నాయి బదులియ్యి, లేనినాడు మాకాదుచ్చుకో."

"నా నియ్యను."

"ఓ రియ్యరా!"

"జటకావోణ్ణడుగు ఆడంటే నీకు జోకు"

"నీ జిమ్మడ! జటకావోడు నన్నొగ్గేసినాడు."

"నేదు. ఆడు బండి యెక్కి కుచ్చుల కమిచీతో ఛలో ఛలో అంటాడు. ఆడి దగ్గర కెళ్లు!"

"ఆడికి పెళ్ళయిపోనాది."

"ఐతే బైరాగోణ్ణడుగు, బైరాగోడిపాటి సేసినాను కాదు! నా నూకలు కావాలా?"

"ఆ బైరాగోడి సంగతి తెలుసా? వోనాడ్డద్దరేతిరి శిలుం కొట్టి కొట్టి ఒచ్చినాడు. 'ఏటంటావు' అన్నాడు. రూపాయి ఇయ్యి! అన్నాను. 'రూపాయి బుర్రా నాది?' అన్నాడు. 'అయితే పోయి శిలుం కొట్టుకో' అన్నాను. అటు సూసినాడు. ఇటు సూసినాడు. మొల్లోంచి తీశాడు. "యిచ్చురూపాయి. నువ్వేటిరా యిచ్చినావు?"

"నాకాదేటుంది?"

"ఉన్నదే!"

"ఉంటే తగువేమి?"

"ఆ బియ్యమన్నీ వొగ్గేస్తావు?"

"వొట్టికెళ్లు. మాట తిరిగితే వొట్టు."

ఆ రాత్రి చీకట్లో కుంటాడు ఎర్రిని పట్టుకుని చెడ్డ బతిమాలేడు. తను వాళ్లతో ఉండిపోతాననీ, తనకీ గంజి నీళ్లు పోస్తూ ఉండమనీ, తన్ను పెళ్ళాడమనీ పెద్ద పట్ట పట్టేడు. ఎర్రి మెత్తబడ్డాది.

మర్నాడు, ఎర్రి, సొట్టాడు కలిసి వొండుకొంటున్నారు. ఎర్రి చేపల పులుసు పెట్టంది. కైరేతీ సత్రవులో అందరి ముక్కులూ ఎగరగొట్టింది పులుసు వాసన. జ్వరంతో పడుకున్న ముసిలాడు లేచాడు.

"ఈడెవడు?" అడిగాడు.

"ఇక్కడున్న సొట్టాడే!" అన్నాది ఎర్రి.

"ఎందుకొచ్చినాడూ?"

"కలిసి వొండుకుంటున్నాం"

"కలిశా?"

"ఔను మామా కలోసుకున్నాం" అన్నాడు సొట్టాడు. ముసిలాడు ఎర్రగా చూశాడు.

"ఎళ్ళవతలకి సెత్త ఎదవా!" అన్నాడు ముసిలాడు.

"ఎందుకలా కసురుతావు? నానంత సెడిపోయినోణ్ని కాను" అన్నాడు సొట్టాడు.

"ఓ...రెరుగుదునెర్రా! జాత్తక్కువ ఎదవా!"

సొట్టాడు పిచ్చెత్తిపోయాడు.

"నాకా జత్తక్కువ! నాను కాపోళ్ళ కుర్రోణ్ణి. ఏటనుకున్నావో! ఆ! నీ కూతురు గొప్పదయిపోనేదు. జటకావాడితో పోయిన సెటకారీ, ఆ జటకావోడు జొన్నగుడ్డి మాలోడు" అన్నాడు సొట్టాడు.

ముసిలాడు లేచి పులుసుదాక కాల్తో తన్నేడు. పెద్ద అల్లరి అయిపోయింది. ముష్టివాళ్ళంతా మధ్య పడ్డారు. సొట్టాడు కుంటు కుంటూ వెళ్ళిపోయాడు.

'ఈ ఎదవా దొరికినాడు నీకు? సరియైనవోణ్ణి నానే

సూత్తాను' అని ఎర్రికి చెప్పి యెక్కడికో వెళ్ళిపోయాడు. సొట్టాడు మళ్ళా వచ్చాడు.

"మీ యయ్య మాటలు ఇన్నావా?" అనడిగాడు.

"నానేటి సేతును?" అన్నాది ఎర్రి.

"నువ్వు సెయ్యగలిగింది నువ్వు సెయ్యాల!"

"ఏటి సెయ్యమంటావు?"

"నాతో రా!"

"ఎక్కడికి?"

"ఎక్కడకేటి?" రామేశ్వరం దరి నుంచి అద్దుమాలిన రాజ్జెం"

"ముసిలాడు?"

"ఆడేడుపాడేడుస్తాడు!"

"అంటే?"

"వొగ్గేస్థాం!"

'అమ్మ అమ్మ గుండె తీసినోడా? రోగిష్టిపోణ్ణి వొగ్గేసి నీతో కులుకుతూ రమ్మంటావూ?"

"నీకిష్టమైతేనే!"

"ఎళ్ళెళ్ళు!" అని కసిరికొట్టింది. ఎర్రి కెదురుగా గోడమూల గోనె కప్పుకొని గొంగళిపురుగులాగు చుట్టుకొని సొట్టాడు పడుకొన్నాడు. ఎర్రి దాకలో అన్నం గంజి వేసి నంచుకోడానికి నాలుగు మిరపకాయలు పెట్టి సొట్టాణ్ణి లేపింది.

"తిండి తిన్రా! మళ్ళా మా యయొస్తే జట్టీ"

"నాను తిన్ను!" అన్నాడు. ఎర్రి ఎంత బతిమాలినా లేచాడు కాదు.

ముసిలాడు వచ్చేడు. వాడితోపాటు గుడ్డివాణ్ణి ఒకణ్ణి తీసుకొచ్చాడు.

"ఎర్రీ" అని కేకేశాడు. ఎర్రి పలికింది.

"ఇయ్యాళనుంచీ నువ్వు ముగ్గురికి గంజినీళ్ళు ఉడకెయ్యాలి. తెలిసిందా? ఆ! ఈ గుడ్డోణ్ణెరగవూ?"

ఎర్రి గుడ్డివాణ్ణి ఎరుగు. వాడితో వాళ్ళు శ్రీకూర్మండోలా యాత్రకెళ్ళారు.

"ఎర్రీ బాగున్నా?" అని కుశల మడిగేడు గుడ్డివాడు.

"ఏం బాగునే. ముసిలోడు మూల పడ్డాడు" అన్నాది ఎర్రి.

"పెద్దోడయాడు" అన్నాడు గుడ్డివాడు.

"అనాగేనే" అన్నాది ఎర్రి.

"ఎర్రీ, ఇయాళనుంచి, నువ్వు ముగ్గురికి గంజనీళ్ళు ఉడకెయ్యాలి" అన్నాడు ముసిలాడు.

ఎర్రి మతి పోయింది. పెంచి పెద్దదాన్ని చేసిన తండ్రి శుభ్రమైన కుంటాడు దేహీ అని కాళ్ళదగ్గరుంటే గెంటేసి గుడ్డివాడికి కట్టిపెట్టడానికి పూనుకొన్నాడు. ఎర్రికి బోధపళ్ళేదు. ఏమి లాభం? కాదండానికి వీల్లేదు. తండ్రి చెప్పినట్లు నడుచుకోక తీరదు. సత్రపు పంచమూలని కుక్కలాగ చుట్టుకొని కుంటాడు పడుకున్నాడు. తిండి తిన్నాడు కాదు. వాడు అడుక్కు తెచ్చిన బియ్యం పెట్టి ఎర్రి వంట చేసింది. ఎర్రి దిగాలు పడిపోయింది.

"ఎర్రీ! నువ్వు ఎర్రిదానివి. నిజంగా ఎర్రిదానివి" అన్నాడు ముసిలోడు. ఎర్రికి ఏడుపు వొస్తున్నది.

"ఇలారా ఎర్రీ!" అని ముసిలాడు దాన్ని దూరంగా తీసుకువెళ్ళాడు.

"సూసినావా గుడ్డోణ్ణి?" అనడిగాడు. చూడకేం? ఎర్రికి అదివరకే తెలుసు. నల్లగా రాయిలాంటి వొళ్ళు, నుదురు నిండా మెరిసిపోతూ నామం! పేలిన పత్తికాయల్లాగ కిందికి జారిపోతూ గుడ్లు భయమేస్తూ గుడ్డివాడుంటాడు.

"ఆ! సూసినాను." అని తొడలు వాయించుకొంది.

"నీకు సొట్టాడిమీదున్నాది!" అని వెక్కిరింపు నవ్వు నవ్వాడు.

"నా కెవడిమీద నేదు" అని శూన్యాన్ని చూసింది.

"అనాక్కాదు సెప్పు"

"నాకు తెల్దు"

"నీకు సొట్టాడు కావాలి!"

"నీ యిష్టమే కానీ!"

"అనాగన్నావు బాగుంది. అది నోకం మెచ్చిన మాట. నాను సెప్పినాను ఇనుకో!" అన్నాడు ముసిలాడు. ఇనుకోక తప్పుతుందా! నిల్చో అంటే నిల్చోవాలి. వాడితో వెళ్లు అంటే వెళ్ళాలి. మనసా ఇష్టంలేని పెళ్లి కూడా వొద్దంటానికి అవకాశం లేదు. తిరుగుబాటు చేయదానికి సత్తువ లేదు. చావడానికి సిద్ధంగా ఉన్న ఆ ముసలి కుష్టురోగపు తండ్రిలో ఏమున్నాది? పెంచిన తలితండ్రులకి ఆ అధికారం ఒక్కక్క

పిల్లపైని ఉన్నాడి. ఉన్నావె ఒక్కొక్క పిల్లకి తలితండ్రులపైనా గౌరవం.

"ఇనుకోక కాదన్నానా?" అన్నది ఎర్రి.

"ఆడికి ఈడికీ తేడా సెప్పు" అని అడిగాడు.

"సొట్టోడు నక్కనాగున్నాడు. గుడ్డోడు భయమేస్తున్నాడు."

"నాను భయమేస్తూ నేనూ? కుష్టురోగిని నన్నెలాగ సూస్తున్నావు? నాకెలాగ సేస్తున్నావు?"

"బాగుంది. తండ్రివి!"

"నాను తండ్రినని ఇష్టపడ్డావా! ఆడు మొగుడని ఇష్టపడి సేస్తూ ఓకాడుంటే అదే ఇష్టమౌతుంది. సొట్టాడితో ఇంతకీ దినం ఎళుతుందా?"

"ఎందుకెళ్ళదు?"

"ఏనాగెళుతుంది?"

"మూడు పిడికిళ్ళ ముష్టి దొరకదా?"

"అదిగక్కడే నాను సెపుతున్నాను. ఇనుకో." అని ముసిలాడు పెద్ద బోధ చేశాడు. ముసిలాడు ఉపన్యాసం ముష్టిలోకానికి ఉపనిషత్తు.

"ఈ ముసిలాడు సచ్చీ కాలానికి నన్నుద్దానం చేశాడని నువ్వేడవకు. సొట్టాడితో వెళ్ళినావా నీకు కూడు నేదు ఆలకించి యాదస్తుంచుకో! ఇయాళ సెప్పినది మళ్ళ పుస్కరానికి సూసుకో. సొట్టాడు ఏ గుమ్మ మెక్కినా మొహం మీద ఛడిమని తలుపు ఏసుకుంటారు. ఆడి మొకం చూస్తే ముష్టి పలకదు. ఆడు నిన్నట్టుకు బతుకుతాడు. నిన్నాడికి ఈడికి కుదిరిసి ఆడు బతుకుతాడు.

గుడ్డోడు మహరాజు. కళ్ళు లేని కబోది. ఆడి జనమ కదొక్కటే శాన. అడ్జె సూస్తే జాలి పుడతాది. ఏ యమ్మేనా మనసు కరిగి ఇన్ని గింజలేస్తాది.

అదంతా ఎందుకు? ఆడు అద్దుమాలిన పాటగోడు. ఆడి కెన్నెన్ని పదాలొచ్చును. ఆణ్ని చెయ్యి పట్టుకుని తీసికెళ్ళి నాలుగు రోడ్ల మధ్య నోవార కూకోయెట్టి, ఆడి ముందల గుడ్డ పరిసి నువ్వెళ్లిపో. ఆడు సితారట్టుకొని సిరతలు వోయిస్తూ పాడినాడంటే రూపాయి డబ్బులికి నాగారాదు. నీకదే వాకలా.

మనిషిని, సూసినావా? గునపంనాగున్నాడు. నానాగ పెద్ద రోగం మొండిసేతులూ నేవు. జిర్రని సీదడు. ఇంత తెస్తాడు. ఇంత తింటాడు. నీమీద ఆధారపడి నీ సెప్పుసేతలో ఉంటాడు.

నువ్వెక్కడికి ఎళ్ళినా అడిగినోడు కాదు. సూదరాడు. నీకు మనసయిందీ ఇష్టమొచ్చినట్టు తిరుగు తఖరనేదు... ఏమంటావు?" అనడిగాడు.

"నానేటంటాను?" అన్నాది ఎర్రి.

"అనాక్కాదు. ఆణ్ణీ వొగ్గకు. నాను బతికుండగా సెప్పుతున్నాను."

"సరేనే, పద."

"ఈ బైరేగి సిటికి అందరికి తెల్దు. నన్నడిగితే ముష్టి గుంటలంతా ఎతికి ఎతికి గుడ్డోళ్ళనే పట్టుకోవాలి."

"పద"

ఇద్దరు సత్రపు అరుగుమీదికెళ్లారు.

"ఒరే గుడ్డీ! ఎర్రి వొప్పుకుంది. అదింకోమాటందు." ముసిలాడు చెప్పేడు. గుడ్డివాడు పొంగిపోయాడు. వాడి జన్మకి ఎర్రిలాంటి గుంట అజన్మాంతం దొరకడమే భాగ్యము.

"ఎర్రీ! ఇంద, ఇందనోవి తీసి రేపు కడేలూ, అందెలూ కొనుక్కో." అని గుడ్డివాడు దాచుకొన్న ముంతంత డబ్బుల మూట పైకి తీశాడు. కాసులు, దమ్మిడీలు ఎన్నాళ్లబట్టి కూడబెడుతున్నవో ముంతంత మూటని చేశాడు. అన్ని డబ్బులు ఏ ముష్టివాడి దగ్గరున్నాయి! ఎర్రి కళ్ళు చెదిరిపోయాయి.

"నాకు మెళ్ళోకి ఎర్రపూసలు కావాలి" అన్నాది. ఎర్రికి ఎర్రపూసలు ఎన్నాళ్ళనుంచో మనసు.

"అయీ కొనుక్కో! కాని సిలవేరు కడేలూ, అందెలూ కొను. కడేలూ గాజులూ నేకపోతే ఆడదానికీ, మొగాడికీ ఏటీ తేడా? కడేలు సెద్ద అందం" అన్నాడు గుడ్డివాడు. కళ్ళు లేనివాడికి కడియాల రవళులూ గాజుల మోతలే కాబోలు కామాన్ని కదుపుతాయి.

"ఇక నెగండి కూడు తిని తొంగుందాం" అన్నాడు ముసిలాడు. ఎర్రి ముగ్గురికి కూడు సర్దింది. మూకుడుతో కూడు పెట్టి గంజి నిండా పోసి గుడ్డివాడి కందించింది.

"మాయమ్మ కదూ? అద్దిగలాగ ఆడికి దినం ఎళ్ళనీ నీ సేత్తో ఆడికింత ఎట్టు. ఇద్దరూ నా దినం సచ్చీదాకా ఎళ్ళనీయండి. ఎర్రీ! నాను బతికుండగా సెపుతున్నాను. ఆ గుడ్డోణ్ణి వొగ్గకేం?" అన్నాడు ముసిలాడు. ◆

## ఊరెళ్ళినపుడు...

- మల్లారెడ్డి మురళీ మోహన్
8861184899

ఊరెళ్లినప్పుడల్లా నన్ను చూసి
అందరికంటే ఎక్కువ ఆనందిస్తుంది
వీధి చివర ముసలి మర్రిచెట్టు



నాతోపాటు నడిచే కాలవ
నాలోకి తొంగి చూసి, నాలో
తేమ ఉందో, లేదోనని
తన దేహంతో బేరీజు వేసుకుంటుంది

పరవశించి, మోహంతో పలకరించే
ప్రతి గడ్డి పువ్వునీ చూసి
అడుగు తీసి అడుగేయాలనిపించదు, అవి
పాదాల కిందపడి నలిగిపోతాయన్న దిగులు వల్ల

వీధిలో ఆడుకుంటున్న పిల్లల మొహాల్లోంచి
కొన్ని నక్షత్రాలు త్రుంచి, పుస్తకం మడతల్లో
దాచుకుంటాను, నెమలీకలు పుడతాయన్న ఆశతో.

దీవించడానికి అప్పుడపుడూ వచ్చే చినుకులు
ఒక్కోసారి ప్రచండ రూపంతో
తుపానులా వచ్చి శపించిపోతాయి.

వీలున్నపుడల్లా వచ్చి పొమ్మన్నానన్న చొరవతో
వేకువ నుండీ కిటికీ సందుల్లోంచి
గదిలోకి జొరబడి సతాయిస్తోంది శీతగాలి.

పద్యం పాడుకుంటున్న వరిపైరుని చూశాకే,
అసంపూర్ణంగా ఉన్న కవితకి
ఆఖరిపాదం స్ఫురించింది. ◆

---

## పద్యం ఉదయించిన వేకువ

- మెట్టానాగేశ్వరరావు
9951085760

*నాలో నేనుండేదీ..*
*నీ వైపు నా అడుగులు తరలివచ్చేదీ...*
*ఓ పద్యం కోసమేననీ*
*నాకు తెలిసినంతగా నీకు తెలియక పోవచ్చు...*
*తెలియకపోయినా ఫరవాలేదు*
*పద్యానికి రెక్కలొచ్చాక*
*నిన్ను గుర్తుపట్టి తప్పక నీ మీద వాలుతుంది!*

◆

*రాత్రంతా కల్లోలితమై కుదుపేస్తుందనీ*
*ముందురోజు కలగానైనా రాదు*
*తుఫానుసముద్రంలో*
*పడవెన్ని కుదుపులకు లోనయ్యిందో అన్ని*
*కుదుపులు పడకుండా*
*పద్యం సూర్యోదయాన్ని లోకానికి ఇవ్వదు..*
*బలహీన అనైతిక క్షణాల్లో*
*లోపల తిష్టవేసుకున్న చీకటిపురుగుల్ని*
*కొంచెం కొంచెం పొడుచుకు తినందే*
*పద్యవిహంగం ససేమిరా వూరుకోదు..!*

◆

*నడక మొదలైన నాటినుంచీ*



*ఎన్ని తప్పటడుగులూ*
*తప్పువైపు అడుగులు పడ్డాయో..*
*పద్యం పుట్టేవరకూ నాకూ అంతుపట్టదు..*
*ఒక్కో వాక్యమూ ఒక్కో వంకరనీ సరిచేసీ*
*చరణాల్లో దుమ్మునీ క్షాళనం చేసాక...*
*వున్నట్టుండీ నా ప్రయాణం కొత్త మలుపు తిరిగింది!*

◆

*పద్యం పురోడోసుకున్నాక*
*జీవలక్షణాలు పెరగడం గమనించాక...*
*నీవు ఆకుపచ్చని లతవై చుట్టుకున్నావు..*
*పద్యమెంత పని చేసిందీ..*
*నిన్నూ నన్నూ ఒక్కటి చేసిందీ.....*

◆

*పద్యం ఉదయించిన వేకువలో...*
*నీవూ నేనూ జీవహరితానికి అంటుకడుతున్నాం!*
*ఇక*
*మనిద్దరమూ పద్యానికి నమస్కరిద్దాం!!* ◆

# దక్షిణాఫ్రికాలో తెలుగువెలుగు



- రాపోలు సీతారామరాజు
027-727747549,

భౌగోళికంగా ఆఫ్రికాఖండంలో దక్షిణాన ఉన్నదేశం.... నల్లసూరీడు నడయాడి వెలుగురేఖలు పూయించిన దేశం...సామ్రాజ్యవాద, వర్ణవివక్షల ఉక్కుసంకెళ్ళ నుండి 1994లో విముక్తిపొంది స్వేచ్ఛావాయువులు పీల్చిన దేశం...దక్షిణాఫ్రికా.

రమారమి 5-6 కోట్ల జనాభాతో ఉండే ఈ దేశం ప్రకృతివనరులకు, జీవవైవిధ్యానికి ప్రసిద్ధిగాంచింది. భిన్న సంస్కృతులకు, ఆచారసంప్రదాయాలకు, వేషభాషలకు ఆలవాలమీదేశం.

కాలగమనంలో 150-160 సంవత్సరాలు వెనక్కివెళితే...సామ్రాజ్యవాద నీలినీడల్లో ఎన్నో దేశాలు మసకబారిన బ్రతుకులీడుస్తున్న కాలం. పరాయిపాలనలో పరతంత్రపు ఉక్కుపాదం కింద నలిగి నానాకష్టాలు పడుతున్న కాలం. అలాంటి అణచివేతలకు ప్రతీకలుగా హిందూ మహాసాగరానికి ఒకవైపు ఆసియాఖండంలో భారతదేశం, మరోవైపు ఆఫ్రికాఖండంలో దక్షిణాఫ్రికా...

ఈ రెండు దేశాలు బ్రిటీషు వారి దమన పాలనలో నలుగుతున్నవే.

దక్షిణాఫ్రికాలో 1883వ సంవత్సరంలో వెట్టిచాకిరీ నిర్మూలనచట్టం అమలైంది. అప్పటివరకు శ్వేతజాతీయుల తోటల్లో (plantaticns), కర్మాగారాల్లో వారిక్రింద బానిసలుగా పనిచేస్తున్న నల్లజాతీయులు ఈ చట్టం అమల్లోకి వచ్చాక స్వతంత్రులై వారి కిందనే పనిచేయడానికి నిరాకరించారు. ఈ పరిణామంతో పనివారి కొరత ఏర్పడింది. ముఖ్యంగా చెఱకు తోటల్లో, చెఱకు కర్మాగారాల్లో. శ్వేతజాతీయుల ముఖ్య ఆదాయమంతా ఈ వ్యవసాయ తోటల మీదనే ఆధారపడి ఉండేది.

1824-1855 మధ్యకాలంలో మారిషస్ దేశంలో వ్యవసాయ కార్మికుల కొరత ఏర్పడినప్పుడు బ్రిటీషు వారు భారతదేశం నుండి పనివాళ్ళను చౌకగా తీసుకొచ్చి సమర్థవంతంగా పనిచేయించుకున్న వైనం దక్షిణాఫ్రికాలో ఉన్న బ్రిటీషువారి మదిలో మెదిలింది. తక్షణమే ఈస్టిండియా వైపు దృష్టిసారించారు.

అదే సమయంలో భారతదేశంలో తమిళులు, తెలుగువారు అధికంగా నివసించే మద్రాసు రాష్ట్రం, ముఖ్యంగా ఆంధ్రప్రాంతం కరువుకాటకాలతో అల్లాడుతుంది. వేలాదిమందినిబలిగొంది. పైపెచ్చు బ్రిటీషువారి పాలనలో నిరుద్యోగం తాండవిస్తున్న కాలం.

అలాంటితరుణంలోమెరుగైన భవితను ఆశించి చాలామంది తెలుగువారు చిత్తూరు, విశాఖ, అనకాపల్లి, గోదావరి, నెల్లూరు మొదలైన ప్రాంతాలవారు దక్షిణాఫ్రికాలోని నటాల్ (Natal) ప్రాంతానికి ఒప్పందవలస కార్మికులుగా (Indentured Labours) అడుగుపెట్టారు. 1860, నవంబర్ 16 న మొట్టమొదటి ఓడ ఎస్.ఎస్.ట్రూరో (S.S.Truro) 342 మందిని తీసుకొని డర్బన్ నగరానికి చేరుకుంది.

ఇలా 1860లో మొదలై 1911 వచ్చేసరికి వేలాదిమంది తెలుగువారు నటాలికి వలస వచ్చారు. కాని సరైన సంఖ్య చెప్పే ఆధారాలు, ఆధారపత్రాలేవి లేవు. బ్రిటీషు ప్రభుత్వం

వలస కార్మికుల బాగు కోసం కొన్ని చట్టాలు చేసినా దళారీల వ్యవస్థ వాటిని నీరుగార్చాయి. అధికవేతనాలను, ఆకర్షక స్థితిగతులను ఎరగాచూపి ఎందరో తెలుగువారిని అందునా నిరక్షరాస్యులని లోబరుచుకొని ఒప్పందపత్రాలపై సంతకాలు చేయించుకున్నారు. మొత్తంగా నటాలిని స్వర్గధామంగా చిత్రీకరించి ఇక్కడికి తీసుకువచ్చారు. ఇక్కడికొచ్చాక ఇక్కడి పరిస్థితులకు తెలుగునాట ఉన్న పరిస్థితులకు పెద్దతేడా ఏమి కనిపించలేదు. పైగా ఇక్కడిభాష రాక, అటు తమ వాళ్ళకి దూరమై, అరకొర సదుపాయాలతో, అందరిలో కలిసిపోలేక, ఆర్థిక బలిమి లేక నలిగిపోయారు. అతిపెద్ద సమస్య భాషాసమస్యే. ఆంగ్లం వచ్చిన వారు కొద్దిపాటి మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. ఆంగ్లం నేర్చుకోవడమే అనివార్యమైపోయింది.

మొదటగా వచ్చిన ఓడ మద్రాసు నుండి రావడంతో, అందులో తమిళులు ఉండడంచేత, అందునా తెలుగు వాళ్ళలో చాలామందికి తమిళం తెలిసుండడం చేత అందరినీ మదరాసీలుగానే వ్యవహరించ సాగారు. అటు తమిళాధిపత్యం, ఇటేమో ఆంగ్లం అనివార్యం. ఆ రెంటి మధ్య ఆదిలోనే తెలుగు పరిస్థితి గందరగోళానికి గురైంది.

అలా తొట్టతొలుతగా వలస వచ్చిన వారు అత్యంత దుర్భర పరిస్థితుల్లో కార్మికులుగా జీవితాన్ని వెళ్ళదీస్తున్నా, ఆర్థిక ఇబ్బందులతో సతమతమవుతున్నా, రాజకీయంగా, సాంఘీకంగా వెనకబాటుతనాన్ని చవిచూస్తున్నా తమ అనుభవాలు, అనుభూతులు, ఘనసంస్కృతీ సంప్రదాయాలు అన్నీ తెలుగుభాషతోనే ముడివడి ఉన్నాయన్న సత్యాన్ని గ్రహించక పోలేదు. తమ పిల్లలకు తెలుగును అందించడానికి శాయశక్తులా ప్రయత్నించారు. ఇల్లే బడయ్యింది. ఇసుకే పలకయ్యింది. చింతగింజలు, గుమ్మడిగింజలు, గులకరాళ్ళే చదువు నేర్పే ఉపకరణాలయ్యాయి.

వలసకార్మిక జీవితంలోని నిర్భర, తిరస్కారమయ జీవితానికి విసిగివేసారిన భారతీయులు తమ ఉనికిని, సంస్కృతిని కాపాడుకోవడానికి 1912లో దక్షిణాఫ్రికా హిందూ మహాసభ (South African Hindu Maha Sabha) అనే సంస్థని ఏర్పరుచుకున్నారు. తెలుగువారు కూడా ఈ సంస్థనే ఆదరువుగా చేసుకున్నారు. 1924లో శ్రీమతి సరోజినీనాయుడు ఇక్కడికి విచ్చేసినప్పుడు, వారినుండి ప్రేరణ పొంది తెలుగువారు వారి ఉనికికోసమని 1932లో స్వతంత్రంగా దక్షిణాఫ్రికా ఆంధ్రమహాసభని ఏర్పరుచుకున్నారు.

1930 దశకం వచ్చేసరికి వలసకార్మికుల రాక ఆగిపోయింది. మొట్టమొదటిగా వచ్చినవారిలో దాదాపుగా అందరూ చనిపోయారు. ఆ తరువాతి తరం దక్షిణాఫ్రికాలోనే జన్మించిన తరం మొదటితరం భారతీయ సంతతిగా పిలవబడ్డ వారు. వీరు ఇక్కడి జీవనవిధానానికి, పాశ్చాత్య జీవనవిధానానికి తలొగ్గి భారతీయతను, తెలుగుదనాన్ని మెల్లమెల్లగా కోల్పోసాగారు.

తమిళం మాట్లాడేవారు అధికమవటం, వారి జనాభా అధికమవటం, ఆ తమిళ ఆధిపత్యం తెలుగుభాషనేకాక తెలుగు వారి సాంస్కృతిక, మత సంబంధమైన జీవితాల్నే ప్రభావితంచేశాయి. పండుగలు పబ్బాలు తమిళమయ మయ్యాయి. తెలుగువారి ఇంటిపేర్లే కనుమరుగయ్యి నాయుడు, రెడ్డిలాంటివే వాళ్ళింటి పేర్లనుకునే స్థాయికి మారారు.

20వశతాబ్దం ఆరంభం నాటికి కార్మిక ఒప్పందం నుండి విముక్తులైన తెలుగువారు చిరు వ్యాపారాలను, చిన్నచిన్న పరిశ్రమలను ప్రారంభించి జీవపథాన్ని సాగించారు. తమ దక్షతతో వారెంచుకున్న రంగాల్లో రాణించారు. అతికొద్దిమంది మాత్రమే భారతదేశానికి తిరిగివెళ్ళారు.

కార్మిక ఒప్పందం నుండి విడుదలైనా వర్ణవివక్ష సంకెళ్ళ బిగుసు కున్నాయి. రెండవ తరగతి ప్రజలుగా జీవించాల్సిన దుస్థితి. అంతర్జాతీయంగా దేశంపై ఎన్నోఆంక్షలు. అలాంటి పరిస్థితుల్లో ఇక్కడి తెలుగు సంతతి వారికి భారతదేశంలోని తెలుగు ప్రాంతానికి రాకపోకలు తగ్గాయి. భాషాపరిణామాలు, సంస్కృతి, ఆచారాలు అన్నింటికి దూరమయ్యారు. తెలుగు వాళ్ళు తెలుగుదనం కాపాడుకోవడం గగనమయ్యింది. 1994లో వర్ణవివక్ష నుండి విముక్తి పొందాక ఆంధ్రమహాసభ తిరిగి తన కార్యాచరణను విస్తరించసాగింది. డర్బన్ నగరం ముఖ్యకేంద్రంగా పనిచేసే ఈ సంస్థ దక్షిణాఫ్రికాలోని భారతీయ సంతతికి చెందిన తెలుగు వారు సామాజికంగా, ఆధ్యాత్మికంగా, విద్యా విషయాదికాలలో, అభివృద్ధిలో ముందంజలో ఉండేలా ప్రోత్సహించాలని, అండగా నిలబడాలని, తెలుగుభాష, తెలుగు సాహిత్యం, సంగీతం, నృత్యం మొత్తంగా తెలుగు సంస్కృతి ఫరిడవిల్లేలా చర్యలు చేపట్టాలని తెలుగులో మరియు ఆంగ్లంలో పత్రికలు నడపాలని, పుస్తకాలు ప్రచురించాలని, పండుగలు జరపాలని లక్ష్యాలుగా పనిచేస్తుంది.

ఆంధ్ర సంగీతమేళా, త్యాగరాజస్వామి సంగీతోత్సవం, కూచిపూడి నృత్యోత్సవంలాంటి సాంస్కృతిక కార్యక్రమాలను,

# చిత్రకారుడు

- జి. రామచంద్రరావు
8985894114

తటిల్లత ఒకటి
అతని హృదయంలో తళుక్కుమంటుంది.
ఆ క్షణంలో
ఆకాశంలో ఎగిరే పక్షుల గుంపులు
అతని కొనవ్రేళ్ళపై ప్రాణం పోసుకుంటాయి.
ఎక్కడో అరణ్యంలో నర్తించాల్సిన మయూరం
అతని కాన్వాసు మీదకొచ్చి
పురివిప్పి నాట్యం చేస్తుంది.
సృష్టికి ప్రతిసృష్టి చేసే బాధ్యత
ఆచేతులకే ఇవ్వబడ్డదేమో
కొన్నాళ్ళ తరువాత రావాల్సిన చైత్రం
చిత్రంగా
ఆ సృజన శిలి పిలుపుకి ముందే వస్తుంది.

కోపంతో
నిప్పుల్ని కురిపించాల్సిన ఎండ
తాపీగా కుంచెలో నుండి
జాలువారుతుంది.
సమాజం రూపమైతే
దాని ప్రతిబింబం చిత్రం.
కవిత ఆత్మైతే
చిత్రం తన దేహం.
సప్త వర్ణాల కలయికతో
సుందర స్వప్నాలకు
రూపులు దిద్దే

నేతగాడు తను
లోకంలోని
అందాలనే కాకుండా
కష్టాలు కడగండ్లను కూడా
కళ్ళముందు నిలబెట్టే
ఊహల చిత్రకారుడతను.
ఆ చేతి గీత నవ్విస్తుంది.
చెయ్యిపట్టి
సమాజాన్ని ముందుకు
నడిపిస్తుంది. ◆

---

వినాయకచవితి, కృష్ణాష్టమి, శివరాత్రి, నవరాత్రిలాంటి హైందవ ధార్మిక కార్యక్రమాలను అందరి సహకారంతో నిర్వహిస్తుంది.

'పాఠశాల' పేరుతో తెలుగుని నేర్పించే ప్రయత్నం చేస్తుంది. ప్రస్తుతం 20 లక్షల వరకు భారతీయ సంతతికి చెందిన జనాభా ఉండొచ్చని అంచనా. అందులో 14% తెలుగు వారి జనాభా ఉండొచ్చని అంచనా. 1984 నుండి తెలుగు ఒక పాఠ్యాంశంగా ఇక్కడి బళ్ళల్లో ఉన్నా చదివే వారి సంఖ్య చాలాతక్కువే అని చెప్పొచ్చు. ఇప్పటికైనా మేల్కొని భారతదేశంలోని తెలుగు ప్రభుత్వాలతో కాని, ఇక్కడి ప్రవాస తెలుగు వారితో కాని సత్సంబంధాలు కొనసాగించి తమలో తెలుగుభాషను, సంస్కృతిని పునరుద్ధించుకోనట్లైతే ఇక్కడి భావితరాలు తెలుగు అస్తిత్వాన్నే కోల్పోయే ప్రమాదముంది.

ఇకపోతే ఈ దేశంలో ప్రవాస తెలుగువారి (NRI) జనాభా దాదాపు పదివేల వరకు ఉంటుంది. కేప్టౌన్, డర్బన్ లాంటి నగరాల్లో ఉన్నా సింహభాగం జోహానెస్బర్గ్ నగర పరిసర ప్రాంతాల్లోనే నివసిస్తున్నారు. ఎక్కువశాతం ఐటీరంగంలో పనిచేస్తున్నా, వ్యాపారరంగంలో రాణిస్తున్న వారిసంఖ్య గణనీయంగా పెరగసాగింది. దుకాణ సముదాయాలు, రెస్టారెంట్లు, విద్యాలయాలు, సాఫ్ట్‌వేర్ సంస్థలు మొదలైన వ్యాపారాలు చేస్తున్నారు. వ్యవసాయరంగంలో కూడా మనవారు రాణించడం ఇప్పుడే మొదలయ్యింది.

సేవావితరణ, ధార్మికకార్యక్రమాలు, పూజాపునస్కారాలు, పండుగలు, భాషాసంస్కృతులపరిరక్షణ, పరివ్యాప్తి... ఇలా విభిన్న అభిరుచులు, ఆశయాలకు వేదిక కల్పించుకోవడానికి చిన్నచిన్న సంస్థలుగా ఏర్పడినా అవన్ని 'తెలుగు, అనే ఒక గొడుగు కింద వర్ధిల్లుతున్నవే. ఇవన్ని ఎటువంటి అపార్థాలకు తావివ్వకుండా అందరిని కలుపుకుంటూ, అందరితో కలిసిపోతూ సౌభ్రాతృత్వంతో కలిసిమెలిసి ఉంటాయి.

ఉగాది, బతుకమ్మ, వినాయకచవితి, దసరా, దీపావళిలాంటి పండగలు తెలుగు వాతావరణాన్ని ప్రతిబింబించేలా ఉత్సవంలా సందడిగా జరుపుకుంటూ భావితరానికి మనఘన వారసత్వాన్ని పరిచయం చేస్తున్నారు. భారతహైకమీషనర్ జరిపే స్వాతంత్ర, గణతంత్ర, వేడుకల్లో ఉత్సాహంగా పాలుపంచుకుంటూ మనసంస్కృతిని, కళలను మిగతా భారతీయ రాష్ట్రాల ప్రవాసులకు, దక్షిణాఫ్రికా జాతి ప్రజలకు పరిచయం చేస్తూ వారందరు తెలుగు రాష్ట్రాల వైపు తలెత్తి చూసేలా చేస్తున్నారు.

'మనబడి' లాంటి కార్యక్రమాల ద్వారా ఇక్కడి పిల్లలకు తెలుగును భోదిస్తున్నారు.

ఆఫ్రికా అంటే చీకటిఖండం, ప్రవాసభారతం అంటే అమెరికాలాంటి దేశాలే అన్న అపప్రథని కాలరాస్తూ ఎన్నో విజయాలని సాధిస్తున్నారు ఇక్కడి తెలుగువారు.

ఇక్కడి భారతీయసంతతితో కాని, మిగతా దేశవాసులతోకాని సత్సంబంధాలను కొనసాగిస్తూ, ఉద్యోగ వ్యాపారాల్లో తమ దక్షతను చూపిస్తూ ఆఫ్రికాగడ్డపై తెలుగు కీర్తిపతాకను సగర్వంగా ఎగరేస్తున్నారు. ◆

# సృజనోత్సవం

- పసుమర్తి పద్మజవాణి
9705377315



కొన్ని పుస్తకాలకుండే పరిమళం
"కునేగా మరికొళుందు" లా మనసుని
మైమరిపిస్తుంది.
ఈ పుస్తక ప్రాంగణం లోకి అడుగుపెట్టగానే
చల్లని నీడేదో మన వెంట నడచివస్తున్నట్టు
ఒక తన్మయత్వం ..
యెంతమంది తేజోమూర్తులు మనల్ని
పలకరిస్తారు మౌనంగా
యెంత పదసంపద సహర్షంగా మనకి
స్వాగతం పలుకుతుందీ!
అష్టావధాన, శతావధాన, సహ
పరనాది సద్గోష్టుల .. సంప్రదాయ
పరంపరలతో .. కవి పండిత పీఠాల
గౌరవాదరణల మోసులెత్తిన అజంత తెలుగు ..
ఒకచోట శిల్పసౌందర్య మూర్తియై ..
వేరొక దిక్కున అగ్నిపూల కేతనమెత్తి
శత సహస్ర శ్రామికజన హృదయ గీతమై
మిరిమిట్లు గొలిపి, ఒక చెంప జానపదమై గరగలెత్తి ..
అస్తిత్వ చైతన్య వారాసియై ..
యాత్రగా .. చరిత్రగా సాహిత్యం ..
కాలం మీద తడియారని సంతకం చేస్తూనే వుంది ..
పైకి కాలం సజావుగా సాగిపోతున్నట్లున్నా ..
ఇంకా .. గుక్కెడు గంజి కోసం, బుక్కెడు బువ్వ కోసం
పల్లేర్లయి తిరిగే మానవ సమూహాలు ..
దూదేకులు, పింజారీలు, ఫకీర్లు, జింకలోళ్ళు,
లోహర్లు, లంబాడీలు .. వాడల్లో .. ఇండ్లల్లో
అనేకానేక పూడుకుపోయిన గొంతుల్లో నిశ్శబ్దంగా
నిస్సహాయంగా సమాధవుతోన్న అనేకానేక
గుండె చప్పుళ్ళని అక్షరాలుగా మలిచి
నేరుగా మన గుండెకి గుదిగుచ్చే
అలయ్ భలాయిలీ పుస్తకాలు ..
ఘర్షణామయ జీవన సంక్షోభాల్ని దృశ్యమానం చేసి
పుస్తకం తన విజయ కేతనాన్ని
ప్రజల శిరస్సుల మీద ఎగరవేయగలదన్న
ప్రజాకవి అద్దేపల్లి వాక్కు అక్షరసత్యం.
ఎక్కడ చతికిలపడ్డామో - ఎక్కడ
పుంజుకుని నిలబడ్డామో -
వుద్యమమై విరుచుకుపడాల్సిన చోట
కనీసం మనుష్యులుగా కూడా
మిగలలేకపోయామో
బొమ్మ కట్టి చూపించే సుదీర్ఘ జీవనానుభవాల
సంపుటాలు ఇవి.
రోజుల్లోంచి నెలల్లోకి - నెలల్లోంచి సంవత్సరాల్లోకి
గిరగిరా తిరిగిపోతూ .. చివరికెక్కడో
ఒక ఒడ్డున నిస్తేజంగా నిలబడినప్పుడు
నీకు దీపధారియై దారి చూపించేది పుస్తకమే -
మన సమయం హరించే - మనల్ని అభద్రత లోకి నెట్టేసే
అంతర్జాల వ్యామోహం ఇంక వద్దు
పుస్తకంతో సృజనశీల ప్రయాణమే ముద్దు.

◆

# మోదీకరణకు 'భరత'వాక్యం?



- తెలకపల్లి రవి

తెలుగు రాష్ట్రాలలో ఎన్నికల దృశ్యం కాస్త వేరైనా అలసత్వానికి ఆస్కారం లేదు. మోదీకరణ పర్యవసానాలను తక్కువగా అంచనా వేస్తే రాజ్యాంగ వ్యవస్థలకూ ప్రజాస్వామ్య భారతానికీ ముప్పు తప్పదు. అసహన రాజకీయాలకు భరత వాక్యం పలికి దేశాన్ని కాపాడగలిగింది ప్రజల తీర్పే.

దేశం మరో మహా సమరానికి సన్నద్ధమవుతున్నది. ప్రతి ఎన్నికా ఎప్పటికప్పుడు ఒక సవాలే. కొన్ని నిజంగానే చరిత్ర చౌరస్తాలు. 17వ సార్వత్రిక ఎన్నికలపై చరిత్రలో ఎరుగనంత ఉత్కంఠ నెలకొందంటే మోదీ సర్కారు తీరే కారణం. ఈ దేశ లౌకిక ప్రజాస్వామ్య పునాదులనూ, ఏడు దశాబ్దాల స్వాతంత్ర్యంలో సృష్టించుకున్న రాజ్యాంగ వ్యవస్థలనూ కాపాడుకోగలమో లేవో ప్రస్తుత ఎన్నికలే తేల్చాల్సి వుంటుంది. (ఇవి దేశంలో జరుగుతున్న చివరి ఎన్నికలని బిజెపి ఎంపి సాక్షి మహరాజ్ అనడంలో చాల హెచ్చరికలున్నాయి.) ఇది గాక ఆంధ్రప్రదేశ్‌లో అదనంగా శాసనసభ ఎన్నికలు కూడా జరగాల్సి వుంది. విభజిత రాష్ట్ర ప్రాతిపదికన తొలిసారి జరిగే ఈ ఎన్నికలు కూడా అంతే కీలకమైనవి కనుక స్థానిక సవాళ్లు జోడించుకోవలసి వుంటుంది.

ముప్పై ఏళ్ల తర్వాత కేంద్రంలో పూర్తి మెజార్టీతో అధికారంలోకి వచ్చింది మోదీ ప్రభుత్వమే. తనది శక్తిమంతమైన ప్రభుత్వం గనకనే స్థిరత్వం దృఢత్వం సాధించి దేశ ప్రతిష్ట పెంచిందని మోదీ చెబుతుంటారు. కొందరు వ్యాఖ్యాతలూ అంటుంటారు. వాస్తవం ఏమంటే దీనివల్ల పరిస్థితి పెనం మీద నుంచి పొయ్యిలోకి పడినట్టయింది. రాజ్యాంగానికి మూల స్తంభాలుగా నిలిచిన లౌకికతత్వం, ప్రజాస్వామ్యం, సమాఖ్యతత్వం మూడూ దాడికి గురైనాయి. సుప్రీం కోర్టు సీనియర్ న్యాయమూర్తులే న్యాయం కోసం ఘోషించాల్సి వచ్చింది. రిజర్వు బ్యాంకు గవర్నర్లు నిష్క్రమించవలసిన పరిస్థితి ఏర్పడింది. ప్రధాన దర్యాప్తు సంస్థ సిబిఐ వ్యవహారాలు కుక్కలు చింపిన విస్తరిలా మారి కోర్టుకెక్కాయి. సెన్సార్ బోర్డు, యుజిసి, సాహిత్య అకాడమీ, చరిత్ర పరిశోధనా మండలి, సివిసి, కాగ్ ప్రతిదీ ప్రకంపనాలకు గురైంది. విజ్ఞాన కేంద్రాలుగా విలసిల్లాల్సిన విశ్వవిద్యాలయాలు విద్వేష వివాదాలకు విషాదాలకు నిలయాలై విద్యార్థులు అధ్యాపకులు నిర్బంధాలు చవిచూశారు. వైజ్ఞానిక సంస్థల్లోనూ మౌఢ్యానికి పెద్ద పీట దక్కింది. కళా సాహిత్య సాంస్కృతిక సంస్థల్లో ప్రతీప శక్తులు తిష్టవేశాయి. పార్లమెంటులో మొదటగా మొక్కి మరీ ప్రవేశించి సభా సంప్రదాయాలను తొక్కిపారేశారు. రాష్ట్రాల హక్కులు, వనరులు హరించడమే గాక రాష్ట్రాల ప్రాతినిధ్య సభగా ఏర్పడిన రాజ్యసభను అలంకారంగా మార్చేశారు. ద్రవ్య బిల్లుల పేరిట అన్నీ లోక్‌సభతోనే సరిపెట్టేశారు. దేనిపైన చర్చ, వివరణ, సమాధానం, సంజాయిషీ అన్నవి మృగ్యమై ప్రతిదీ ప్రధాని కార్యాలయం చుట్టూ తిరిగే అనధికార అధ్యక్ష తరహా పాలనగా నడిచింది.

స్వచ్ఛ భారత్, శ్రేష్ఠ భారత్, కౌశల్ భారత్ అని హిందీలోనూ డిజిటల్ ఇండియా, మేడిన్ ఇండియా అని ఇంగ్లీషులోనూ నానా లేబుల్స్‌తో రోజుకో హంగామా నడిచింది గాని, గొంగళి వేసిన దగ్గరే వుండిపోయింది. అయిదేళ్లలోనూ నోట్లరద్దు, జిఎస్‌టి ఆర్థిక కార్యకలాపాలను ఆటంకపరచి ఆర్థిక కల్లోలానికి ఉద్యోగ హననానికి దారితీశాయి. అయిదు దశాబ్దాలలో ఎన్నడూ లేనంతగా నిరుద్యోగం 7.2 శాతానికి చేరింది. ఈ సత్యాన్ని కప్పిపుచ్చేందుకు ప్రభుత్వం అంకెలు

మారుస్తుంటే భరించలేక గణాంకాల విభాగం అధికారి కూడా తప్పుకున్నారు! వ్యవసాయరంగంలో ఆదాయం గత ఒకటిన్నర దశాబ్దంలో లేనంత తక్కువకు పడిపోయింది. రైతాంగం ఆత్మహత్యలు, రుణభారం దేశాన్ని కలచి వేస్తున్నాయి. జిడిపి దిగజారుడుపై ప్రపంచ బ్యాంకు లెక్కలు వెక్కిరిస్తే భరించలేని సర్కారు వాటిని తిరస్కరించింది.

2014లో యుపిఎ స్థానే మోదీ గెలవడానికి ఒక ప్రధాన కారణం కుంభకోణాలు. ఇప్పటికీ వాటి గురించే మాట్లాడతారు గాని తన హయాంలో రాఫెల్ గురించి నోరు మెదపరు. 60 వేల కోట్ల ఈ వ్యవహారంలో ప్రభుత్వ సంస్థ హెచ్ఎఎల్‌ను బలిపెట్టి అనిల్ అంబానీకి ప్రత్యక్ష ప్రయోజనం కలిగించిన ప్రధాని జోక్యం నిస్సందేహంగా రుజువైనా సుప్రీం కోర్టును కూడా తప్పుదోవ పట్టించే సమాచారమిస్తారు. అదానీకి ఏకంగా ఆరు ఎయిర్ పోర్టులు కట్టబెట్టి ఆశ్రిత పెట్టుబడిదారీ విధానాన్ని పరాకాష్టకు చేర్చారు. కుబేరులు బ్యాంకులకు 15 లక్షల కోట్లు ఎగ్గొట్టినా బే ఫికర్ అన్నట్టు విజయ్ మాల్యాలు, నీరవ్ మోదీలకు వీసాలిచ్చి వీడ్కోలు చెప్పి పంపించిన చౌకీదార్ మన ఏలిక. పద్దెనిమిది మాసాల కిందట మాల్యాను పట్టుకున్నట్టు హడావుడి జరిగినా ఆయన వచ్చింది లేదు! నీరవ్ మోదీ చిద్విలాసాలను టెలిగ్రాఫ్ జర్నలిస్టు ఫోటోలు తీసి పంపించాక ఇప్పుడు అరెస్టు చేశామని ప్రచారం చేసుకున్నారు గాని వచ్చినప్పుడే నమ్మాలి. నల్లధనం వెలికి తీసింది లేకపోగా పేరు వెల్లడించనవసరం లేని ఎన్నికల బాండ్ల ద్వారా బిజెపి అత్యధిక నిధులను రాబట్టుకుంటున్నది. ఇదీ మోదీ స్వచ్ఛ భారతం.

ఇంతకంటే దారుణం స్వచ్ఛభారత్ పేరిట సాగిన కక్షభారతం. గో రక్షణ పేరిట ముస్లిములు తదితరులపైన దాడి చేసి ప్రాణాలు తీసిన ఘటనలు అనేకం. నైతికత పేరిట అన్నా చెల్లెళ్లకు పెళ్లిళ్ళు చేయడం, యువతపై అమానుష దాడులు సంఘ పరివార్ ఘాతుకాలే. గౌరీ లంకేశ్ వంటి పాత్రికేయులు, కల్బుర్గి వంటి పరిశోధకులు హత్యలకు గురైనా నిందితులను పట్టుకున్నది లేదు. అత్యాచార నిరోధ చట్టానికి గండికొట్టేలా సుప్రీం కోర్టు కెక్కిన కేంద్రం తప్పు దిద్దుకోవలసి వచ్చింది.

విద్యా సంస్థల్లో ఎస్సీ ఎస్టీ రోస్టర్‌కు కూడా ఎసరు పెట్టిన స్థితి. మహిళల గురించి ఉన్నత స్థానాల్లోని వారే హీనాతిహీనంగా మాట్లాడటమే గాక అత్యాచారాలనుకూడా మతంకోణంలో చూసి మానవత్వాన్ని మంటగలిపిన ఉదంతాలూ వున్నాయి. వామపక్ష కేరళలోనూ శబరిమల పేరిట చిచ్చుపెట్టబోయి భంగపడ్డారు. అయ్యప్ప కలిసిరాక అయోధ్యను వెలికి తీశారు. లౌకిక తత్వం అన్న పదమే బూతుగా మారిపోగా భిన్నమతాలతో కూడిన ఈ దేశం పేరును కూడా హిందూ రాష్ట్రంగా మార్చాలనే వరకూ మాట్లాడుతున్నారు. ఈ విద్వేష రాజకీయాలతో దేశ రక్షణనూ, భద్రతనూ, ఆఖరుకు సైనిక వ్యవహారాలనూ కూడా ముగ్గులోకి లాగడంతో పరిస్థితి వూహించలేనంత దిగజారింది. తాము ఉగ్రవాదాన్ని ఉక్కుపాదంతో అణచేస్తామని చెప్పిన ఈ పాలకుల హయాంలోనే తీవ్ర దాడులు జరిగాయి. కశ్మీర్‌లో వక్రనీతి ఫలితంగా మిలిటెంట్ గ్రూపుల ప్రాబల్యం పెరిగింది. పుల్వామాలో ఉగ్రదాడికి నలభై మంది జవాన్లు హతమైన తర్వాత బాలాకోట్ వైమానిక దాడులు బాగా ప్రచారం చేసుకున్నా ఫలితం పరిమితమే. ఈ విషయాలు విమర్శనాత్మకంగా మాట్లాడితే దేశద్రోహం ముద్ర పడిపోతుంది. సైనిక దళాల చర్యలను ప్రచారంలో వాడుకోరాదని ఎన్నికల సంఘం నిర్దేశించినా బాలాకోట్ తర్వాత తామే తిరిగివస్తామని మోదీ గణం వూదరగొడుతున్నది. ఎపికి వాగ్దానం చేసిన ప్రత్యేక హెూదాను భూస్థాపితం చేసిన మోదీ విశాఖ పట్టణంలోనూ ఇవే కబుర్లు వినిపించారు.

ఈ నిర్వాకాల వల్ల మరోసారి గెలవడం దుస్సాధ్యమని బోధపడినందునే బిజెపి ప్రత్యక్ష పరోక్ష మిత్రులనూ రకరకాల పద్ధతులలో చేరువ చేసుకుంటున్నది. ఎంతో బలహీనపడిన కాంగ్రెస్ కంటే బలీయమైన ప్రాంతీయ పార్టీల సవాలు గురించే బిజెపి నేతల ఆందోళన. ఉత్తరప్రదేశ్‌లో ఎస్‌పి, బిఎస్‌పిల కలయిక ప్రత్యేకంగా భయపెడుతున్నది. అయితే ఇప్పటి వరకూ ఎపితో సహా ఎక్కువ చోట్ల కాంగ్రెస్ ఎలాటి మిత్రులనూ కూడగట్టుకున్నది లేదు. ఎపి, తెలంగాణలలో బిజెపి ప్రధాన శక్తికాదు. ఏకపక్ష హవా నడిపిస్తున్న కెసిఆర్ రెండు జాతీయ పార్టీలకూ వ్యతిరేకమంటుంటే వైసీపీ నేత రెండింటి మధ్య తటస్థమంటున్నారు. నాలుగేళ్లు కలసి నడిచిన టిడిపి గత ఏడాది విడగొట్టుకున్నా కాంగ్రెస్‌తో పొత్తు పెట్టుకోలేదు. జనసేన వామపక్షాలు (బిఎస్‌పి) కూటమి సైద్ధాంతికంగా బిజెపి వ్యతిరేక అంశాలతో ప్రకటన చేసింది. ఈ విధంగా తెలుగురాష్ట్రాలలో ఎన్నికల దృశ్యం కాస్త వేరైనా అలసత్వానికి ఆస్కారం లేదు. మోదీకరణ పర్యవసానాలను తక్కువగా అంచనా వేస్తే రాజ్యాంగ వ్యవస్థలకూ ప్రజాస్వామ్య భారతానికీ ముప్పు తప్పదు. అసహన రాజకీయాలకు భరత వాక్యం పలికి దేశాన్ని కాపాడగలిగింది ప్రజల తీర్పే. ◆

# చుట్టుముట్టిన సుమ సుగంధం

- సిహెచ్.వి. బృందావన రావు
8328342609



సమయం రాబోతున్నదని
దానికి ముందే తెలుస్తుంది
చెంగున పశుల కొష్టం మీదికెక్కి
నల్దిక్కులూ తేరిపార జూస్తుంది
ముక్కుతో మంచువులను దువ్వుకుని
రెక్కలను టపటపలాడిస్తుంది
ఆ ప్రశాంత విశాంత ప్రభాత పూర్వ సంధ్యలో
నిశ్శబ్ద నిస్తబ్దతను భగ్నం కావిస్తూ
ఒక్కసారిగా దిక్కుడ్యాలు ఉలికిపడేటట్టు
కొక్కొరొకో అని గళమెత్తి అరుస్తుంది కోడిపుంజు
అల్లంత దూరాన రావిచెట్టు
తన ఆకుల గలగలలతో
కరతాళ ధ్వనులు గావిస్తుంది
దేవాలయ ధ్వజ స్తంభం తన గంటలను కదిలించి
కలవరంతో మందమందంగా హసిస్తుంది
ఒక సంగీత సుగంధం గాలినిండా పరచుకొని
కర్మసాక్షికి ఆహ్వానం పలుకుతుంది
తూర్పు నుంచి తన రాకను సూచిస్తూ
ఒక కషాయ కేతనాన్ని
పైలట్ కాన్వాయ్‌గా పంపుతాడు సూర్యుడు!
తువ్వాయిల గంతులూ
ముంగిళ్లముందు కళ్ళాపుల టపటపలూ
రాట్నాల కదుళ్ళ రాగాల రావాలూ
పొదుగుల నుంచి సుయ్ అంటూ సాగే పాలధారల చప్పుళ్లూ
తొలిప్రొద్దు కోలాహలంతో అక్కడొక
స్వర్గచైతన్యం విచ్చు కుంటుంది
ఒక మనోహర దృశ్య కావ్యానికి
అప్పుడక్కడ ఆవిష్కరణ జరుగుతుంది.
అన్నా! ఎక్కడిదీ దృశ్యం?
అక్కా! ఎప్పటిదీ కావ్యం?
పూదోటల మీంచి సాగివచ్చిన
సుమ సుగంధం కమ్ముకున్నట్లు
ఎప్పటి జ్ఞాపకం!
ఇదిప్పుడు నన్ను చుట్టుముట్టుతున్నది
దూరపు గాలి మీంచి తేలొచ్చే
పసుల పిల్లాడి పిల్లనగ్రోవి పాటలా
ఎక్కడిదీ అనుభవం?
నన్నిప్పుడు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది
వాగొడ్డు మఱ్ఱిచెట్టు చాటు నుంచి
ప్రణయిని నీలికనుల ఆహ్వానంలాగా
ఇపుడు ఈ పరవశం
ఎక్కణ్ణుంచి వెంటబడి వేటాడుతోంది నన్ను?
అన్నా, ఎక్కడిదయ్యా! ఈ పల్లె స్వర్గపు పరమాద్భుతం
చెల్లీ, ఏమైందమ్మా? ఆ ఆనందాల నాక సంగీతం
కాలం మారిపోతే మాత్రం
కన్నీటికి విలువ తరిగిపోవాలా?
కార్లూ ట్రాక్టర్లు వచ్చాయని
కళాత్మకత కనుమరుగు కావాలా?
మనిషి బ్రతుకంటే మల్లెపందిరి కదా
బ్రతుకులో సౌందర్యం లేకపోతే అదేం బ్రతుకు
అనుభవంలో పరవశం లేకపోతే అదేం అనుభవం
ఎన్నిటిని కోల్పోతున్నాం మనం,
శుక్తిని తెరిచి చూడు - ఒకే ముత్యం కనిపిస్తుంది
రాతిని పగిల్చి చూడు
తడితడిగా తేమ తగుల్తుంది
పల్లెను పలుకరించి చూడు
మందార మకరందం లాంటి మనసు కన్పిస్తుంది
హేమంతపు వేకువజాముల్లో
నును మంచులో తడిసి
చెట్టు చుట్టూ జలజలా రాలిపడే
పారిజాతాల పరిమళాల వరద కదా
పల్లెటూరి జ్ఞాపకమంటే
పల్లె తల్లి చల్లని మనసు
ఎప్పటికీ ఆరిపోని చందనపు దినుసు. ◆

# మలుపు

- మారుతి పౌరోహితం
9440205303



గంగాధర్, శకుంతలలు ఆదోని రైల్వే స్టేషన్‌లో ట్రైన్ కొరకు ఎదురు చూస్తూ వున్నారు. రైల్వే లైన్ ఎలెక్ట్రిఫికేషన్ పనులవలన రైలు గంట ఆలస్యంగా వస్తుంది అనే ప్రకటన వెలువడింది. ఇంకా గంట ఆగాలా అనుకొంటూ శకుంతలను కూడా కూర్చోమ్మంటూ చేతితో సైగ చేస్తూ బెంచీ మీద కూర్చున్నాడు గంగాధర్. బెంచి వెనకాలవరకు ఆనుకోని కూర్చొని కళ్ళు మూసుకొన్నాడు. అలా కళ్ళు మూసుకోగానే గంగాధర్ పాత జ్ఞాపకాలలోకి జారుకున్నాడు. తను ఇదే రైల్వేస్టేషన్ చివరన పదహారు సంవత్సరాల క్రింద ఆత్మహత్యకు ప్రయత్నించాడు. ఈ రోజు ఈజీవితం సుబ్రహ్మణ్యం సర్ పెట్టిన బిక్ష అనుకొంటూ గంగాధర్ గతంలోకి వెళ్లి పోయాడు. పదహారు సంవత్సరాల క్రింద జరిగిన సంఘటనలు లీలగా గుర్తు రాసాగాయి.

♦♦♦

ఆదోని రైల్వే స్టేషన్ చివరన జనాలు లేనిచోట గంగాధర్ రైలు పట్టాల పక్కగా నిల్చొని రైలు కోసం ఎదురు చూస్తూ ఉన్నాడు. ఒకసారి జేబు తడిమి చూసుకొన్నాడు. రాసుకొన్న చివరి లేఖ భద్రంగానే ఉన్నది. తన ఆత్మ హత్యకు కారణం ఎవరూ కాదనీ, జీవితం మీద విరక్తితో ఆత్మహత్య చేసుకుంటున్నానని, అమ్మను అన్న వదినలు చక్కగా చూసుకోవాలనీ అందులో వ్రాసి ఉన్నాడు. ఒకవేళ తను రైలు క్రింద పడితే వ్రాసుకున్న లేఖ రక్తంతో తడిచి పోయి విషయం తెలియకపోతే అన్న అనవసర ఇబ్బందులు పడొచ్చని ఒక ప్లాస్టిక్ కవర్లో సూసైడ్ నోట్ ను భద్రంగా సీల్ చేసి ఉంచుకున్నాడు. రైలు ఇంకా రాలేదు.

గంగాధర్ మనసులో ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయ్ ! అమ్మనే గుర్తుకొస్తా వుంది. చిన్నపుడే నాన్న మరణించాడు. అమ్మ అన్నయ్యను, తనను ఇళ్ళల్లో పాచీపనులు చేస్తూ చదివించింది. అన్నయ్య బి.ఇడి చేశాక టీచరుగా ఉద్యోగం వచ్చింది. అమ్మనే పట్టుబట్టి ఇద్దరూ ఉద్యోగస్తులయితే తప్ప పిల్లల్ని పెద్ద చదువులు చదివించు కోలేమని, బి.యిడి చేసిన అమ్మాయి అయితే టీచర్ వుద్యోగం సులువుగా వస్తుందని అటువంటి ఆమెనే కోడలుగా తెచ్చుకోవాలని అన్నయ్యకు వదినను చేసుకుంది. కాని వదినకు మూడుసార్లు డివిస్సి పరీక్ష వ్రాసినా టీచర్ వుద్యోగం రాలేదు. ఆ అసహనం అంతా వదిన, అమ్మ మీద గంగాధర్ మీద చూపుతూ వుంటుంది. అమ్మ ఇళ్ళల్లో పనిచేయడం మానుకుంది గాని, వదిన తనను చిన్న చూపు చూస్తూ వుండడంవలన బాధ పడతావుంటుంది . ఐ.టి.ఐ. పూర్తి చేసిన తను ఇంటిపట్టున పని లేకుండా ఉండడం వదినకు నచ్చుడం లేదు. ఓపిక నశించినపుడు కూర్చొని తింటే కొండలైనా కరుగుతాయని సూటిపోటి మాటలంటూ ఉంటుంది. వదిన

వాళ్ళ అన్నయ్య సాఫ్ట్ వేర్ ఇంజనీరుగా అమెరికాలో ఉంటాడు. వాడిని చూసి నేర్చుకోమంటుంది నన్ను. అమ్మ నన్ను కావాలనే సమర్థించదు. వదినను వెనకేసు కొచ్చినట్లు మాట్లాడుతుంది. దానికి కారణం లేకపోలేదు. వదినను వెనకేసుకు రావటం వలన, వదినకు నా మీద వున్న ద్వేషాన్ని తగ్గించవచ్చు అనేది అమ్మ భావన. వదిన వాళ్ళు కొంత ఉన్న వాళ్ళు కావడం, వారి అన్నయ్య అమెరికాలో ఉండడం వలన అన్నయ్య తన న్యూనతా భావం వలన ఏమీ మాట్లాడడు. తను మూడు సంవత్సరాలుగా ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నా ఏదీ రావడం లేదు. తన వలన అమ్మ, అన్నయ్యలు నలిగి పోవడం తనకు ఇష్టం లేదు. అందుకోసమే ఈ ఆత్మహత్య నిర్ణయం. తను ఇపుడు నిమిషాలు లెక్కిస్తున్నాడు. మరికొన్ని నిమిషాల్లో తను ఈ ప్రపంచంలో ఉండడు. మరణాంతర జీవితం ఎలా ఉంటుందో! తన ఆత్మ ఎక్కడకు వెళుతుందో! నిజంగా ఆత్మ ఉంటే తన శవం దగ్గర అమ్మ పడే బాధను తన ఆత్మ చూడగలదా? ఆత్మకూ బాధలు ఉంటాయా? ఇలా ఆలోచించుకుంటూ రైలు పట్టాల పక్కగా అటు ఇటూ తిరుగుతూ గంగాధర్ ఆలోచిస్తూ ఉన్నాడు.

ఇంతలో ఎవరో పిలిచినట్లు అనిపించింది. భ్రమ అనుకొన్నాడు. కాదు నిజంగానే పిలుస్తున్నారు. ఎవరో ఒకతను చెట్టు క్రింద కొంత దూరంలో కూర్చొని ఉన్నాడు. తననే పిలుస్తున్నాడు.

"బాస్! ఇలా రండి ఒక నిమిషం! ట్రైను రావడానికి ఇంకా ఇరవై నిమిషాల టైం ఉంది. అంత సేపు ఎండలో ఎందుకు నిల్చుంటారు. రండి బాస్!" అని తననే పిలుస్తున్నాడు.

ఏంటి ఈ న్యూసెన్స్ అనుకున్నాడు గంగాధర్. ఎవ్వరూ లేని చోట మరణిద్దామని వస్తే వీడిదేంది సోది అనుకున్నాడు. అతను చెట్టు క్రింద కూర్చొని తనను విడువకుండా పిలుస్తూనే ఉన్నాడు.

"ఇంకా ఇరవై నిమిషాలు పడుతుంది. ట్రైన్ రావడానికి" అంటున్నాడు.

"ఇరవై నిమిషాలు వీడిని భరించేది ఎట్లా? వెళ్లక పోతే వచ్చి ఇగ్గుక పోయేట్లున్నాడు. అయినా నేను ట్రైన్ కోసం వచ్చానని వీడికెట్లా తెలుసు" అని గంగాధర్ మనసులో అనుకొంటూ వున్నాడు. గంగాధర్‌లో అసహనం పెరిగిపోతా వుంది. అట్లని అతని మాటలను వినకుండా వుండ లేక పోతున్నాడు. సుఖంగా కూడా చావనివ్వరు దరిద్రులు అనుకుంటూ అతని వైపు నడిచాడు.

"రండి బాస్! కూర్చోండి. ఆత్మహత్యకు ప్లాన్ చేసుకొన్నారా ఏమిటి ?" అని అడిగాడు.

గంగాధర్ ఏమీ మాట్లాడలేదు.

" ట్రైన్ ఇరవై నిమిషాలు లేట్ బాస్! . అందాక ఎండలో ఎందుకు నిల్చుంటారని నేనే పిలిచాను. మరణించే ముందు కాస్త ప్రశాంతంగా, సుఖంగా ఉండి ఆందోళనలు లేకుండా గడిపి తరువాత మరణించండి. ట్రైన్ ఒక ఫర్లాంగు దూరంగా వస్తున్నపుడే ఇక్కడికి కనిపిస్తుంది. కాబట్టి మిస్ కాకుండా పడిపోవచ్చు. డెత్ ఎండ్స్ అల్ సఫరింగ్స్ ! ప్లీజ్ కం అండ్ బి సీటెడ్ " అన్నాడు.

వీడేందిరా నాయనా! నా ఆత్మహత్య ప్రయత్నాన్ని పసికట్టడమే కాకుండా ప్రోత్సహిస్తున్నాడు. అసలు వీడు మనిషేనా అనుకుంటూ చెట్టు నీడకు వెళ్ళాడు గంగాధర్.

"బాస్! ఈ మిరపకాయ బజ్జీలు తినండి. వేడివేడిగా ఉన్నాయి. ఉల్లిపాయ, మసాల కారం ఉంది. చాలా రుచిగా ఉన్నాయి. కానీయ్" అంటూ ఒక బజ్జీపై నిమ్మ కాయ పిండి మసాలా కారం చల్లి, ఉల్లిపాయ ముక్కలు దానిపై ఉంచి బలవంతంగా గంగాధర్ కు ఇచ్చాడు. వీడి మాట వినడం తప్ప వేరే మార్గం లేదనిపించింది గంగాధర్‌కు . గంగాధర్ అప్రయత్నంగా తీసుకొని తిన్నాడు. కారం అనిపించింది. వాటర్ బాటల్ మూత తీసి తాగమని గంగాధర్ కు ఇచ్చాడు. నీళ్ళు తాగేలోపు రెండవ బజ్జీ రెడీ చేశాడు. గంగాధర్ కు ఏమి చేయాలో అర్థం కావడం లేదు. రెండవ బజ్జీ కూడా తిన్నాడు.

"బాస్! నా పేరు సుబ్రహ్మణ్యం. మరి మీరు?" అంటూ ప్రశ్నించాడు.

గంగాధర్ మాట్లాడ లేదు.

"ఆత్మహత్య ఏర్పాట్లు అన్నీ చక్కగా చేసుకున్నారా ? ఐ మీన్ సూసైడ్ నోట్ రాయడం అన్నీ చేశారు కదా!" అని అడిగాడు.

"అవును" అని తలవంచుకొని గంగాధర్ సమాధానం ఇచ్చాడు.

"చూడు బాస్! నీవు నాకు పేరు చెప్పలేదు. ఇపుడు నీవు నాకు సంబంధించిన రెండు బజ్జీలు తిన్నావు. అంటే నాకు నీవు రెండు బజ్జీలు ఋణపడి ఉన్నావు. ఋణం తీర్చుకోకుండా మరణిస్తే నీ ఆత్మ వెంటనే పరలోకానికి పోదు. అంతేగాక నీవు ఋణవిముక్తుడవు కాకుండా వెళ్లిపోతే నీ

ఆత్మీయులకు సుఖం ఉండదు. అందుచేత నీ ఆత్మహత్య ప్రయత్నాన్ని రేపటికి వాయిదా వేసుకొని నా ఋణం తీర్చి తదుపరి నీవు హ్యాపీగా ఈ లోకం నుంచి వెళ్ళిపోవచ్చు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

గంగాధర్ అతను చెప్పిన మాటలలో 'నీ ఆత్మీయులకు సుఖం ఉండదు' అనే మాట కలవర పరచింది. అంటే తన మరణాంతరం కూడా అమ్మ కష్టపడుతుందా! అమ్మ సుఖం కోసమే కదా తను ప్రాణాలు తీసుకోవాలను కొన్నది. మరి అమ్మకు సుఖం లేకపోతే తన మరణం వ ృథా అవుతుంది అని కలవర పడుతున్నాడు.

"బాస్! అసలెందుకు నీవు చావాలను కుంటున్నావు! నాకు నీవు సమాధానం చెప్పాల్సిందే. ఎందుకంటే నీవు నాకు ప్రస్తుతం ఋణపడి ఉన్నావు కాబట్టి" అని అతను గంగాధర్ ను ప్రశ్నించాడు.

గంగాధర్ తను ఐ టి ఐ ఎలక్ట్రికల్ చేశాననీ, మూడు సంవత్సరాలుగా ఉద్యోగం లేదనీ, అమ్మ తన వలన అన్న వదినల మధ్య నలిగిపోతున్నదనీ అందువల్లనే ఈ నిర్ణయం తీసుకున్నానని చెప్పుకొచ్చాడు గంగాధర్.

"బాస్! అందుకే రేపు ఇదే సమయానికి ఇక్కడికి రా! నీవు నా ఋణం తీర్చుకొనే మార్గం చెబుతాను. నామీద నమ్మకం ఉంచు. నీ ఆత్మహత్యకు నాదీ పూచీ! " అంటూ చెప్పి విసవిసా వెళ్ళిపోయాడు సుబ్రహ్మణ్యం.

"వీడేంటి నా మనసులో అల్లకల్లోలం స ృష్టించి తన దారిన తను వెళ్ళిపోయాడు. ఇప్పుడేం చేయాలి. ఓరీ భగవంతుడా! అనవసరంగా వీడి రుణంలో ఇరుక్కు పోయానే!" అని కల్లోలిత ఆలోచనలతో గంగాధర్ ఉక్కిరి బిక్కిరి అవుతూ వుండగా ట్రైన్ వస్తోంది. గంగాధర్ సాహసం చేయలేక పోయాడు. అమ్మనే గుర్తు కోస్తోంది. ట్రైన్ వెళ్ళిపోయింది. గంగాధర్ ఒక్క రోజు ఆగలేనా ? అనుకుంటూ బాధగా ఇంటి వైపు బయలు దేరాడు.

మరుసటి రోజు గంగాధర్ ముందుగానే సుబ్రహ్మణ్యంను కలిసిన ప్రదేశానికి వెళ్ళాడు. సుబ్రమణ్య కోసం ఎదురు చూస్తూ ఉన్నాడు. అసలు అతను వస్తాడా? అనవసరంగా వీడి ఉచ్చులో పడిపోయానే అనుకుంటూ ఉండగా సుబ్రహ్మణ్యం వచ్చాడు.

"బాస్! రెండు నిమిషాలు ఆలస్యం అయ్యింది క్షమించు" అంటూ వచ్చి కూర్చున్నాడు సుబ్రహ్మణ్యం.

"చూడు బాస్! నీపేరేమన్నావ్!" అంటూ ఒక క్షణం ఆగాడు.

గంగాధర్ అప్రయత్నంగా "గంగాధర్" అని చెప్పాడు.

"చూడు గంగాధర్! ఈ రోజు నీవు నా ఋణం తీర్చుకొనే మార్గం చెబుతానన్నాను. ఇదిగో ఇది తీసుకో" అంటూ ఒక కవర్ ను గంగాధర్ చేతిలో పెట్టాడు. దానిపై "అప్లికేషన్ ఫర్ ది పోస్ట్ అఫ్ ఎలక్ట్రిషియన్ ఇన్ ఇండియన్ రైల్వేస్ " అని వుంది.

"దీనిని పూరించి ఫోటో అతికించి సాయంత్రానికంతా తెస్తావా? ఇది పూర్తి చేసి ఇస్తే చాలు నీ దారిన నీవు వెళ్ళొచ్చు" అన్నాడు సుబ్రహ్మణ్యం గంగాధర్ తో!

గంగాధర్ కు అర్థం కావడం లేదు. సుబ్రహ్మణ్యం ఈ రోజు కూడా తన ప్రయత్నాన్ని వాయిదా వేయించేట్లే ఉంది. అయినా ఇతడి మాటల్లో ఏదో ఆకర్షణ ఉంది. తనకు తెలియకుండానే తానూ కన్విన్స్అయి అతడి మాటలకు తలాడి స్తున్నాను అని మనసులో అనుకొంటూ ఉన్నాడు గంగాధర్.

"ఓకే గంగాధర్ సాయంత్రం నాలుగు గంటలకు తప్పకుండా రా! నాలుగున్నరకు ట్రైన్ ఉంది. మిస్ కావద్దు" అంటూ సుబ్రహ్మణ్యం వెళ్లి పోయాడు.

గంగాధర్ అప్లికేషన్ తీసుకొని ఇంటికి వెళ్లి పూరించి తన ఫోటో అతికించి , అందులో పేర్కొన్న సర్టిఫికెట్లు జత పరచి అన్నీ కవర్లో ఉంచి నాలుగు గంటలకు మరలా అక్కడే సుబ్రహ్మణ్యం కోసం ఎదురు చూస్తూ ఉన్నాడు. సుబ్రహ్మణ్యం ఆలోచనలను గంగాధర్ అందుకోలేక పోతున్నాడు. అప్రయత్నంగా అతడు చేయమన్నపని చేస్తూ వున్నాడు. ఋణ విముక్తుడు కావాలనే కాంక్ష బలంగా ఉండడం కావచ్చు, కాని చేస్తున్న పనులు తన ప్రయత్నాన్ని వాయిదా వేయించేవిగా కన్పిస్తున్నాయి. ఇలా అనుకొంటూ ఉండగా సుబ్రహ్మణ్యం వచ్చాడు. చేతిలో పోస్టల్ ఆర్డర్స్ ఉన్నాయి. గంగాధర్ పూరించిన అప్లికేషన్కు వాటిని జోడించి అన్నింటినీ కవర్లో ఉంచి ఈ రోజు తనకు టైం లేదని రేపు ఉదయం పదకొండు గంటలకు రమ్మని గంగాధర్ సమాధానం కోసం ఎదురు చూడకుండా కవర్ తీసుకొని ఆత్రుతగా అక్కడి నుండి వెళ్లి పోయాడు.

మరుసటి రోజు పదకొండు గంటలకు గంగాధర్ వచ్చాడు. అప్పటికే సుబ్రహ్మణ్యం వచ్చి ఉన్నాడు. అతడి చేతిలో పుస్తకాలున్నాయి. వాటిని గంగాధర్ కు అందిస్తూ " చూడు గంగాధర్ నలభైఐదు రోజులలో పరీక్ష ఉంది. ఇవి దానికి సంబంధించిన పుస్తకాలు. మనం రోజూ మూడుగంటలపాటు

పాటు ఇక్కడ కలుద్దాం. నాకు తెలిసిన కొన్ని విషయాలు నీకు చెబుతాను. పరీక్ష రాసిన పదిహేను రోజుల్లో ఫలితాలు వస్తాయి. అప్పటి వరకు నీ ప్రయత్నాన్ని వాయిదా వేయి. ఋణ పడిన వాడిగా నీకు నామాట వినడం తప్ప వేరే మార్గం లేదు" అన్నాడు.

గంగాధర్‌కు అర్థం అవుతూ ఉంది. ఈ సుబ్రహ్మణ్యం తన జీవితానికి ఒక దిశను నిర్దేశిస్తున్నాడు. తన ఆత్మహత్య ప్రయత్నాన్ని ఆపాలని అనుకొంటున్నాడు. తన జీవితాన్ని నిలపాలని తాపత్రయ పడుతున్నాడు. అందుకు తన బలహీనతను గుర్తించి దాన్ని దెబ్బకొట్టి అనుకున్నది సాధించు కోవాలను కొంటున్నాడు అనిపించింది గంగాధర్‌కు.

పరధ్యానంగా ఉన్న గంగాధర్‌తో "గంగాధర్! రేపటి నుండి మన ప్రయత్నం ప్రారంభం. రేపు మంచి రోజు వస్తా" అంటూ వెళ్ళిపోయాడు సుబ్రహ్మణ్యం.

ఇంటి కెళ్ళిన గంగాధర్‌కు సుబ్రహ్మణ్యం గుర్తుకు వస్తున్నాడు. ఇంతకీ ఎవరీ సుబ్రహ్మణ్యం? మాటల తీరుని బట్టి చూస్తె బాగా చదువుకొనిన వానిలా వున్నాడు. చక్కటి ఇంగ్లీషు మాట్లాడతాడు మనిషి ఆలోచనలు చదువుతాడు. అసలు అతనెందుకు తన ఆత్మహత్య ప్రయత్నాన్ని ఆపాలి? తన జీవితాన్ని నిలబెట్టాలనే తపన అతనికెందుకు? రక్తం పంచుకొని పుట్టిన అన్న తన భవిష్యత్ పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుంటే ఈ సుబ్రహ్మణ్యం తన యెడల ఎందుకు ఇంతలా ఆలోచిస్తున్నాడు ? అని గంగాధర్ ఆలోచిస్తున్నాడు.

మరుసటి రోజు గంగాధర్, సుబ్రహ్మణ్యంలు చెట్టు క్రింద కూర్చొని వున్నారు. గురువు స్థానంలో సుబ్రహ్మణ్యం, శిష్యుని స్థానంలో గంగాధర్. ఇంగ్లీషు, అర్థమెటిక్, టెస్ట్ ఆఫ్ రీజనింగ్ చక్కగా అర్థమయ్యే విధంగా, షార్ట్ కట్స్ రూపంలో తన స్థాయికి తగినట్లుగా బోధిస్తున్నాడు. గంగాధర్ తన జీవితంలో ఏ ఉపాధ్యాయుడు ఇంత ఓపికగా, అర్థం అయ్యే విధంగా తనకు బోధించలేదు అనుకొన్నాడు. వారి గురుశిష్య బోధన నలభై రోజులపాటు సాగింది. దాదాపు పుస్తకాలలోని సిలబస్ అంతా పూర్తి అయ్యింది.

నలభై ఒకటవ రోజున సుబ్రహ్మణ్యం "గంగాధర్! ఇక నాలుగు రోజులే పరీక్షకు సమయం. రేపటినుండి ఇంటి పట్టుననే రివిజన్ చేస్కో. ఒక రోజు ముందే హైదరాబాదు బయలు దేరివెళ్ళు. పరీక్ష కేంద్రానికి దగ్గరలోని లాడ్జిలో రూమ్ అద్దెకు తీసుకొని సమయానికి వెళ్లి చక్కగా వ్రాయి. ఇదిగో ఖర్చులకు మూడు వేలు తీసుకో" అంటూ మూడువేల రూపాయలు గంగాధర్ చేతిలో పెట్టాడు.

గంగాధర్ కళ్ళ నిండా నీళ్ళే. సుబ్రహ్మణ్యం పాదాలపై పడ్డాడు. గంగాధర్ కన్నీటితో సుబ్రహ్మణ్యం పాదాలు తడిసి పోతున్నాయి. సుబ్రహ్మణ్యం గంగాధర్ బుజాలు పట్టుకొని పైకెత్తుతూ " పిచ్చివాడా! ఏడుపు ఎందుకు? నీ ఏడుపు నా ఋణం తీర్చదు. నీవు ఋణం తీర్చుకొనే రోజు వస్తుంది. ఆ శక్తి నీకు తప్పకుండా వస్తుంది అంటూ" భుజం తట్టి వెళ్ళమన్నాడు సుబ్రహ్మణ్యం.

గంగాధర్ హైదరాబాద్‌లో పరీక్ష వ్రాశాడు. మూడురోజుల తరువాత సుబ్రహ్మణ్యం కోసం వారు తరచూ కలిసే ప్రదేశానికి వెళ్ళాడు గంగాధర్ . ఆ రోజు సుబ్రహ్మణ్యం రాలేదు. పదిహేను రోజులుగా వెళుతూనే వున్నాడు. తను పరీక్ష బాగా వ్రాశానని ఉద్యోగం తప్పక వస్తుందని, రాక పోయినా తాను ఆత్మహత్య చేసుకోనని పోరాడి సాధించు కుంటానని సుబ్రహ్మణ్యంకు చెప్పాలని గంగాధర్ రోజూ సుబ్రహ్మణ్యం కోసం వెతుకుతూనే ఉన్నాడు. ఊర్లో ఎక్కడ తిరుగుతూ వున్నా కళ్ళు సుబ్రహ్మణ్యంనే వెతుకుతున్నాయి. కాని సుబ్రహ్మణ్యం కన్పించడం లేదు.

పరీక్షా వ్రాసిన ఇరవై రోజుల తరువాత గంగాధర్ కు రిజిష్టర్ పోస్ట్ వచ్చింది. రైల్వేలో ఎలక్ట్రీషియన్ గా నియామకపు పత్రం అందులో వుంది. గంగాధర్ ఆనందానికి అవధులు లేవు. అమ్మ పాదాలకు నమస్కరించాడు. నియామక పత్రం తీసుకొని సుబ్రహ్మణ్యం కొరకు తాము తరచుగా కలిసే ప్రదేశానికి పరుగున వెళ్ళాడు. ఎంతసేపు చూసినా సుబ్రహ్మణ్యం రాలేదు. అన్నం, నీళ్ళు లేకుండా సాయంత్రం వరకు ఎదురు చూశాడు. అతడి జాడనే లేదు. అన్ని రోజులు కలిసి వున్నా సుబ్రహ్మణ్యం సార్ వివరాలు అడగక పోవడం తన తప్పనిపించింది గంగాధర్‌కు. నిరాశగా ఇంటికి వచ్చేశాడు. గుంతకల్ డివిజన్ లో పోస్టింగ్. జాయినయి పోయాడు. నివాసానికి క్వార్టర్స్ ఇచ్చారు. అమ్మ తన దగ్గర ఉండడమే మేలని తన దగ్గరకు తెచ్చుకున్నాడు. ఉద్యోగం వచ్చిన తరువాత వదిన కూడా తనను కొంత గౌరవంగా చూడడాన్ని గమనించాడు గంగాధర్.

గంగాధర్ అమ్మ అతడికి పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించింది. అన్న, వదినలు కూడా గంగాధర్ అభిప్రాయం అడిగారు. అమ్మ, అన్న, వదినల నిర్ణయమే తన నిర్ణయమన్నాడు. పెద్దతుంబళం నుండి ఒక సంబంధం వచ్చింది. అమ్మాయి పది వరకు చదువుకుంది. చక్కని

రూపవతి. తల్లి దండ్రులు లేరు. అన్న దగ్గర ఉంటుంది. అమ్మాయి వదిన అంగన్ వాడి టీచరు. అమ్మాయి అన్న కిరాణం దుకాణం నిర్వహిస్తుంటాడు. అమ్మాయి వదిన గయ్యాళి అట. ఆ అమ్మాయిని వేపుకు తింటూ ఉంటుందట. కాని ఆ అమ్మాయి తన వదిన గురించి ఏ ఒక్కరికి తనను బాధ పెడుతున్నట్లుగా చెప్పు కోలేదట. ఆమ్మయికి భూమాతకున్నంత ఓర్పుందని అమ్మతో చెప్పారట. అటువంటి అమ్మాయే కావలసింది గంగాధర్ కు అనుకొంది గంగాధర్ వాళ్ళ అమ్మ. అమ్మ, గంగాధర్, అన్న వదినలు నలుగురూ పెళ్లి చూపులకని పెద్ద తుంబళం వెళ్ళారు. అన్నట్టుగానే అమ్మాయి చాలా బావుంది. అమ్మాయి వదిన నిజంగా గయ్యాళే అన్పించింది గంగాధర్ కు. తాము కానీ కట్నం ఇవ్వమనీ, పెళ్లి కూడా మీరే చేసుకోవాలని అలా అయితేనే తమకు సమ్మతమని అమ్మాయి వదిన తెగేసి చెప్పింది. గంగాధర్ వాళ్ళు అన్ని షరతులకు తల ఒగ్గారు. పెళ్లి తేదీ నిశ్చయం అయ్యింది. అమ్మాయి అన్నయ్య గంగాధర్ వాళ్ళను బస్సు ఎక్కించడానికి బస్ స్టాండ్ కు వచ్చి వారితో రహస్యంగా తన భార్య మాటలు లెక్క పెట్టవద్దని, తన చెల్లి ఉత్తమురాలని, తన భార్యకు తెలియకుండా చెల్లి పేరున లక్ష రూపాయలు దాచానని, వాళ్ళ అమ్మకు చెందిన ఆరు తులాల బంగారు వుందని రేపు శని వారం ఆదోనికు సరుకుల కొరకు వచ్చినపుడు ఆ లక్షరూపాయలు, బంగారం అందజేస్తానని .. ఈ విషయం ఎవరి చేవినా వేయ వద్దని వేడుకొన్నాడు. పెళ్లి ఖర్చు ఎలా అని ఆలోచిస్తూ ఉండిన గంగాధర్ వదిన వెంటనే అందుకు ఒప్పుకొంది.. ఎట్టకేలకు గంగాధర్ వివాహం అయ్యింది. అమ్మాయి పేరు శకుంతల. గంగాధర్ శకుంతలలు గుంతకల్లులో రైల్వే క్వార్టర్స్‌లో కాపురం ప్రారంభించారు. గంగాధర్ అమ్మ అతడితోనే వుంది. శకుంతల అత్తగారిని అపురూపంగా చూసుకొంటోంది.

గంగాధర్ తన జీవిత గమనం గురించి శకుంతలకు అంతా చెప్పాడు. తన జీవితాన్ని తీర్చిదిద్దిన సుబ్రహ్మణ్యం సార్ గురించి, అతను కనిపించకుండా వుండడం వలన తనకు కలుగుతున్న బాధ గురించి శకుంతలతో పంచు కున్నాడు . వివాహం అయిన రెండవ సంవత్సరమున శకుంతల గుంతకల్ రైల్వే హాస్పటల్ లో కొడుకు జన్మను ఇచ్చింది .

గంగాధర్ శకుంతల తో " కొడుకు పేరు గురించి నీకు ఏమైనా అభిప్రాయాలున్నాయా?" అని అడిగాడు. "ఉన్నాయి" అంది శకుంతల.

"ఏం పేరను కుంటున్నావు?" అని ఆత్రుతతో అడిగాడు గంగాధర్.

"సుబ్రహ్మణ్యం" అని చెప్పింది శకుంతల. గంగాధర్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. శకుంతల చేతిని తీసుకొని హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు. "శకుంతలా! నీవు నా బంగారు కొండవు! ఇంత మంచి మనసున్న దానిని భార్యగా పొందడం నా అదృష్టం" అంటూ ఉద్వేగానికి గురి అయ్యాడు.

కాలం గడిచిపోతా వుంది. కొడుకు సుబ్రహ్మణ్యంలో గురువు సుబ్రమణ్యాన్ని చూసుకుంటూ గంగాధర్ తృప్తి పడుతున్నాడు. తన కుటుంబాన్ని , అన్న కుటుంబాన్ని రైల్వే పాసు మీద సంవత్సరానికి వొకసారి విహార యాత్రలకు తీసుకెళ్తున్నాడు గంగాధర్. ఎక్కడపోయినా అపుడపుడూ గంగాధర్ కళ్ళు సుబ్రహ్మణ్యం గురించి వెతుకుతూనే వున్నాయి. కాలం సాగుతూనే ఉంది. అన్న కూతురు వివాహ సంబంద విషయమై గంగాధర్, శకుంతలలు ఆదోని వచ్చారు. రెండు రోజులుండి అన్ని విషయాలు మాట్లాడుకున్నారు. తనకు ఆడపిల్ల లేదు కాబట్టి అన్న కూతురే తన కూతురని, అమ్మాయి పెళ్లి ఖర్చుల విషయంలో సగం బాధ్యత తనదే అని గంగాధర్ చెప్పాడు. గంగాధర్ వదినకు తనముందు గంగాధర్ ఆకాశమంత ఎత్తుకు ఎదిగినట్లుగా అనిపించింది. ఎందుకంటే అమెరికాలో వున్న తన అన్న తన కూతురి పెళ్లి విషయం గురించి ప్రస్తావిస్తే డబ్బు గురించి మాట దాటవేస్తూ పెళ్ళికి రావడానికి కుదరకపోవచ్చు అని, రావడానికి బోలెడు డబ్బు ఖర్చు అవుతుందని చెప్పడం గుర్తుకు వచ్చింది. పెళ్ళికి రెండు వారాల ముందే అమ్మను శకుంతలను ఆదోనికి పంపుతానని, పెళ్లి పనుల గురించి ఆందోళన పడవద్దని అన్నకు చెప్పి గంగాధర్ శకుంతలతో గుంతకల్ బయలుదేరాడు. దాని కారణంగా వారు ఇప్పుడు ఆదోని రైల్వే స్టేషన్ లో వున్నారు

గంగాధర్ ఇలా ఆలోచనలలో వుండగా అంతలో స్టేషన్లో ఏదో అలజడి మొదలైంది....

స్టేషన్లో ఒక పిచ్చివాడు షాపుల దగ్గరకు వెళ్లి తినడానికి ఏదైనా ఇవ్వమని అడుగుతూ వున్నాడు. ప్రతి షాపువాడు కర్రతో అతడిని బెదిరిస్తూ వెళ్లి పొమ్మంటున్నారు. అప్రయత్నంగా గంగాధర్ దృష్టి అటు వైపు మళ్ళింది. పాపం అనుకొంటూ అతడిని పరిశీలనగా చూశాడు. ఎక్కడో అతడిని చూసినట్లు అనిపించింది. ఎస్! ఆతను సుబ్రహ్మణ్యం.

"శకుంతలా! అదుగో సుబ్రహ్మణ్యం సార్ ! " అంటూ అటువైపు పరిగెత్తాడు .

శకుంతల గంగాధర్ ను అనుసరించింది.

పిచ్చివాడి దగ్గరకు వెళ్ళిన గంగాధర్ అతడిని పరిశీలనగా

చూసి "శకుంతలా ! ఇతను సుబ్రహ్మణ్యం సారే! అయ్యో ! ఎందుకు సార్ ఇలా అయిపోయారు " అంటూ అతడి చేతులను తన చేతుల్లోకి తీసుకొంటూ " సుబ్రహ్మణ్యం సార్? ఏమిటిది? ఎందుకిలా అయ్యారు?" అని ప్రశ్నించ సాగాడు గంగాధర్ ఆందోళనగా .

స్టేషన్లో అందరూ గంగాధర్ ను ఆసక్తిగా గమనిస్తున్నారు. శకుంతల లగేజితో వారి దగ్గరకు వచ్చింది. "శకుంతలా ! బయటకు వెళ్లి ఆటో మాట్లాడు. అన్న ఇంటికి సుబ్రహ్మణ్యం సార్ ను తీసుకెళదాం" అన్నాడు.

శకుంతల స్టేషన్ బయటకు వెళ్లి ఆటో మాట్లాడి లోపలకు వచ్చింది . సుబ్రహ్మణ్యం పిచ్చి చూపులు చూస్తున్నాడు. ఏమి మాట్లాడడం లేదు.

గంగాధర్ " రెండు బన్నులు, టీ తీసుకురా శకుంతలా!" అన్నాడు.

తను తీసుకు రావడానికి వెళితే సుబ్రహ్మణ్యం సార్ ఎటు వెళ్లి పోతాడేమోననే భయంతో గంగాధర్ అతడి చేతులను గట్టిగ పట్టుకొని నిల్చున్నాడు. శకుంతల టీ , బన్ను తెచ్చింది. సుబ్రహ్మణ్యం గబగబా బన్నులు తిని టీ తాగాడు. చొక్కా ప్యాంటు పిడచ కట్టుకు పోయున్నాయి. తల జుట్టు, గడ్డం జుట్టు ఉండలు గట్టి ఉన్నాయి. మల మూత్రాలు శుభ్రం చేసుకోక పోవటం వలన దుర్వాసన వస్తూ వుంది. ఈగలన్నీ చుట్టూ ముసురుతూ ఉన్నాయి. సుబ్రహ్మణ్యం ను ఆటోలో ఎక్కించుకొని గంగాధర్ శకుంతల తో పాటు తన అన్న ఇంటికి తిరిగి వెళ్ళారు. అన్న వదినలకు ఇంత వరకు సుబ్రమణ్యం గురించి చెప్పలేదు. ఆ అవసరం రాలేదు. ఇప్పుడొచ్చింది ఆ అవసరం . సుబ్రహ్మణ్యం గురించి వివరంగా చెప్పి సుబ్రహ్మణ్యంకు స్నానం చేయించడానికి సహకరించమని గంగాధర్ తన అన్నను కోరాడు. గంగాధర్ వదిన తమది కూడా బాధ్యతే గదా అంటూ ముందు కొచ్చింది. గంగాధర్ అన్న బయటకు వెళ్లి బార్బర్ ను పిలుచుకొచ్చాడు. వదిన స్నానానికి నీరు సిద్ధం చేస్తా వుంది. సుబ్రమణ్యం ను బయట కుర్చీ లో కూర్చోబెట్టి తల జుట్టు, గడ్డం గీయించారు. వదిన షాంపూ, సబ్బు, రెండు బకెట్ల లో వేడి నీళ్ళు తెచ్చి పెట్టింది. గంగాధర్, అన్నయ్యలు కలిసి శుభ్రంగా సుబ్రహ్మణ్యం కు స్నానం చేయించారు. అతడికి గంగాధర్ అన్న నైట్ ప్యాంటు, టీ షర్ట్ వేయించాడు. ఇపుడు సుబ్రహ్మణ్యం ను చూస్తె పిచ్చివాడని ఎవరూ అనుకోరు. సుబ్రహ్మణ్యం కూడా మౌనంగా ఉంటున్నాడు. వారి చర్యలను ప్రతిఘటించడం లేదు. లోపలకు తీసుకెళ్ళి భోజనం పెట్టారు. శకుంతల శ్రద్ధగా అన్నం కలిపి సుబ్రహ్మణ్యం సర్ కు తినిపించింది.

తను వుంటున్న గుంతకల్ లోనే ఆంగ్లో ఇండియన్స్ వీధులలో సంచరించే మానసిక రోగులకు ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నట్లు గంగాధర్ కు తెలుసు. తన కొడుకు పుట్టిన రోజున ఒకసారి శకుంతల, అమ్మ, బాబులతో వెళ్లి వాళ్లకు పళ్ళు, పాలు పంచి వచ్చివున్నారు. శకుంతల కూడా అదే విషయాన్ని గుర్తు చేసింది. శకుంతల గంగాధర్ తో మనం సాయంత్రం బయలు దేరుదామని సుబ్రహ్మణ్యం సారును తాత్కాలికంగా అక్కడ చేర్పిద్దామని ప్రతి పాదించింది. గంగాధర్ శకుంతలలు సుబ్రహ్మణ్యంను జాగ్రత్తగా కారు అద్దెకు మాట్లాడుకొని కారులో గుంతకల్లుకు తీసుకు వచ్చారు. సుబ్రహ్మణ్యం ఏమి మాట్లాడడం లేదు. గంగాధర్ సుబ్రహ్మణ్యం వ్యక్తిగత వివరాలు ఆ రోజులలో తెలుసుకోలేక పోయినందుకు చాలా బాధ పడ్డాడు. మానసిక రోగుల ఆశ్రమాన్ని చేరుకున్నారు. క్రైస్తవ మిషనరీ నడుపుతున్న స్వచ్ఛంద సంస్థ అది. అన్ని ఫార్మాలిటీస్ పూర్తి చేశారు. ఆశ్రమ నిర్వాహకులు ప్రతి నెల మానసిక వైద్యులు తమ ఆశ్రమాన్ని సందర్శిస్తారని, అవసరమైన వారికి చికిత్స కూడా చేయిస్తామని చెప్పారు. సుబ్రమణ్యం ను ఆశ్రమ నిర్వాహకులకు అప్పచెప్పి వారికి సుబ్రమణ్యం గురించి అనేక జాగ్రత్తలు చెప్పి ఇంటికొచ్చారు.

ఇంటికి వచ్చేసరికి అమ్మ వంట చేసి వీరి కోసమే ఎదురు చూస్తున్నది. మనవడు తినేసి పడుకొన్నట్లుగా చెప్పింది గంగాధర్ తల్లి. గంగాధర్, శకుంతలలు భోజన చేసి వంటిల్లు సర్దేసి నిద్రకు ఉపక్రమించారు. గంగాధర్ శకుంతల తో "శకుంతలా! సుబ్రమణ్యం కు ఎందుకీ గతి పట్టింది? అసలు సార్ ఎవరు? ఎక్కడి నుండి వచ్చారు? ఇంత కాలం ఎక్కడ వున్నారు? సారుకు నా అన్న వాళ్ళెవరూ లేరా? " అని కళ్ళనీళ్ళ పర్యంతం అవుతున్నాడు. కన్నీరు గంగాధర్ కణతలపైకి జారాయి.

శకుంతల గంగాధర్‌ను దగ్గరకు తీసుకుంటూ "ఊరకుండండీ ! సుబ్రహ్మణ్యం గారు ఈస్థితికి రావడానికి కారణాలు మనకు ఎట్లా తెలుస్తాయి? ఆ కారణాలు మనకు అనవసరము కదా! సార్‌కు నా అన్న వాళ్ళు ఎందుకు లేరు ? సుబ్రహ్మణ్యం సారు నాకు నాన్న!" అనింది. గంగాధర్ శకుంతల నుదుటిపై ముద్దు పెట్టుకున్నాడు ప్రేమగా ! ◆

## పరిరక్షణ

- రానాశ్రీ



జీవులకాధారం, జీవనాధారం
ప్రాణవాయుకు పుట్టినిల్లు,మానవాళికి కూడా
మనుగడనిచ్చిన ప్రకృతి రమణీయం!

కర్మాగార కాగడాల ఆగడాలు
విస్తరిస్తున్న రవాణా రహదార్ల తారురోడ్డులు
చినుకు చుక్కలను చీదరించే సిమెంటు దారులు
కణకణమని కరవాలము తలపించే
కాంక్రీటు కమ్మీల కట్టడాలు
వృక్షజాతిని ఉరితాళ్ళు బిగిస్తూ
మానవాళి నశించుటకు నిత్యహెూమాన్ని చేస్తున్నాయి!

రక్షణ కవచాన్ని నాశనంచేస్తూ
భక్షకులై, భావిజీవన శిక్షకులై
స్వార్థపు సంపాదనలో మహెూన్నతులై
పచ్చని వృక్షవాటికలను రంపం నోటికి చిక్కించి
భుగోళ వైరితలలకు కారకులౌతున్నారు
అగ్నిచినుకుల రాలంగ ప్రయత్నిస్తున్నారు!

నీడనిచ్చే చెట్టేలేకుంటే మానవజాడేది
నల్లమబ్బుల నీటిజాడలకు ఆ చెట్టేది!
వేడిగాలుల ఉపద్రవం రానేవచ్చింది
మాఘమాసపు చల్లని తెరలు మాడిపోయాయి
వసంతృతువును త్రొక్కిపట్టి గ్రీష్మం ఛీంకరిస్తుంది!

ప్రమాదపుటంచున పల్లెసీమలు
నగరనరకము వేరేచెప్పాల? భగభగ మండే భూమండలం
మృత్యుఘోష వినిపించాల?
జీవులపాలికి మానవాళి నిత్యకృత్యమాపాలి
పర్యావరణ రక్షణ తథ్యమని
ప్రతి పౌరుడూ ప్రతిన పూనాలి! ◆

---

## జీవితమంటే!!

- సింగారపు రాజయ్య
9945744332



జీవితమంటే కాలంతో పోటీపడి
సాగిపోవడమే కాదు.
గానుగెద్దులా తిరిగిన చోటే
తిరగటమూ కాదు.

జీవితమంటే అపుడపుడు ఆగిపోయి
ఉభయ సంధ్యా వర్ణాలను
తనువుకు లేపనం చేసుకోవడం.
బాలభానుడు లేత కిరణాలతో
వెండి మబ్బులకు రంగులద్దే
నైపుణ్యాన్ని అవలోకించడం.

జీవితమంటే అపుడపుడు
పక్షుల కూజితాలను
అవి పాడే ఉదయ రాగాలను
అవధరించడం.
సంధ్యా సమీరాల పరిష్వంగంలో
తాదాత్మ్యం చెందడం.

జీవితమంటే అపుడపుడు
పున్నమి వెన్నెల సోనలలో
తడిసి ముద్దయిపోవడం
నిశీధిలో నీలి నింగిలోకి
తొంగిచూసి చుక్కల అందాలకు
అబ్బురపడటం.

జీవితమంటే అపుడపుడు
ఆత్మీయులతో నాలుగు
మంచిమాటల ముత్యాలు పంచుకోవడం
కలిగినంతలో నలుగురికి
చేయూతనివ్వడం.

జీవితమంటే కృత్రిమత్వాన్ని వీడి
ప్రకృతితో మమేకమై
కొన్ని మధురానుభూతులను
పోగు చేసుకోవడం.
అపుడపుడు స్మృతిపథాన్ని తడుముకుని
ఆ మధుర స్మృతుల పరిమళాలను
ఆఘ్రాణించడం!
ఆస్వాదించడం!! ◆




యం.కె. సుగమ్‌బాబు

# అలుపెరుగని ప్రవాహం

- మందరపు హైమవతి
9441062732

పైగంబర కవుల్లో ఒకరైన యం.కె.సుగమ్ బాబు గారి కవిత్వ ప్రయాణం సుదీర్ఘమైనది. అభ్యుదయకవిగా, విప్లవకవిగా, సమకాలీన ఉద్యమాలతో పాటు ప్రయాణించారు. రెండు దశాబ్దాల కిందట 'రెక్కలు' అనే లఘు కవితాప్రక్రియను సృష్టించి కవిత్వంలో తనదైన ముద్రవేసిన ప్రతిభాశాలి.

వీరు 'రెక్కలు ప్రక్రియపై చెరిగిపోని సంతకం చేసినా వచనా కవితా ప్రక్రియకు దూరం కాలేదు. చాలా ఏళ్ళ తర్వాత *'నీల మొక్కటి చాలు'* కవితా సంపుటితో పాఠకుల ముందుకు వచ్చారు.

ఆధునిక సంక్లిష్ట సమాజానికి ప్రతికృతి ఈ కవితాసంపుటి. ప్రజల క్షేమం పట్టించుకోని నకిలీ ప్రజాస్వామ్యం, బూటకపు ఎన్‌కౌంటర్లు నిప్పుకణికల వంటి నిజాలు చెప్పినందుకు మేధావుల ప్రాణాలు, హరించడం వల్ల, కుబేరుల అంతం చూస్తారని ప్రగల్భాలు పలికి పెద్దనోట్లు రద్దు చేయడం, దేశాల మధ్య దూరం తరిగిపోయినా, మనుషుల మధ్య దూరం పెరిగిపోవడం వీటన్నిటి మీద సంధించిన కవితాస్త్రాలు, ఎక్కుపెట్టిన బాణాలు సుగమ్ బాబుగారి కవితలు.

ఇటీవల దేశాన్ని కుదిపివేసిన సంఘటన పెద్దనోట్లరద్దు, నల్లడబ్బును నియంత్రిస్తారని, కుబేరుల గర్వమణుస్తానని, ఆ డబ్బును సామాన్యుల అకౌంట్లో పదివేల రూపాయిల - చొప్పున వేస్తానని పాలకులు పెద్దనోట్లు రద్దుచేసారు. కుబేరులు కడుపులో చల్లకదలకుండానే వున్నారు. విజయ్ మాల్యాలు విమానమెక్కి ఎగిరిపోయారు. ఎందరో కుచేలురు మాత్రం కుప్పకూలిపోయారు. దీనినే 'దేశాభివృద్ధి' కవితలో ***"పునాదుల్లో నల్లడబ్బు కాంక్రీటేగా! ససేమిరా బల్లడు / మన వల్లభుడు / ఇక తాను నిలబడ్డనేల కూడా / నల్లడబ్బు దన్నుగా ఉన్నదేనని తెలిసి / ఎక్కడకు గంతేస్తాడో - ఏ కొత్త చట్టం తెస్తాడో / త్వరలో ఇలా దేశం అభివృద్ధి చెందుతుందనుకొంటా "*** నని నల్లధనమహారాజుల గర్వమణుస్తానని ప్రగల్భాలు పలికిన నేతపై వ్యంగ్యాస్త్రాన్ని ప్రయోగిస్తారు కవి.

పాలకులకు అక్షరమంటే భయం. యధార్థాలను విప్పిచెప్పే కవులంటే ఆగ్రహం. అజ్ఞానం మత్తులో మునిగిపోయిన సామాన్యప్రజలను మేల్కొలిపే రచనలంటే అసహనం. అందుకే కల్బుర్గి, పన్సారేలను హతమార్చారు. దీనిని నిరసిస్తూ 'తెలుగు కోడి'లో ***"జనాన్ని మేల్కొల్పడం కన్నా / గొప్ప విద్యేముంది'. అనుకున్నా ఒకనాడు / కానీ ఆ ఆలోచనే తప్పని అర్థమైంది కర్ణాటకలో కల్బురి / మహారాష్ట్రలో నరేంద్ర దభోల్కర్ / గోవింద పన్సారేలు / వేకువ పుంజులయ్యారనే కదా / వారి గుండెల్లో బుల్లెట్లు పండించారు / త్వరపడిపోయి / నేను సైతమని గొంతెత్తి వుంటే / తెలుగుకోడి బిర్యానై వుందునా"*** పాలకుల

నియంతృత్వాన్ని ఎండగడతారు.

మనది అతి పెద్ద ప్రజాస్వామ్యదేశం. ప్రజలకోసం, ప్రజలచేత అని పిలవబడే ప్రజాస్వామ్యం. పదవికోసం, పదవిచేతగా మారిపోయింది. ప్రజలను కన్నబిడ్డలుగా పాలించవలసిన పాలకులు ప్రజలనే ఎన్‌కౌంటర్లు చేస్తున్నారు. బూటకపు ఎన్‌కౌంటర్లలో ఎంతోమంది అమాయకులు నిష్కారణంగా ప్రాణాలు పోగొట్టుకొంటున్నారు. దీనినే 'ఎన్ కౌంటర్' కవితలో ***"ప్రజాస్వామ్యంలో /ఎన్ కౌంటర్ /ఎవరు ఎవరిపైకి / గురిపెట్టారు తుపాకులు / కొండల్లో కోనల్లో. ముళ్ళల్లో... తుప్పల్లో.. దూరం దూరంగా పడిపోయిన శవాలు! / ప్రజల్ని చంపడమేగా / ప్రభుత్వాల పని? ప్రజల్ని కాపాడవలసిన ప్రభుత్వమే ప్రజల్ని చంపుతుందా? ఇదేనా ప్రజాస్వామ్యం?"*** అని సూటిగా నిలదీస్తారు కవిగారు.

ఇటీవల తెలంగాణా ప్రభుత్వం కొంతమంది సినీనటులు మత్తుమందుల్లో కూరుకుపోతున్నారని, వారి దగ్గర డ్రగ్స్ వున్నాయని కేసులు పెట్టి కొన్ని రోజులు టి.వి.నిండా, పేపర్లు నిండా అవే వార్తలు. ఈ వ్యవహారాల గురించి 'సినిమా బాగుంది' కవితలో ***"సినిమాబాగుంది / డ్రగ్స్.. గ్రాఫిక్స్ బ్రహ్మాండం / క్లైమాక్స్ అదిరిపోయింది। చివరికి, నిషా, ఆనందం / బూడిదలో మిగిలే అస్తికలే మరి! / జీవితాన్ని మాయం చేసే మాహమ్మారిని / టార్గెట్ చేయడం చాలా బాగుంది / క్లైమాక్స్ అదిరిపోయింది - సినిమా బాగుంది।"*** అని వ్యంగ్యంగా డ్రగ్స్ వ్యవహారంపై ప్రభుత్వం తీసుకొన్న చర్యలను వ్యాఖ్యానిస్తారు.

సుగమ్ బాబుగారి కలం పదునైనది. ప్రజావ్యతిరేకమైన పాలకవర్గచర్యలను ఎండగట్టడంలో ఎంత ప్రతిభా వంతమైనదో, ఆధునిక సంక్లిష్ట సమాజంలో మరుగున పడిపోతున్న మానవ సంబంధాలను చిత్రీకరించడంలో అంత పదునైనది. మనుషులు పక్కపక్కనే వుంటారు కానీ, మనసుల మధ్య కనబడని గోడలు. దీన్ని వర్ణిస్తూ 'కరెక్టే' కవితలో ***"ఎవరికి వారు కరెక్టే.. నా ఫ్రెండ్స్ / శివుడు కరెక్టే / దేవుడే కరెక్టే / మాకిరణ్, ఓల్గా / ఒకరేమిటి అందరూ కరెక్టే। అని స్నేహితుల మధ్య కూడా కన్పించని దూరం.. / అదీ కరెక్టే "*** అని స్నేహితుల మధ్య కూడ కన్పించని దూరాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తారు.

కవికి ఇలా మనుషుల మధ్య విస్తరించిన ఎడారి నచ్చదు. ఏమీ భేదాలు లేకుండా కలిసిపోవడం ఇష్టం. ***"కలిసిపోవడమే! లో ఏరునదిలో సంద్రంలో / సంద్రం ఆకాశంలో కలిసిపోయినట్టు / కలిసిపోవటమే / అని అంటూ "పుట్టుక జీవితాన్ని / జీవితం కాలాన్ని / కాలం మృత్యువును కలిపేసినట్టు కలిసిపోవటమే"*** అని జీవన తాత్వికతను మరింత లోతుగా అభివర్ణిస్తారు.

ఈ యాంత్రిక జీవనంలో తెల్లారిలేస్తే మానవుడు రూపాయల గుఱ్ఱమెక్కి పరుగుపందెంలో పాల్గొంటున్నాడు. అసలైన జీవనానందాన్ని పొందలేక పోతున్నాడు. 'స్పర్శ' లో కవి ***"ఎవరేమి సంపాదించుకుంటారు బ్రదర్! ఒక్క పలికరింపేగా / ఒక ఆత్మీయతేగా / ఒక నవ్వు ముఖం ఆప్యాయంగా / ఎదురవ్వడమేగా / శ్వాసలో శ్వాసను కలుపుతూ / ఆలింగనం చేసుకోవడమేగా! / పులకరింపజేసే మానవ స్పర్శ / అదే అనుకుంటాను / ఈ మాత్రం హాయిని నోచుకోపోతే / ఏం మిగిలినట్టు.. / ఏం సంపాదించినట్టు?"*** అని సంపాదన కర్థం తెలుసుకోమంటారు. పచ్చకాగితాల స్పర్శతో కాదు మనసులో పచ్చదనం గుబాళించే మానవస్పర్శలోనే ఆనందం వుందని కవితాత్మకంగా చెప్తారు.

చాలా మంది భౌతికమైన అందానికే ప్రాముఖ్యం ఇస్తారు. కానీ ఆత్మ సౌందర్యానికి ప్రాధాన్యమివ్వరు. అందరిమాట, అలా వుంచితే కవుల అందం వాళ్ళ కవిత్వంలో మాత్రమే ఉంటుందని 'కవి అందం' లో ***"మహాకవి కృష్ణశాస్త్రి / ఎంత అందగాడు / ఆ వెండి గిరజాల జుత్తు / తెల్లని లాల్చీ / భుజంపై జరీకండువా"*** అని అతని అందమైన రూపాన్ని ఆరాధిస్తాడు కవి. అలా ఫోటో దిగాలనుకొంటాడు. కానీ ***"కృష్ణశాస్త్రి అందం / ఫోటోలో లేదన్నాడో కవిమిత్రుడు / కవిత్వంలో ఉందన్నాడు"*** అని కవికి అందాన్నిచ్చేది కవిత్వమేనంటారు.

ఎగురుతున్న పిట్టలోనూ ఎండిపోయిన చెట్టులోనూ కొండలపైనుంచి దూకే జలపాతంలోనూ, నిశ్చలమైన తటాకంలోను అందాన్ని ఆస్వాదిస్తాడు. అందమైన తాజ్‌మహల్‌లోనూ, శిథిలమైన కట్టడంలోనూ ఏదో సౌందర్యాన్ని చూచి పరవశిస్తాడు. 'జీవన సౌందర్యం' లో ***"ఒక్కో అడవిపిట్టను చూసినప్పుడు/ మళ్ళీ మళ్ళ చూడాలనిపిస్తుంది/ దాని రంగులు, కళ్ళు, కదలికలు / బుల్లి పిట్టలో ఎంత అందం / ఎంత ఠీవి/ మనకు సంబంధం లేకపోయినా / ఏదో ఉంటుంది / అంటూ / ఒక్కో మనిషి తనదారినే పోతుంటాడు/ అతని చూపు అతని మౌనం / ఆ నడక, ఆ దీక్ష /***

## ఒక శై"శవ" గీతం

- బంగార్రాజు కంఠ
8500350464

కోళ్ళూ.., మేకలూ.., చేపల్లా
ఇప్పుడు మనుషుల్నీ పెంచుతున్నారు
రేపటి మార్కెట్ దౌర్భల్యాల కోసం
పసికందులకు పదుచుతనాన్ని
ఇంజెక్ట్ చేస్తున్నారు
హననాల దారిలో
జననాంగాలు మొలిపిస్తూ
పాతజాతర ప్రభల మీద
కొత్తగా నర్తింపజేస్తున్నారు

సూక్ష్మంలో మోక్షంలా
రేపటి బాలెట్ కోసం
ఓటు కూడా
వడివడిగా పెంపబడుతుందేమో
అమ్మకానికి పెట్టిన బద్మాషేవడో గానీ
వాడిబుద్ధి పరిపక్వం చెందడానికి
కొత్తమందులు కనిపెట్టండ్రాబాబు

పాతబస్తీలోని తుక్కు రేకుముక్కకు
సొంతదారులున్న డిజిటల్ సమాజంలో




ప్రాణంతో సంచరించే రక్తమాంసాలకు
తండ్రెవరో తెలియని కథల్ని
చరిత్ర ఇంకెంతకాలం మోస్తుందో

సంభవామి యుగే యుగే
అన్నదేవుడు రావడానికి
ఇంకెన్ని యుగాలు పడుతుందోగానీ
క్షణానికో అవతారమెత్తుతూ
లోకమ్మొత్తం కుట్రల సమూహాలుగా
ఇకముందు ముందు మారిపోయి
మనిషి మరో పేరుకోసం వెతుక్కుంటున్నాడు
మోసగీతం
ఇప్పుడు మాడ్యులేషని మార్చుకుంటుంది

*( పసిపిల్లకు స్టెరాయిడ్సిచ్చి పెంచి పడుపువృత్తిలోకి దింపుతున్న వైనానికి )* ◆

---

*ఇవన్నీకూడా, మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తయ్ / నిజంగా / మళ్ళీ మళ్ళీ చూడాలనిపించడమే/ ఆకర్షణేమో/ జీవన సౌందర్యరహస్యమేమో "* అని అదీ, ఇదీ అని నిర్వచించలేని జీవన సౌందర్య రహస్యాన్ని విప్పి చెప్పారు.

సుగమ్‌బాబు గారి ఆరుపదుల సాహిత్యజీవితంలో ఎక్కడా ఆయన కవితాప్రయాణం ఆగిపోలేదు. ఎప్పటికప్పుడు కాలంతో పాటు ప్రవహిస్తూ కొత్తగా చివురిస్తూనే వున్నారు' "నన్ను ప్రవహించనీయండి కవితలో *"నా ప్రయాణం ఎంతో వుంది / ప్రతి మలుపులోనూ కొత్తదనం, ఊపిరికి అందని ఉత్కంఠ / ఆహ్వానించాల్సిన వసంతాలు అనేకం - కొత్తభాష కొత్త వ్యక్తీకరణ / నాదైన నడక సంతరించుకోవాలి / నేను ప్రవాహాన్ని నాదారిన నన్ను ప్రవహించనీయండి"* అని నిరంతర ప్రవాహానికి సన్నిద్ధుడవుతారు కవిగారు.

వైవిధ్యమైన కవితలతో ఈ కవితాసంపుటి పాఠకులలో ఆలోచనలను రేకెత్తిస్తుంది. వస్తు శిల్పాలు రెండింటిలో ఈ కవితలు పరిణతి సాధించాయి. సుమారు రెండు దశాబ్దాలు రెక్కలు రాసిన అనుభవం ఈ కవితా సంపుటిలో ప్రతిబింబించాయి. క్లుప్తత, గాఢత, సరళతో ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయి. రెక్కల కవితానిర్మాణ పద్ధతి ఈ కవిత్వ నిర్మాణంలో అప్రయత్నంగా ఒదిగిపోయింది. సూదుల్లా గుచ్చుకొనే వ్యంగ్యం, అలవోకగా సిద్ధించిన వాక్యనిర్మాణం, కవితలన్నిటిలో అంతర్లీనంగా ప్రవహించే జీవన తాత్వికత ఈ సంపుటిని ఉన్నతీకరించాయి.

ముఖం ఎదురుగా ముఖం, కళ్ళలోకళ్ళు, ఇదిగదా దగ్గరతనం, పెంపుడుపిల్లిలా ఒదిగిన కన్పించని దూరం, పూనకం వచ్చినట్లు మూడురోజులుగా ముసురుపదాన్ని జరీ తలపాగలా ధరించడం మొ॥ వాక్యాలు హృదయాకాశంలో మెరుపులను మెరిపిస్తాయి.

సుగమ్ బాబుగారి ఈ కవితా ప్రవాహం ఎక్కడా కుంటుపడగూడదని, రాళ్ళదారిలో, సెలయేళ్ళదారిలో కొత్తచూపుతో ప్రవహించాలని ఆకాంక్షిస్తున్నాను. ◆




ఎమ్వీ రామిరెడ్డి

# వెంటవచ్చు 'కథల' నది

- వై.హెచ్.కె.మోహన్‌రావు
8985296123

ఎమ్వీ రామిరెడ్డి కథలు దృశ్యమానమై నడుస్తుంటాయి. ఆయా కథలలోని పాత్రలు సజీవమై మనలను వేలుపట్టి వెంట తీసుకెళతాయి. ముగింపు అనంతరం అవి పాఠకుని వెన్నంటే పరిభ్రమిస్తాయి. వాస్తవానికి రామిరెడ్డి కథలకు సమకాలీన సమాజంలోని విభిన్న పార్శ్వాలు కలిగిన వ్యక్తులూ, పరిస్థితులే ముడిసరుకు. సగటు కుటుంబాలు అనుభవించే తీపి చేదు లేక కథలకు ఆలంబన. కొన్ని కథలు ఆలోచింపజేస్తాయి. మరికొన్ని ప్రబోధాన్నిస్తాయి. ఇంకొన్ని మార్గ దర్శనం చేస్తాయి. వైవిధ్య భరితకథలు రాయడం ఆయన నైజం. ప్రతికథకూ ఒక ప్రయోజనం వుంటుంది. విస్తృతంగా రాసే సత్తాకలిగిన రామిరెడ్డి అగ్రశేణి కథకులని వేరే చెప్పే అవసరమే లేదు. కథ రాసినా, కవిత రాసినా గాఢత రామిరెడ్డి అక్షర లక్ష్యం.

ఇదివరలో వివిధ కవిత, కథా సంపుటాలను వెలువరించిన రామిరెడ్డి తాజాగా 2018లో "వెంట వచ్చునది" మకుటంతో ఆయన కలం సృజించిన కొన్ని కథలను గుదిగుచ్చిన మాలికను మరో సంకలనంగా తీసుకువచ్చారు. 225 పుటలతో ఒక్కటి తక్కువగా 20 కథలు ఈ సంకలనంలో నిక్షిప్తం చేశారు. ఇందులోని కథలన్నీ ప్రఖ్యాత తెలుగుదినపత్రికలకు అనుబంధంగా వచ్చే ఆదివారం ప్రత్యేక సంచికలలోనూ, వార, మాస పత్రికలలోనూ, వెబ్‌మేగ్జైన్స్‌లో ప్రచురించినవే. బహుళ ప్రజాదరణ పొందిన విశేషమైన కథలను ఆయన ఒకే చోటకు చేర్చి మరో మారు పాఠకుల ముందుకు తెచ్చారు.

రామిరెడ్డి విభజనాంధ్ర రాజధాని ఏర్పాటులో భూములు కోల్పోయిన ప్రాంతవాసి. రాజధానికి భూముల సేకరణలో ప్రభుత్వం ఆడిన వికృత క్రీడలో తనుకూడా బాధితుడు. ఆయా గ్రామాల్లో సాగుభూములను రాజధానికోసం నిర్బంధ త్యాగం చేసిన రైతుల దీన, హీన గాథలు ఎరిగినవాడు. వారి వేదననూ, రోదననూ కథలుగా మలిచినవాడు. ఆ వ్యధను స్వయంగా తనూ అనుభవించి సృజించిన ఈ తరహా కథలు అత్యంత సాంద్రతను సంతరించుకున్నాయి. ఈ సంపుటిలో కూడా రాజధాని కోసం భూములు కోల్పోయి చితికిన బతుకుల కథలున్నాయి. రైతును రైతుగా మిగలనివ్వని అవాంఛిత ఛిద్రణలా వున్నాయి. నిర్బంధ భూస్వాధీనాంతర రైతుల, వ్యవసాయకూలీల, ఆయా గ్రామాల ప్రజల ముక్కలైన జీవన ముఖ చిత్రాలు భూమికగా రాసిన గాథలున్నాయి. విచ్ఛిన్నమైన వారి బ్రతుకు చారికలకు చలించిన అక్షరాలూవున్నాయి. సంఘర్షణాత్మక జీవితాలను మలిచిన కథనాలున్నాయి. మానవీయదారులున్నాయి. మరొక ప్రపంచపు మార్గాలూ వున్నాయి.

అదేవిధంగా చీడ పీడలతో దిగుబడి కోల్పోయిన పంట పొలాల కంట తడి ఆరకుండా కనిపిస్తుంది. రాబడులు సన్నగిల్లి నష్టాలపాలై కుమిలిపోయే రైతుకుటుంబాల్లోని కల్లోలం వినవస్తుంది. నష్టాలపాలై అప్పులతో అవమానాలకు

తట్టుకోలేక ఆత్మహత్యలకు పాల్పడే అన్నదాతల ఆత్మఘోషలను వినిపిస్తాడు. నకిలీ విత్తనాలూ, కల్తీపురుగు మందులూ, మార్కెట్ మాయాజాలం విశృంఖలతను దునుమాడుతారు. పల్లె స్థితిగతులనూ, మనిషి వేదనావేదలనూ, పారిపోతున్న మనిషి తత్వాన్నీ లోతుగా అధ్యయనం చేసిన రామిరెడ్డి ప్రతి ఒక్క కథకూడా మరోకథతో ఆ సారూప్యతతోనే సాగుతుంది.

"కాపలాతల్లి" కథాంశానికి అనుగుణంగా శీర్షిక చక్కని అన్వయం కుదిరింది. రెండు పార్శ్వాలను ఒకే చట్రంలో ఇమిడ్చిన సందర్భంగా జనించిన శీర్షికే "కాపలా తల్లి" అపార్టుమెంటుకు కాపలాగా ఉండే తల్లి మరొకరు కన్న బిడ్డను కంటికి రెప్పలా కాయడం, సాకడం ఈ కథలోని సారాంశం. అదే క్రమంలో పెంచిన కాపలా తల్లిపై ఆ బిడ్డకూడా మమకారాన్ని ప్రదర్శించడం మానవీయ విలువలు నిండుగా వికసించిన ఇద్దరు మనుషులను రామిరెడ్డి వెతికి పట్టుకుని మానవ సమాజం ముందు నిలబెట్టారు. మనిషిగా ఎట్లా బ్రతకాలో, ప్రేమను ఎట్లా పంచాలో ఈ రెండు పాత్రలతో మనకు బోధించారు. ద్రవించే రెండు గుండెలను ముడిపెట్టారు. భారతీయ సమాజంలో మృగ్యమౌతున్న మానవీయ బంధాలను గట్టిగా మళ్ళీ పెనవేశారు. సాటిమనిషి పట్ల మనిషి చూపవలసిన ప్రేమ, జాలి, కరుణ ఆర్ధ్రత వంటి ఆశాలతలు చిగురింపజేసే రెండు పాత్రలకు జీవపోసి మొత్తం లోకానికి చిహ్నాలుగా నిలిపారు. కథ చదవడం ముగిసే సరికి హృదయం బరువెక్కుతుంది. కథలోని మలుపులు మళ్ళీ మళ్ళీ గుర్తుకు వస్తుంటాయి.

"సమిధ" శీర్షిక కథలో ఆయన కృష్ణాతీరాన నవ్యాంధ్ర రాజధాని రాకతో ఉపాధి కోల్పోయిన రోజువారీ కూలీ చితికిన బతుకును ఆవిష్కరించారు. ప్రేమాభిమానాలతో, ఆత్మగౌరవంతో గడిపే పల్లెనుండి ప్రభుత్వంచే బలవంతంగా నెట్టివేయబడిన పూర్వరంగంలో నగరంలో బానిసం, అవమానం వంటి పడగలనీడలో మనలేని వ్యవసాయ శ్రామికుని వైనాన్ని కళ్ళకు గట్టారు. పల్లెత్తు మాటబడకుండా అరచేతులలో పెట్టుకొని సాకిన పల్లెను వీడిన నేపథ్యంలో ఒక శ్రామికుడు అనుభవించిన అగచాట్లను అక్షరీకరించారు. పాలకుల నిరంకుశ పోకడలకు బలైన గ్రామాల దుస్థితిని పాఠకుని హృదయంతో సంధానం చేశారు.

"త్రిశంకు స్వప్నం" తలకట్టు కలిగిన కథ నవ్యాంధ్ర రాజధాని అమరావతి పరిసర గ్రామాల స్థితిగతులకు దర్పణం పట్టింది. వివిధ కోణాలను తెరమీదకు తెచ్చింది. ఒక వైపు భూముల ధరలు ఆకాశాన్ని తాకి తోడబుట్టిన వాళ్ళ మధ్య చిచ్చురేగి రక్తసంబంధాలను ఏవిధంగా దహించాయో కళ్ళకు గట్టారు. మరోవైపు ల్యాండ్‌పూలింగ్‌లో భూములను కోల్పోయిన వారు ప్రభుత్వం అప్పగించవలసిన ప్లాట్లు అప్పగించకపోవడం మూలంగా సంపద వుండికూడా ఏవిధంగా పేదరికాన్నీ, దరిద్రాన్నీ అనుభవిస్తున్నారో విపులీకరించారు. రాజధాని ప్రకటన, అనంతర పరిణామాల్లో పరిసర గ్రామాల్లో మద్యం దుకాణాలు ఏర్పడి సాధారణ ప్రజల జీవితాలను ఎట్లా గుల్లచేసి ఆరోగ్యాన్ని అతలాకుతలం చేస్తున్నాయో విశదీకరించారు. ఇంకోవైపు రియల్‌ఎస్టేట్ కోరల్లో చిక్కిన గ్రామాల్లో ఉపాధికోల్పోయిన శ్రామికుల వేదననూ చిత్రించారు. రాజధాని ఇక్కడకు రాకమునుపు పంటదిగుబడులు సన్నగిల్లి బలవన్మరణాలతో విగతజీవులుగా మారే పట్టెడన్నం పెట్టే రైతుల దురవస్థలనూ దృశ్యమానం గావించారు.

ఇక సంకలన మకుటం గలిగిన "వెంట వచ్చునది" కథ క్రితంలో మనం చదవని నూతన పంథాలో నడిచింది. కథ మలుపులు తిరిగిన వైనం చిత్రంగా వుంటుంది. ఇట్లా కథలు మలచడంలో రామిరెడ్డి కలం దిట్ట. కథలో మంచి సందేశం ఇచ్చారు. నిజంగా ఈ కథలో చెప్పిన సందేశాన్ని అందరూ ఆచరించి పాటించవలసిన అవసరం ఎంతైనా వుంది. మానవీయ విలువలు కుచించుకుపోయి సాటి మనిషి ఎంత ఇబ్బందిలో వున్నా విస్మరించి ఎవరి దారిన వారు సాగిపోతున్నారు. ఎవరి స్వార్థాన్ని వారు చూసుకుంటున్నారు. ఎవరి మానాన వారు వుంటున్నారు. ప్రాణాపాయంలో వున్నా నరే చేయందించడం, చేయూత నివ్వడమనేది కనుమరుగౌతుంది. నగరాలూ, పట్టణాలూ ఈ దృశ్యాలకు మరింత కేంద్ర బింధువులుగా వున్నాయి. పల్లెలూ, గ్రామాలే కొంతమేర చేయందించే పరిస్థితులు మిగిల్చుకున్నాయని చెప్పవచ్చు. అందుకే పల్లె తల్లి లాంటిదీ, చెల్లిలాంటిదీ అనే నానుడి వుంది సుమా!

" ఆనులగు.....ఒక ఆకాశం" కథలో ధరలు విపరీతంగా పెరిగిపోయిన నేపథ్యంలో భూములను కారుచౌకగా కాజేయడానికి జరిపే దౌర్జన్యాలనూ, బలహీనులైన భూయజమానులపై జరిగే దాడులనూ, తమ దారికి తెచ్చుకునేందుకు అనుసరించే రౌడీయిజం ఇత్యాది అసాంఘిక శక్తుల రాక్షసక్రీడను ఏకరువు పెడతారు. రాజకీయ నాయకుల

## కవిత

# కథ

-సాంబమూర్తి లండ
9642732008

అనగనగా ఓ దేశం
ముక్కలు ముక్కలుగా
రాజులూ... రాజ్యాలు
కోటలూ... కొట్లాటలు!

అవకాశవాదం...
సముద్రాలుదాటి వచ్చింది
అనైక్యత ఆసరాగా
అంతా వ్యాపించింది.
అంతటా అంధకారం...
ఆక్రోశం... అనైతికం!

నిప్పురవ్వలు-
చీకట్లను
చీల్చలేకపోయాయి!
కానీ, చీకట్లు...
రగిలిన నిప్పును
ఆర్పలేకపోయాయి!
దావాలనం...
మిన్నూ మన్నూ
కలిపేస్తూ!
ప్రాణం... తృణప్రాయం.

రాబందు మరలింది...
దేశం స్వేచ్ఛను
పీల్చుకుంది
నింగి కాషాయం,
నేల పచ్చదనం,
నడుమ తెల్లని భారతీయతతో
రంగుల పతాకం రెపరెపలాడింది!

కరుణ లేని కాలం...
మళ్లీ అదే చరిత్రను
మరోసారి రాస్తోంది!

కొరడా అదే!
కొట్టేవాడే మారాడు.
అన్నం పెట్టేవాడు
అడుక్కు తింటున్నాడు.
సేవ చేయాల్సినోళ్లు విండో ఏసీల్లో...
సేవలు పొందాల్సినోళ్లు మండే ఎండల్లో!
ఈ దేశపు ఆకాశం నిండా
కార్పొరేట్ డేగలు.
ఈ దేశపు నేలంతా
సామ్రాజ్యవాదపు విషాలు.
సగటు భారతీయులు
సజీవ శవాలు!!

ఇప్పుడు దేశమంటే



అన్నీ దొరికే మార్కెట్!
ఇటుకలు పేర్చడానికి-
పచ్చని పొలాలు.
రసాయనాలు మింగడానికి-
పచ్చని ప్రాణాలు.
పచ్చినెత్తురు తాగడానికి-
మానవాయుధాలు...
అన్నీ సరసమైన ధరల్లో!
ఇక్కడ,
డబ్బులు విత్తితే-
ఉద్యమాలు మొలుస్తాయి.
నోళ్ళు తడిస్తే-
ఓట్లు వికసిస్తాయి!

ఇప్పుడు దేశం... ఓ సర్కస్ కేంద్రం!
సామాన్యులంతా... బఫూన్లు
అగ్రరాజ్యాధినేతలు... రింగ్ మాష్టర్లు.

దేశం కథ
ఇంకా కొనసాగుతూనే ఉంది...
ఎవరో వస్తారని
ఏదో ఉద్ధరిస్తారన్న ఆశతో....
ఐదేళ్లకోసారి భుజం మార్చుకుంటూ! ♦

---

జోక్యాన్ని, అరాచక స్వరూపాన్నీ నిట్టనిలువునా బట్టబయలు గావిస్తారు. వరుల ఆస్థిని అలవలు నులువలుగా చేజిక్కించుకోవడానికి పెట్రేగే హింసావాదుల వికృత హింసను విశదపరిచారు.

వివిధ వర్ణాలతో రామిరెడ్డి వెంట తెచ్చిన కథలన్నీ పాఠకుల హృదయ చలనం గావిస్తాయి. ఒక విధంగా చెప్పాలంటే పాఠకుని గుండెను తాకని కథ ఆయన కలం వెంట రాదేమో! అనిపిస్తుంది. కథను చెప్పే తీరు బహు సులభతరంగా వుంటుంది. అర్థవంతంగా, సునిశితంగా, సూటిగా, ప్రయోజనాత్మకంగా కథ అల్లడం రామిరెడ్డి చాలా సునాయాసంగా చేస్తారు. కథాప్రేమికులంగా చదవాల్సిన సంపుటి రామిరెడ్డి "వెంట వచ్చునది' కథాసంపుటి. చదవటం అలవాటు లేనివారిచే సైతం ఒక్క కథ చదివించండి, మిగిలిన కథలన్నింటినీ పుస్తకం చివరి పుటవరకూ ఎవరూ చెప్పకుండానే పూర్తి చేస్తారని చిటికేసి చెప్పగలను. రసవత్తరమైన అద్భుతకథాసంపుటి అందించిన రామిరెడ్డికి అభినందనలు.

రూ 160/- వెల కలిగిన ఈ కథా గుచ్ఛం కోరువారు యం.వి రాజ్యలక్ష్మి,102, శ్రీకోట రెసిడెన్సీ, మియాపూర్, హైదరాబాద్ - 520049 చిరునామాను సంప్రదించండి చదివిన అనంతరం 9866777870 చరవాణి నుండి మీ అనుభూతులను రచయితకు కథలు కథలుగా వినిపించండి. ♦








డా॥ ఎన్. గోపి

# కవితా యాత్రా కథనం

- డా॥ యస్. జతిన్ కుమార్
9849806281

*"మానవాళిని కలిపేది కవులే"*

**- జీదీ మాజియం చైనాకవి.**

ప్రఖ్యాత కవి, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత ఎన్.గోపీ 2018 అక్టోబరులో చైనాలో కవితాయాత్ర చేసి వచ్చారు. బీజింగ్ నార్మల్ యూనివర్సిటీలో అంతర్జాతీయ రచనా కేంద్రం వారు అక్టోబరు 21-29 మధ్య నిర్వహించిన కవిత్వం, అనువాద కార్యక్రమాలలో భారతదేశ ప్రతినిధిగా ఆయన పాల్గొన్నారు. ఆ అనుభవాలను, పరిశీలనలను 'చైనాలో కవితాయాత్ర' 'చైనా పద్యాలు' అనే రెండు పుస్తకాలుగా ప్రచురించారు 18.3.2019న వాటిని ఆవిష్కరించి సారస్వత మనస్యుడు, వ్యక్తిత్వశోభితుడు డా॥ కె.వి.రమణాచారి గారికి అంకితమిచ్చారు.

ఈ యాత్రా కథనంలో చాలా విలువైన అనుభవాలున్నాయి. చైనా సాహిత్యం గురించి, వర్తమానపోకడల గురించి, అక్కడి కవుల గురించి చాలా ఆసక్తికరమయిన వివరాలు, వ్యాఖ్యానాలు వున్నాయి. ఆ సమాజం గురించిన పరిశీలనలు, వున్నాయి. సౌహార్ద్ర ప్రకటనలు వున్నాయి. స్నేహ సుగంధాలు వున్నాయి. 'చైనా పద్యాల' లోనే కాదు, 'యాత్రా కథనం' లో కూడా సూటిదనం, చక్కని వచనంతోపాటు గాఢమైన కవితాభినివేశం వుంది. భావోద్వేగాల కవితాప్రదర్శన వుంది.

చైనా పట్ల మనదేశంలో గల మిశ్రమ స్పందనల అలజడి వుంది. మనదేశంలో చైనా గురించి ప్రచారంలో వున్న అంశాలవల్ల ఏర్పడిన సంశయం, సంకోచం, విముఖత కొండొకచో శత్రుభావనల ప్రభావం వుంది. అదే సమయంలో గత 70 సంవత్సరాలలో ఆ వ్యవస్థ సాగించిన ప్రయాణం, సాధించిన విజయం పట్ల ఆసక్తి, ప్రశంస, వారి అభివృద్ధి పట్ల ఆశ్చర్యం, ఆనందం.. వారిని గురించి మరింత లోతుగా తెలుసుకునే ప్రయత్నం, ఉత్సుకత ఇన్ని భావాల కలగలపుతో ఆయన యాత్ర సాగింది. ఈ భావావేశాలను కలిసి 116 పేజీల యాత్రాకథనంగా, 100 నానీలుగా వెలువడ్డాయి.

గోపీ తండ్రిగారు, రోజూ బయటకు వెళ్ళి తిరిగివచ్చిన తర్వాత కుటుంబ సభ్యులను కూర్చోపెట్టుకుని ఆనాటి సంగతులు" పూలుగుచ్చినట్లు వివరించేవారట, ఆ ప్రభావంతో, ఆ శైలిలోనే గోపీగారి ఈ యాత్రాకథనం సాగింది. విమానంలోను, ట్రైనులోను కిటికీ ప్రక్క సీటు దొరికినందుకు చిన్న పిల్లవాడిలా సంబరపడే లక్షణం. "చలనశీల దృశ్యకావ్యం" లా సాగిపోయే ఈ కథనానికి ఆలంబన అయ్యింది. అంతేకాదు "ఆలోచననాలోచలనాలను" పసిగట్టే పరిణతి ఒక అలంకారమయ్యింది.

"60 సంవత్సరాలుగా చైనా అంటే కోపం. పదిరోజులలోనే ప్రేమించటం నేర్చుకున్నాను" అన్నారు. "చైనా

యానం ఒక విలక్షణ గానం" గా భావించారు. తిరుగు ప్రయాణంలో విమానంలో కూర్చుని, గుర్తుచేసుకుంటూ" పెన్సిలులోంచి తక్షణం రాలిన అక్షరం సుమాలు ఎత్తిపట్టి నానీలుగా మార్చారు. అలవోకగా అప్పటికప్పుడు రాసే (Spontaneous) కవిత్వానికి, జ్ఞప్తికి తెచ్చుకు రాసినప్పుడు (Recollection) పెద్ద తేడా వుండదనే భావన వెలిబుచ్చారు. రెండు సందర్భాలలోను కవితగా వురికేది అనుభవ ముద్రలే కదా!

అక్కడ చదివిన తన కవితలు, చేసిన ప్రసంగాలు, విన్న ఇతర అంతర్జాతీయ, చైనా కవుల కవితలు, భాషానాద సౌందర్యాల కోసం మూల భాషలోనూ, అర్థంకోసం ఇంగ్లీషు అనువాదాలతోను గడిపిన ఆరురోజుల కార్యశీల కార్యక్రమాలను వివరంగా చెబుతూ వాటి గురించి చిన్న చిన్న వ్యాఖ్యానాలతో చాలా ఆసక్తికరంగా ఈ రచన సాగుతుంది. కవితలనే కాదు, ఆయా కవుల విలక్షణ లక్షణాలను సైతం మనకు పరిచయం చేసి మనమూ గోపీ గారితో ఆ సభలో పాల్గొన్న అనుభూతిని కలిగించారు. అదే సందర్భంలో చైనాలో కవులకు, కళాకారులకు ఇస్తున్న గౌరవమర్యాదలు సాహిత్యరంగానికి గల ఆదరణకు ఈయన పొంగిపోతారు. కార్యశాలలో పాల్గొన్న కవుల కవితల ఇంగ్లీషు, చైనా అనువాదాల పుస్తకం ఆ సభలలోనే అందటంచూసి వారి కార్యనిర్వహణ రీతికి అచ్చెరువు చెందుతారు. విద్యార్థులు, యువజనులు ఈ సాహిత్య సమావేశాలలో అధిక సంఖ్యలో పాల్గొనడం చూసి సంబరపడుతారు" సముద్రాలు దాటివచ్చిన కవితా పుష్పాలకు స్వాగతం" (Welcome to Roses Across the oceans) అంటూ ఆహ్వానించిన కున్‌షాన్ సమ్మేళన నిర్వాహకుల కవితా హృదయానికి పరవశించిపోతారు. అమెరికా, డేనిష్, దక్షిణాఫ్రికా, జర్మనీ, ఇండియా దేశాల నుంచి వచ్చిన ఒక్కొక్క ప్రతినిధితోనూ, ఆరుగురు చైనా కవులతోను కవితాచాలనం చేసి, చైనా కవితారంగం గురించి చెబుతూ "భావుకతలో మనకు వీళ్ళే సాటి" ఎక్కడో పశ్చిమంలో వెతుకుతున్నాం" అని తప్పిపోయిన భారతదృష్టికి ఒక దిశను చూపించారు గోపి. చైనాతో మనకున్న వేల సంవత్సరాల సాంస్కృతిక అనుబంధాన్ని, బౌద్ధం ద్వారా ఏర్పడ్డ అనుసంధానాన్ని గుర్తుచేసుకుంటారు. ఠాగూర్, గాంధీలకు వాళ్ళు ఇస్తున్న గౌరవాన్ని గమనించి ఆనందిస్తారు. బ్రహ్మపుత్ర మనల్ని కలిపి పుట్టింది అంటారు. రెండు సంస్కృతుల మధ్యవున్న సారూప్యం ఎంతో ఆశ్చర్యం కలిగిస్తుంది. అక్కడి ఆర్ట్ గ్యాలరీలను చూస్తే ఏలెలక్ష్మణ్, యాదగిరి గుర్తుకొస్తారు. అక్కడి కవులు పాడిన జానపదగీతాలు వింటే గోరటి ఎంకన్న స్ఫురిస్తాడు. "చైనా సంగీతాన్ని శ్రద్ధగా వినండి. ఎస్.డి. బర్మన్ గుర్తుకొస్తున్నాడు" ఇలా అడుగడుగునా చైనాతో మనకు గల సామీప్యాన్ని, సాంస్కృతిక బంధుత్వాన్ని ఎత్తి చూపుతారు "అది ఏర్పరచిన సమాజం కాదు ఏర్పడివున్న సమాజం" అందుకే ఘనమైన, సాంస్కృతిక వారసత్వ పునాదిగల వ్యవస్థ ఆ సంస్కృతి అంత తొందరగా మారదు. వాళ్ళు ఎంత అభివృద్ధిని సాధించినా, యాంత్రిక, పాదార్థిక ఉన్నతిని పొందిన వాళ్ళ ప్రవర్తనలో విప్లవకాలంనాటి కఠోర శ్రమల స్ఫూర్తి, కన్ఫూషియనిజం, బుద్ధిజంల మత చేతనా తాత్వికత అంతర్లీనంగా ప్రవహిస్తూ, శాంతియుత, సామరస్య పూరిత వ్యవస్థగా వారిని తీర్చిదిద్దిన వైనం వివరిస్తారు.

నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో చైనాలో జరుగుతున్న మార్పులను రేఖామాత్రంగా స్పర్శిస్తారు. అణురణ నాదాలకు, యుద్ధాలకు యువతరంలో చోటులేదనీ, ఏవైనా వినిపించినా అవి వ్యాపార ప్రయోజనాలకే తప్ప శాంతికి విఘాతం కాబోదని గోపి విశ్వాసం. అక్కడి నిత్యవ్యవహారాలు, పాలనా వ్యవహారాలు, శిక్షణా మొత్తం చైనా భాషలో (మాండరిన్ మాండలీకం) లో జరుగుతున్న విషయాన్ని, వాళ్ళ భాషాభిమానాన్ని చిత్రిస్తూ "ఇంగ్లీషు నేర్చుకోకపోవటం వల్ల మాకేం లోటు? అవసరమయితే మీరే చైనీస్ నేర్చుకోండి" అనేంత భాషాభిమానం, ఇంగ్లీషు ధిక్కారం అక్కడ వుంది. మనం ఇప్పటికీ పశ్చిమ దేశాల భావ దాస్యానికి అలవాటుపడ్డం. కానీ చైనా వారి అభివృద్ధికి ఇంగ్లీషు రాకపోవటం ఏమీ ఆటంకం కలగలేదు కానీ వ్యాపార వాణిజ్యాల అవసరాల రీత్యా మాత్రం అక్కడ ఇంగ్లీషు నేర్చుకుంటున్నారు అని చైనాలో మాతృభాషలో విద్యాబోధన జరగటం, ఆ ప్రజల జీవనానికి, జీవికకు వారి స్వంత భాష ఎలా తోడ్పడుతున్నదో వివరించారు. మనం ఇక్కడ భాషాభిమానాల్ని ఒక ఉద్వేగంగా చూస్తుంటే అక్కడ వారి స్వంత భాష పాలనాభాషగా బోధనా భాషగా నీరాజనాలు అందుకుంటూ జాతి అభివృద్ధికి ఎలా దోహదం చేసిందీ ఎత్తి చూపుతారు. "చైనా విశ్వవిద్యాలయాలు అమెరికా వాటికంటే క్వాలిటీలో ఏమాత్రం తీసిపోవు. పైగా విద్యారంగంలో వాళ్ళు ఎన్నో కొత్త పుంతలు తొక్కుతున్నారు" అనే అంశాన్ని ఒక

మాజీ వైస్ ఛాన్సలర్‌గా నిశితంగా పరిశీలించి గోపీ అభిప్రాయపడ్డారు. "పిల్లలంటే ఎంత శ్రద్ధ – రేకులు రాలకుండా పువ్వుల్ని నవరించినట్లుగా'' వారిని పెంచుతున్నారని భావిపౌరుల శిక్షణ, ఆలనా పాలనల గురించి చెబుతారు, కళ్ళు బద్ద భారీనిర్మాణాలను, ఆధునిక కట్టడాలను ఆహ్వానిస్తూనే, వారు తమ సంప్రదాయికతను, కాపాడు కుంటున్నారని అభినందిస్తారు. "చైనాలో ఏ భవనాన్ని చూసినా దానికి ఎక్కడో అక్కడ ఒక చైనీయ సాంస్కృతిక స్పర్శ వుంటుంది. గోడ మీదో, గోపురం మీదో ఇది చైనా కట్టడమనే ముద్ర వుంటుంది." ఇది చైనా వారి విశిష్టతనం కూడా గుర్తించాలి! నిజానికి చాల మంది వారిది పెట్టుబడిదారీ అభివృద్ధి అని వ్యాఖ్యానిస్తున్నా (గోపీ గారు కూడా ఫ్యూడలిజం పోయి కమ్యూనిజం, ఇప్పుడు కాపిటలిజం, భూమి గుండ్రంగా వుందని నానీ రాశారు) 'చైనా విశిష్టతలతో కూడిన సోషలిస్టు నిర్మాణం" అని వారు ప్రకటించారు. వాస్తవం చూస్తే చైనాచాయ్ చేదుగా వుంది అయినా తాగాలనిపిస్తుంది.' అన్నట్టు వారి విధానం, వ్యవస్థా నిర్మాణం అకుంఠిత దీక్షతో, అపూర్వమైన త్యాగశీలత, కష్ట సహిష్ణుత గల జాతి జనులు 70 సంవత్సరాలుగా సాగించిన కఠోర దీక్షాఫలం. అందుకే వారి చాయ్‌లాగ ప్రపంచ దేశాలకు పసందుగా, తాము అందుకోవలసిన మార్గంగా ఆదరణ పొందుతోంది.

ప్రఖ్యాత చైనాగోడను చూసి ఆయన గొప్ప కవితను రాశారు, "భద్రతాభ్రమలకు తిరుగులేని సరిహద్దురేఖ" అంతులేని మానవ యాతనల అంతరాల గోడలు పగులగొట్టిన మొనగాడొచ్చాడు. గోడలు లేని దేశంలో ఇప్పుడీగోడ వొట్టి మ్యూజియం గోడే". అంటూ ఆ గోడను "ప్రతిఘటనా ప్రతిక" గా గౌరవిస్తారు. "ఒకప్పటి మానవ ప్రయత్నానికి బృహత్ప్రతీక' అని ఆ గోడనుంచి ఒక రాయిని తొలుచుకు తెచ్చుకున్నారు చరిత్రకు ఆనవాలుగా. 'కాలాన్ని చీలుస్తూ సాగుతున్న బుల్లెట్ ట్రైన్" లా రన్నింగ్ నేషన్ అయ్యింది చైనా. "దేశి సరుకులు నాపమన్నాడు గురజాడ నేడు చైనా ఆ పని చేస్తున్నది" అని దేశాభిమానం వాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పుకునే మనకు పరోక్షంగా గోపీగారు అభివృద్ధిమంత్రాన్ని చెప్పారు. "మనం మాటల మాంత్రికులం వాళ్ళు చేతల మాంత్రికులు" అన్న నిర్ధారణకు వచ్చారు. అంతేకాదు "గతంలో జోకర్లని వెక్కిరించారు.. ఎంత హుందాగా వుంటారు వాళ్ళు" అని గుర్తించారు. పరిచయం లేనప్పుడు "చింగ్ చాంగ్ అంటూ ఎగతాళి (గా చూసిన భాష నేడు) చెవుల్లో కోకిలలు దూరిన స్వరకేళిగా" వినిపించింది. అందుకే "దూరం అంధకారం" అంటారాయన. ఈ యాత్రతో అవగాహన పెరిగింది. ఇలా తను విన్న దానికి, కన్న దానికి గల వ్యత్యాసాలపై ఆయన మనసు పంచుకుంటారు. అంతేకాదు ఈ చిన్న పుస్తకం నిండా అనేక మానవ స్పందనలు. తన ఈ యాత్రకు కారణమైన కవయిత్రి జామీ గురించి, తోటి కవుల గురించి, యాత్రలో సహకరించిన వాలంటీరు యువతీయుకుల గురించి ఎంత ప్రేమగా స్నేహంగా మాట్లాడుతారో! అలాగే ఇంటి వద్ద అనారోగ్యంతో బాధపడుతున్న భార్యా (అరుణగారిని) గురించి ఎంత బెంగ, ఎంత అప్యాయతగా తలచుకుంటారో, ఆ వ్యక్తిత్వ శోభ పాఠకుణ్ణి ఇట్టే ఆకట్టుకుంటుంది. "హిమాలయాలు నా కిరీటం, గంగా, యమునా, గోదావరులు నా కళ్ళలోంచి రాలే భాష్పాలు" అని యావత్ భారత దేశాలు తనలోనికి ఆవాహన చేసుకుని సాగించిన సాహితీ యాత్రను ముగించుకుని హైదరాబాద్ చేరగానే వినిపించిన స్వర్ణా సంగీతం మనలోని తీయని భావాన్ని నింపుతాయి.

"సర్వసంస్కృతులూ ప్రపంచ సంస్కృతిలో భాగమే. ప్రపంచశాంతి అభ్యుదయాల పథంలో ఉమ్మడి భాగస్వామ్యంతో నూతన తీరాలకు మానవాళి" చేరాలనే సత్సంకల్పంతో జనచైనా సాగిస్తున్న ప్రగతి ప్రస్థానాన్ని ఆ వ్యవస్థ అనేక ముఖాలుగా ఎదుగుతున్న తీరును, తనదైన భారతీయ దృష్టితో వీక్షించి చైనా(తో) ***ఇక నుంచైనా కలిసి మెలిసి వుందాం. ఇరుగు పొరుగులం కదా మనం*** అని సాహార్ధంగా, స్నేహ పూర్వకంగా సాహితీ పతాకనెత్తి పట్టుకున్నారు గోపీ. ఆయనే అన్నట్లు

దేశమేదయినా మట్టివొకటే.. ఆకాశం వొక్కటే మానవ సంస్పందనలు వొక్కటే కాకపోతే వాటి విశిష్టత మనల్ని ఆకట్టుకుంటుంది. ముఖ్య పరిశీలనల వల్ల మానవీయ మౌలికాంశాలు బోధపడతాయి.

చైనా దేశం గురించి ఇంత స్నేహ పూర్వకంగా, ఆలోచనాస్ఫూరకంగా రెండు చిన్ని పుస్తకాలు తెచ్చిన డా॥ గోపీగారికి అభినందనలు.

**(18.3.2019న చైనాలో కవితా యాత్ర ఆవిష్కరణ సభలో చేసి ప్రసంగానికి ఇది విస్తరణ)**

◆

# మేనిఫెస్టో

- శాంతయోగి యోగానంద
9652271520



రాజకీయ పార్టీలకు మేనిఫెస్టోలుండటం తప్పుకాదు
గానీ
ప్రజల సొమ్మును పందేరాలకుంచడమే తప్పు
వస్తువులకు విలువకట్టినట్టు
ఆస్తుల్ని కొనుక్కున్నట్టు
ఓటును సరుకును చేసి
రాజకీయాన్ని మార్కెట్ చేసి
వ్యాపారం చేయడమే తప్పు

ఇదొక వెలుతురుమాటు చీకటికోణం
ఆకర్షిత ఆఫర్లతో ఆశ్రితులను ఉచ్చులో పడేయడం
ప్రజల భవిష్యత్తుని అభివృద్ధిని పణంగా పెట్టడమనేది
బహు ప్రమాదకరమైన ఎర

ఆకలి నృత్యానికి చప్పట్లు కొట్టుకుంటున్న కడుపులు
అసంబద్ధ తాయిలాలకు పొలోమని పరుగెత్తుకొస్తారు
సమూహాన్ని విరగ్గొట్టి వాడుకునే క్రమంలో
పడుతున్న సుత్తిపోట్లుగా గుర్తించరు

వాళ్ళు కదిలితే వాళ్ళతో పాటు హామీలూ కదిలొస్తాయ్

వీధి కూడల్లలో నిలబడి
అధికార దాహంతో తడిసి ముద్దైన
పథకాల ఝల్లు సల్లగా పడుతున్నంతసేపు
అభివృద్ధి ఎండమావే

నీరుగార్చే విధానాలతో ఓటర్ల హృదయాలు ధ్వంసం
చేస్తున్నపుడు
ఓటు విలువ తెలిసినోళ్ళెపుడో పారిపోయారు
ఓటరుగా హృదయాల్ని వదిలి
కేవలం ఉన్నారు..నోటా కంటే ఏదో ఒక మీట నయమని

జన సామాన్యానికి వేటగాడి నూకల కథ అర్థం కానన్నాళ్ళు
నిర్మాణాత్మక అభివృద్ధికి ఏడం కావల్సిందే. ◆

---

# మినీ కవితలు

- ఆదోని అభిరామ్
7981463065





**కదలిక**

భూమి కదులుతున్నది
సొమ్మునలేక
పొగబెడుతున్న
మనుషులను చూసి

మనిషి కూడా
కదులుతున్నాడు
భూమి కదలికలకు
గీత గీసి

**పదును**

సమాజంలో
గొడ్డళ్ళకు
రాజకీయ నాయకుల నాలుకలకు
పదునెక్కువ

గొడ్డళ్ళు అడవులను తింటే
రాజకీయ నాయకుల నాలుకలు
సమాజాన్నే తినేస్తున్నాయి

**సాధనే**

ఓ వృక్షమా
నీ వేదన
అరణ్యారోదనే

నీ జాతిని
ఉరితీయడంలో
మనిషిది ఎప్పుడూ
అనితరమైన సాధనే ◆

# నాగమ్మవ్వ




- డా. చింతకుంట శివారెడ్డి
9440859872

సీకట్లోనో తెల్లారి మూడింటికి అలారం పెట్టిన గడియారం అతివిశ్వాసం కల్గిన భక్తుడు దేళంలో పొద్దాంకులు కొట్టే గంటలా మోగుతానేవుంది. 'రేయ్ అబ్బీ! అలారం మోగతాంది పడుకున్నింది సాలుగాని ఇంగలెయ్' అని పక్కన్నే నడవలో పడుకోనుండే అమ్మ అరిసి సెప్పింది. అమ్మో! పస్టుబస్సు వచ్చాదో ఏమో అని బెత్తురుపొయ్ లేచ్చి. ఏక్‌దమ్మున జాలాట్లో నీళ్లోసుకొని, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి సడ్మిషన్‌కి కావాల్సిన్నేటన్నీ బిరిబిరా సర్దుకొని, "అమ్మా! పోయొచ్చా" అని సెప్పి రోడ్డుపైకి ఎలబార్తి. తంగెడుపల్లె నుంచి పస్టుబస్సు పట్టుకొని ఎల్తేగాని తిరుపతిలో విశ్వవిద్యాలయం కాలేజి టయానికి ఎల్లడం కష్టం. అసలే ఆ బస్సు పులివెందుల కాన్నుంచి రావాల.

సీకట్లో ఊళ్లోనుంచి బాటమడ్తి నడుసుకుంటా రోడ్డుపైకి పోతావుంటే సేలల్లోకి ఇత్తనానికి పొయ్యే కాండ్లు, చెనిక్కాయపప్పుల మూటెలుండే బండ్లన్నీ సక్కంగా పోతా కనబడె. 'ఏం సంజీవయ్యా! మీరు ఏ సేలేకి పోతాంద్రు?' అని కుమారన్న అడుగుతున్న మాటలు ఇనబడతావుండె. సీకట్లో మాటలు ఇనబడతాండాయేగాని మన్సులు కనబడ్డంల్యా. దావమ్మడిదితి వచ్చే ఎద్దుల మెళ్లో కట్టిన గంటల శబ్దంతోపాటు, ఎద్దుల్ను ల్చ్, ల్చ్ అని అదిలిస్తున్న శబ్దం దూరమైనా సీకటికి శానాబాగా ఇనబడతావుండె. యిన్ని శబ్దాల నడమ సీకటిగా వుందనే ఆలోసెన కూడా తట్టకపాయ. రోడ్డుకానుకొని అందరూ ఒకచోట వరసమ్మడితి కాండ్లను నిల్పోబెట్టిరి. కాండ్లన్నీ మిలటరీ వోళ్ల క్రమసిచ్చనతో నిలబడినట్లు ఎద్దులన్నీ రెండు వర్సలుగా ఆ సీకట్లో సక్కంగా కనబడతావుండె. రోడ్డుపైనుండే రామయ్య మామ అప్పుడే బంకు తెరిసినట్టుంది. సేద్యగాళ్లకు, కూలోల్లకు కావల్సిన టీలు, బీడీలు, అగ్గిపెట్టె లాంటియన్ని తీసుకుంటా కనబడ్రి.

రోంచేపటికంతా నేను రోడ్డుపైకి సేరుకుంటి. పులివెందుల కాన్నుంచి వచ్చే పస్టుబస్సు ఎప్పుడొచ్చాదాయని సూచ్చావుంటి. ఇత్తనానికి పొయ్యేటోళ్లంతా వాళ్లకు కావాల్చినేటన్నీ తీసుకొని ఆన్నుంచి ఎల్లబారిపాయ. బంకులో ఎలిగే బల్బు, అప్పుడప్పుడు రోడ్డుపైన పొయ్యే లారీల ఎలుతురు తప్ప ఆ తావంతా మసక మసకగా సీకటిగా వుంది. కాళ్లు గుంజుతావుంటే రోంచేపు ఆ మోరీపైన కూర్చున్నామని, ఆన్నే పక్కన్నే వుండే మోరీపై కాసేపు కూలబడ్తి.

రోడ్డు పక్కన దూరంగా ఎవరో ఒక అవ్వ ఏదో యెతుక్కుంటాన్యట్టు కనబడె. అప్పుడప్పుడు వచ్చే లారీల ఎల్తుర్లో కనబడి కనబడనట్లు వుండె. ఎవరో బాగా సూసిన మన్సిలాగా అనిపించి, ఇంగరోంత తీచ్చనంగా సూచ్చి. ఆ అవ్వ నాగమ్మవ్వ అని అప్పటికి అర్థమాయ. ఇంతకీ ఏం సేచ్చాంది? ఇంత తెల్లార్జామున, సీకట్లో యేం యెతుకుతాంది. యేందన్నా

పోగొట్టుకుందేమోనని రోంత ముందుకుపోయి, అవ్వా! ఏం సేచ్చాండావ్? అని అడిగితి. ఒక్కతూరి జంకినట్లుగా లేచి, 'ఏంలేదులే నాయనా, కోళ్లకు రోన్ని బియ్యమేరుకుంటాండా' అని తడబడతా సెప్పె. నాకు రోంత అనుమానం వచ్చి ఇంతకీ ఈ అవ్వ ఈ గింజలేరుకోవడమేంది, అందులోను అయన్నీ మట్టిలో కలిసిపోయి వుండాయి. అది గూడా కోళ్లకని సెప్తాంది. నాలో నేను ఆలోసెన్లో పడ్తి. అప్పుడు నా మెదడుకు ఒక యిషయం తట్టింది... 'మాయిటాల స్టోరు బియ్యం వచ్చిన లారీలోంచి మూటెలు దించేటప్పుడు కింద పడిన బియ్యమని' నాకర్తమాయ. అవ్వ నాకు మొకం సూపిచ్చకుండా దూరంగా దాంకున్యట్లుగా యెల్లిపాయ.

నా సిన్నప్పుడు మా అబ్బ ఆయవ్వ గురించి సెప్తాండె. ఆయమ్మ, నాగమ్మ తల్లి యెప్పుడు సూసినా నుదిట్న రూపాయిబిళ్లంత బొట్టెట్టుకొని, నెత్తినిండా పూలెట్టుకొని, కొంగును భుజం సుట్టాతా సుట్టుకొని సూచ్చాండంగానే రెండు సేతుల్తో దండం పెట్టేలాగా నిండు ముత్తైదువులా ఆ సింతకుంటోళ్ల ఇంటికే కళగా వుండె. ఆమె పెనిమిటి సుబ్బిరెడ్డి అంటే సుట్టుపక్కల ఊర్లందరికీ గురి. ఏ పంచాయతీ ఐనా ఆ రెడ్డి ల్యాకపోతే సమస్య తెగేదికాదు. వాళ్లకు పూర్వం నుండే పార్టీ(ఫ్యాక్షన్)లు ఉండె. ఇంటి సుట్టూ దినామూ పనోళ్లు, సుట్టాలు గుంపులు గుంపులుగా ఉంటాంద్రి. ఆ తల్లిది శానా పెద్దసెయ్యి. ఎంతమందొచ్చినా సంగటి ముద్దలు, చెనిక్కాయ ఊరుబిండితో కడుపునిండా పెడ్తాండ్యా. ఊళ్లోవాళ్లంతా సెంబులు సెంబులు మజ్జిగ ఆ ఇంట్లోంచి తీసకెల్తా వుంద్రి. ఆ యింట్లో మన్సెత్తుండే కవ్వంతో పెరుగుబుట్టు సిలకతావుంటే ఆ తల్లి తెల్లటి అరసేత్తో ముద్దలు ముద్దలు వెన్న పక్కకు తీచ్చాండె. మనూళ్లో సుబ్బిరెడ్డి భూమంటే బాయి గడ్డన్నే జీమాను, ఒక పరందపుసెట్టు, మూడు మోటర్ల మడవ, పెద్ద పెద్ద ఉద్దులు(కాలువలు) ఆ సుట్టుపక్క పల్లెలందరికీ ఆయనే పెద్ద ఆసామి. వాళ్లు వరినాటిచ్చేటప్పుడు మల్లేకి ఎంతమంది కూలోళ్లొచ్చినా ఇంట్లోవోళ్లకి పెట్టినట్టే ఆ తల్లి సమానంగా పెడ్తాండ్యా.

ఒకతూరి బురదమల్లో దున్నేటప్పుడు ఆ తల్లి కాండ్లకోసం సంగటిగంప యెత్తుకొని మల్లేకి వచ్చె. యేరే ఊరికి పోయిన ఆమె మర్ది ఎంకటరెడ్డి వచ్చి వదినా! 'ఆకలేచ్చాంది సంగటి పెట్టు' అని అడిగితే, గంపలోని సంగటిముద్ద సేతికందిచ్చె, సిటికెలోనే ఆ యప్ప సంగటిముద్దని సలిబిండి మింగినట్టు మింగేసె. ఆ రోజుల్లో సంగటిముద్ద అంటే సుమారుగా ఒకసట్టికి సరిపడేటంత ఉంటాండేది. మళ్లీ సేయి సాపె. మళ్లీ ముద్ద పెట్టె. ఇట్లా సుమారుగా ఆరు ముద్దల సంగటి సెక సెకా తినిపాయ. దున్నేటోళ్లకు తక్కువచ్చాది. తినే మరిదిని సగం కడుపుకు పెట్టల్యాక, గబ గబా మల్లా ఇంటికొచ్చి వాళ్లకు సంగటి మల్లా గెలుక్కొని తీసకపాయ. ఇట్లాంటి ఇసయాలెన్నో ఆ తల్లి జీవితంలో మేము సూసినాము రా సిన్నోడా.

సివరగా ఒగమాట సెప్తా ఇనుకోరా అబ్బీ! 'బిటీసోళ్లకాలంలో 'యాదాళ్ల నాగమ్మ' అని ఓ తల్లి, బాగా కరువొచ్చినప్పుడు కడపలో మనోళ్లకెందరికో దినామూ పెద్ద పెద్ద అండాలతో బియ్యం ఉడికించి, తెల్లోళ్లే ఆచ్చరకపొయ్యేలా బువ్వ పెడ్తావుండె. ఓతూరి అప్పటి కడప కలెట్టరు ఆమె ఇంటిని సూడ్డానికి వచ్చి ఆ తల్లి దాతృత్వానికి సంబరపడి ఆమెను రెండు సేతుల్తో నమస్కరించినాడంట. ఆ యాదాళ్ల నాగమ్మకి మనూరి నాగమ్మతల్లి ఏమాత్రం తీసిపోదురా సిన్నోడా!' అని మా అబ్బ సెప్పిన మాటలు వర్సగా గుర్తుకొచ్చినాయ్.

ఆయవ్వను కాలం కాటేశా. ఐదుమంది కొడుకులున్యా పట్టించుకోకుండా పొయిరి. ఇప్పుడు ఆయవ్వ రోడ్డు పక్కనుండే సత్రంలో ఓ నులకమంచం, బొంత, సిరుగులపడిన రగ్గు, ఆ పక్కన కట్టెల పొయ్యి, ఒక సెంబు, బిందె ఇయన్నీ యిప్పుడు ఆ తల్లి ఆచ్చి. వాళ్ల కొడుకులు యేసే ఒడ్ల గాదెలకు(ఒడ్లు నిల్వవుండే దబ్బలతో చేసిన పెద్ద జొల్ల, ఇది సుమారు ఐదు అడుగుల ఎత్తు ఉంటుంది)ఆయవ్వ కాయలి. సత్రంలోనే ఓ మూలనుండె ఒక గదిలో ట్రంకుపెట్టెలో గుడ్డలు పెట్టుకొని, యెవ్వరన్నా యిచ్చిన సిల్లర లెక్క పెట్టెలోనే ఓ పక్కన దాచిపెట్టుకొని సంబరపడే అల్ప సంతోషి. అందరున్యాకూడా ఆ యవ్వ ఒంటరి జీవితం గడుపుతావుండె. ఇప్పుడు నాకు బాగా అర్థమయ్యింది....'ఆయవ్వ బియ్యం ఏరుకుంటాంది కోళ్లకోసం కాదు, ఆయవ్వకోసం ఒక పిడస ఉండికించుకోడానికని'.

ఆలోసెన్లో వుండంగానే పులివెందుల నుంచి వచ్చే పస్టు బస్సు రానేవచ్చె. ఆలోసెన్లో నుండి ఒక్కతూరి బస్సు హారన్ ఇనపడి బస్సు ఎక్కితి. బస్సు ఎక్యానో లేదో బస్సు వాకిల్లోంచి ఆ యవ్వ యాపక్క ఉందోనని సూచ్చి. దూరంగా మిద్దె సాట్న ఆ యవ్వ బియ్యాన్ని ఏరుకుంటానే కనబడె. బాగా బతికిన ఆ యవ్వకు యేగతి పట్టె అని మనసంతా బాధతో నిండిపాయ. మన్సిని మాత్రం బస్సులో కూసున్నానేగాని, మెదడులో ఆ యవ్వ ఆలోసెన్లన్నీ మెదుల్తావుండె. కడపకు టికెట్ తీసుకొని సీట్లో కూచొని, మనసంతా భారంగా తల యెనక్కి వాలిస్తి.

◆




అడిగోపుల వెంకటరత్నమ్

# బ్రతుక్కి భరోసా యిచ్చే కవిత్వం

- పొన్నూరు వెంకట శ్రీనివాసులు
9440432939

సుప్రసిద్ధ కవి అడిగోపుల వెంకటరత్నమ్. ఈయనకి కష్టజీవులంటే ప్రేమ, వాళ్ళ కన్నీళ్ళు తుడవాలనే ఆర్తి, వాళ్ళని అక్కున చేర్చుకొని ఓదార్చాలనే తపన ప్రతి ఖండికలో కనిపిస్తుంది. కలం పట్టాడో కరవాలం అవుతుంది. అక్షరాలు అగ్నిని రగుల్చుకొంటాయి. ప్రతి మాట తూటాగా పేలుతుంది. "పదండి ముందుకు" అంటూ ఈ కవి ఎక్కడికి తీసుకెళుతున్నాడు. కష్టాలు లేని సమాజంలోకి. కన్నీళ్ళు లేని సమాజంలోకి. అస్పృశ్యతలు లేని సమాజంలోకి. నిత్యం ఆనందం వెల్లివిరిసే సమాజంలోకి. ఆయన కోరుకునే సమసమాజంలోకి తీసుకెళుతున్నాడు. స్వాతంత్ర్యం వచ్చి డెబ్బై వసంతాలు అయినా కులాలు, మతాలు, ప్రాంతాల అంతరాలతో విడిపోయిన సమాజాన్ని ఒక కవి బాగుచేయడం సాధ్యమేనా... అంటే సాధ్యమే అనిపిస్తుంది అడిగోపుల కవిత్వం చదువుతుంటే. ఊసుపోక ఒక్క అక్షరం రాసినట్లు అనిపించదు. మట్టిమనిషికి కట్టిన అక్షరాల పొదరిల్లులా అనిపిస్తుంది. సమాజాన్ని నిశితంగా పరిశీలించే కవి. సంఘటనని స్కానింగ్ చేసే కవి. కూర్చొన్నా.. నించున్నా.. ప్రయాణిస్తున్నా... కవిత్వమై కదిలినట్లనిపిస్తుంది ఆయన కవిత్వం చదువుతుంటే. 'తులాభారం' కవితలో "పెళ్ళి తులాభారం అయ్యాక/ పెళ్ళికూతుళ్ళందరూ సత్యభామలే / అమ్మాయి ఆభరణాలు మొయ్యలేక/ నిల్చి వుంది/ ఎండిన కడుపులతో పండుకున్న పనివాళ్ళ ఆకలి/ ఎత్తిన విస్తళ్ళకే తెలుసు" అంటాడు- పెళ్ళి తంతు ఆర్భాటాలను తూర్పారపడుతూ. కష్టాలలో ఉన్న వారి కన్నీటిని తన కవిత్వంతో తుడుస్తాడు. అందుకే ఆయన కవిత్వంలో మనిషి మూలాలు కనిపిస్తాయి. కన్నీళ్ళలో ఆనందాశ్రువులు, దుఃఖాశ్రువులు గుర్తించ వచ్చంటాడు. "అశ్రువులన్నీ ఒక్కటి కాదు" కవితలో "భూమిలో యింకిన / ఒకానొక అశ్రువు భూకంపం పుట్టిస్తుంది/ భూమిపై పారిన/ ఒకానొక అశ్రువు బృందావనం సృష్టిస్తుంది" అంటూ కన్నీటిని కవిత్వం చేస్తాడు.

నేడు వృద్ధాప్యం శాపంగా మారింది. ఎంతో ప్రేమతో పెంచుకున్న పేగు బంధం అనాధాశ్రమాల పాలు చేస్తుంది. ఆత్మీయ స్పర్శకోసం, మాలిమి చూపుకోసం ఎదురు చూసే వృద్ధాప్యం గురించి "బోధివృక్షం" "ఆత్మీయ స్పర్శ" కవితల్లో "నా యవ్వనం నీ రూపాన్ని ప్రసవిస్తే/ నీ యవ్వనం నాకు వెలివేతను ప్రసాదించింది/ వృద్ధాప్యం జాడను చూసి/ అనాధాశ్రమం అక్కున చేర్చుకుంది" అని ఆవేదన చెందుతాడు. మూన్నాళ్ళ ముచ్చటవుతున్న మూడుముళ్ళ బంధాన్ని చూసి ఎడమొహం పెడమొహం అవుతున్న ఏడడుగుల బంధాన్ని చూసి కలత చెందిన కవి "దారి దారులయ్యాక" కవితలో

## పొగమబ్బుల సాక్షిగా

- సి.యస్ రాంబాబు
9490401005

బ్లాక్ అండ్ వైట్ మూవీలా
అంతులేని కథనేదో చెబుతోంది ఆకాశం
ఆవులిస్తూ ఏకైక శ్రోత సూరీడు
తొంగిచూసే చందమామలా
వచ్చిపోతున్నాడు...

మునిమునిగా మార్గశిరం
శిరసొంచిన పుడమిపై
సొగసులేవో అద్దుతోంది
ఊసులను ఊయలచేసి...

ఎండపొడతగలని నగరం
కళ్ళుతెరవక బద్ధకంగా
నేలమ్మనే అంటిపెట్టుకునుంది




నవ్వుతూ భానుడు మబ్బుచాటుకు
జారుకుంటున్నాడు...

హేమంతమే అంత సిగ్గుతో నవ్వుతుంది
కాస్త అల్లరిని కలిపి కనుచూపుమేర
చిలిపి తలపులను లిఖిస్తూ ఉంటుంది
మారాంచేసే మనసు తలుపుల మీద...

తీపి గురుతుల హేమంతంతో
శిశిరానికి సిద్ధమయే మనసుకు
కిరణాల మాలకడుతూ ఉదయభానుడు
పొగమబ్బు నిచ్చెనేసుకుని
భువినుంచి దివికి ధీమాగా దిగకమానడు.... ◆

---

"ఒకే దారి రెండుగా చీలిన చోట/ యిప్పుడు వాళ్ళిద్దరూ నిల్చున్నారు/ అతని చూపు ఘనీభవించింది/ ఆమె చూపు ద్రవీభవించింది/ పుణ్యభూమిలో పురుషుడు కథ నడుపుతాడు/ కర్మభూమిలో స్త్రీ కథలో నడుస్తుంది" అంటూ రెండు జీవితాల కథను ఆవిష్కృతం చేస్తాడు.

ఈ లోకంలో తాను పండించిన పంటపై పేరు రాసుకోలేని పారిశ్రామిక వేత్త రైతు. తను పండించిన పంటకు రేటు నిర్ణయించుకోలేని పెట్టుబడిదారుడు రైతు. రైతుల కష్టాలను కళ్ళకు కడుతూ "కర్షకుడి కంట కన్నీరు" కవితలో "గడ్డకట్టిన అప్పులను కరిగించే ఎత్తుగడలో/ టమోటో సాగుచేస్తే / విరగబడ్డ దిగుబడికి/ నల్లరేగడి ఎర్రగా మారింది/ కోత కూలి నష్టమైంది/ ఉల్లిని సాగుచేస్తే/ తులాభారం తేలికై/ కొయ్యకనే ఉల్లిపాయలు/ రైతు కంట కన్నీరు కారుస్తున్నాయి/ కర్షకుడి కంట కన్నీరు / దళారి యింట పన్నీరు" అవుతుందని కన్నెర్ర చేస్తాడు. ఆధునిక యుగంలో కూడా ఆడవాళ్ళు హక్కుల కోసం పోరాటాలు చేయవలసి వస్తుంది. పురుషాధిక్య సమాజాన్ని నిలదీస్తుంది. ఆకాశంలో సగం కావాలని నినదిస్తున్నారు. "ఆకాశంలో సగం" కవితలో "అర్ధాకాశాన్ని ఆక్రమించే ఎత్తుగడలో/ మా వారి దౌర్జన్యాలు హింసలు/ విరామం లేని యుద్ధాలు/ యుద్ధం నింగి నేలను జయిస్తుంది / మనిషి మనసును జయించదు/ యుగాల చరిత్రలో జగాన తీర్పు యిది" అని మనసును జయించని మగజాతి ఎందుకని ప్రశ్నిస్తాడు. ఇలా చెప్పుకుంటూ పోతే దగాపడ్డ ప్రతి వారికి కలం పట్టుకొని బాడీగార్డులా కనిపిస్తాడు. వెలుగు దివిటీ పట్టుకొన్న అక్షర సైనికుడిలా కనిపిస్తారు అడిగోపుల. అరవై కవితల్లో అనంతమైన పదచిత్రాలు పరుచుకున్నాయి. మచ్చుకి "దేశం నాదే/ నా దేశానికి నేనేం కాను", "పడవ రెండు ముక్కలుగా కోస్తుంటే/ నీటికి కుట్లేసుకుంటూ/ నది ప్రకృతి వైద్యం చేసుకుంటుంది" "నడిచిన దూరమే గమ్యం కాదు/ ఎగరేసిన నాణెమే ఎత్తుకాదు/ పాడిందే పాట కాదు/ రాసిందే రచన కాదు" "నిండా మునిగితే చలి లేదని/ బండరాళ్ళు నీటిలో మునిగాయి" "అంతవరకు యాజమాన్యం ముందు / ఓర్పుగా నిలిచిన అరచేయి/ పిడికిలి బిగించి ప్రశ్నిస్తుంది / నినదిస్తుంది / ఉద్యమాల స్వర్గం పిడికిలిలో వుంది."

ఆయన "పదండి ముందుకు" అని పద్యం మొదలెట్టాడు సముద్రం చూస్తుంది. ఈ అక్షర ఘోషకు ఎందరు కదలి వస్తారని. ఒడ్డున పడివున్న బతుకుల్ని ఏరు కొంటారని. పోరాడితే పోయేదేమీ లేదు బాని సంకెళ్ళు తప్ప. అడిగోపుల వెంకటరత్నమ్ ఆశించిన సమసమాజం కోసం ముందడుగు వేద్దాం. పోయేదేమీ లేదు. కన్నీళ్ళు తుడిచి, భరోసా యిచ్చే కవిత్వాన్ని చదువుదాం.

◆

# అదంశనీయం

- కవితశ్రీ
9494696990



పీత కష్టాలు పీతకే తెలుస్తాయి
సీత కష్టాలు సీతకే తెలుస్తాయి
నా నొప్పి నువ్వు భరించడం
ఎలా కుదురుతుంది?
నా మూలుగు నువ్వు మూల్గడం
ఎలా సాధ్యం?
నా ఏడుపు నువ్వేడడం
అదెలా అవుతుంది?
నా గురించి
నువ్వెంత కన్నీరు కార్చినా
అది మొసలి కన్నీరే అవుతుంది
నా అస్తిత్వాన్ని నిలపడానికి
నా హక్కుల సాధనకు
నువ్వెలా నాయకుడయ్యావు?
సకృత్తుగా నేను నాయక స్థానంలో ఉన్నా
నువ్వు నిలిపిన ఆటబొమ్మలా ఉన్నాను
నువ్వాడించిన తోలుబొమ్మలా ఆడాను
నేను సంతకాన్నైతే
నువ్వెలా సర్పంచివయ్యావు?
నన్ను రబ్బరు స్టాంపును చేసి
నువ్వు శాసనాలు చేశావు ఎలా?
నాయకత్వం! హు?
నువ్వు నాకు కట్టబెట్టడం కాదు
నీ దయాభిక్ష నా కక్కర్లేదు
నన్ను ఉద్ధరించెయ్యాలని
నీకంత ఇదిగా ఉంటే
నీకంత ఉబలాటమే ఉంటే
నాకై నేను నాయకత్వం వహించిన నాడు
అప్పుడు అప్పుడు నాకండగా నిలబడు
నా ప్రయోజకత్వానికి కాకుండా
నీ ఆర్భాటానికి
నీ సిద్ధాంత సంస్థాపనా సామర్థ్య
ప్రదర్శనకు
నన్ను పావులా వాడుకుంటున్నావు
ఎందుకు?
పైగా నువ్వరమరల్లేని అపర ప్రేమికుడిలా
అసమాన సానుభూతిపరుడిలా
పోజులిచ్చేస్తున్నావేం బాబు?
ఇలా నవరసాల్ని పండించడం
నీకే సాధ్యమయింది అనుకుంటాను
నీకే గనక చిత్తశుద్ధే ఉంటే
శతాబ్దాల పోరాటాల తర్వాతా
నేను నాక్కాకుండా పోయానెందుకు?
నా రాజ్యం నాకింకా చెందలేదెందుకు?
నా స్వయం పోరాటంతోనో
నీ అండదండలతోనో
రేపొద్దున్నే నాకే గనక రాజ్యం వస్తే
దాన్నీ నా నుండి లాగేసుకోవని
హామీ ఏంటి నా హితైషీ?
నన్ను కరివేపాకులా తీసి పారెయ్యవని
నన్ను డమ్మీని చేసి
నువ్వు పెద్దన్న పెత్తనం చెలాయించవని
నీ మగసిరికి మెరుగులు దిద్దుకోవని
గ్యారెంటీ ఏంటి నాయనా?
అందుకే నాలో నేననుకుంటున్నా
పీత కష్టాలు పీతకే తెలుస్తాయి
సీత కష్టాలు సీతకే తెలుస్తాయి
నాకు బాగా తెలుసు
నా మాటలు నిన్ను బాధించుంటాయి
ఇంక నీకు నా భావజాలం అదంశనీయం ◆




# కొత్తపేట కళాసాహితి ఆవిర్భావ వికాసాలు

- గిడ్డి సుబ్బారావు
9959335876

సాధారణంగా ఉగాది అనగానే పెద్దలు కొందరు చేరి, పండితులతో పంచాంగం చదివించుకొని, రాశిఫలాలు తెలుసుకొని, ఉగాది పచ్చడి పంచి, ఆనందించడం - గ్రామ గ్రామాన ఈ దృశ్యాలే మనకు కనిపిస్తాయి. ఉత్సాహవంతులైన యువకులు ఆ గ్రామంలోని సాహితీపరుల్ని పోగుచేసి, ఏవో కొన్ని కవితల్ని వినిపింపచెయ్యడం కొసమెరుపుగా వుంటుంది. ఎవరెవరు ఎక్కడ ఏంచేసినా ఆ ఒక్క రోజే. కానీ తూర్పుగోదావరి జిల్లాలోని మండల కేంద్రం కొత్తపేటలో మూడు దశాబ్దాలుగా నడుస్తున్న సాంస్కృతిక సంస్థ కళాసాహితి అందుకు భిన్నంగా, కవిత్వం, కళలే ప్రాణంగా నడుస్తూ కోస్తా జిల్లాలోని కవులకు ప్రేరణకేంద్రంగా, ఆకర్షణ శక్తిగా నిలవడం ఒక విశేషం. అన్ని గ్రామాలలో ఉగాదినాడు ప్రభుత్వ, ప్రజల కవి సమ్మేళనాలు వుంటాయి కనుక, ఆయా ప్రాంతాల కవులు, కొత్తపేటకు రావడానికి వీలుగా, ఉగాది తర్వాత వెంటనే వచ్చే ఆదివారం సాహితీ సభ, కవిసమ్మేళనాలు రోజంతా నడిచే ఏర్పాటు జరగడం, కొత్తపేటకే దక్కిన ప్రత్యేకత. దాదాపు వందమంది కవులు, కళాకారులు ఎప్పుడెప్పుడా అని ఎదురు చూసే కవితోత్సవం అది.

కళాసాహితి ఆవిర్భావం రాజకీయ చాణుక్యుడు, గాంధేయవాది ఎం.వి.ఎస్. సుబ్బరాజుగారి పూనికతో జరిగింది. అదెలాగంటే, జి.సుబ్బారావు అనే నేను తపాలాశాఖలో కార్మికుడిగా, కార్మిక సేవకుడిగా, కవిగా వుండటం తెలిసిన కోట్ల కృష్ణమూర్తిగారే రోటరీ క్లబ్ పెద్ద, ఆ క్లబ్ ద్వారా నన్ను ఒకసారి కార్మిక సేవకుడిగా, మరొక సారి కవిగా సన్మానించే ఏర్పాటు చేసారు. కవిగా సన్మానం అందుకొన్న నేను అక్కడవున్న రోటరీ పెద్దలు సుబ్బరాజు గారు, కాత్యాయన శర్మగారు, ఆడిటరు గారు వంటి వారి ముందు ఇక్కడ ఒక సాంస్కృతిక సంస్థ వుంటే బాగుంటుందనే ప్రతిపాదనను వుంచాను. అంతకు కొన్ని దశాబ్ధాల ముందు స్థానిక హైస్కూల్లో వేదుల వెంకట్రావు గారనే పండితుడు వెదజల్లిన సాహితీ వెలుగుల్ని గుర్తుకు తెచ్చుకొని, వెంటనే నా ప్రతిపాదనను అంగీకరించారు. దానితో పెద్దలు సుబ్బరాజుగారు గౌరవాధ్యక్షులుగా, ఆడిటరు గారు అధ్యక్షులుగా, కాత్యాయన శర్మగారు ఉపాధ్యక్షులుగా, కోట్ల కృష్ణమూర్తిగారు కార్యదర్శిగా, కళాకార్ నల్లా సత్యనారాయణ మూర్తిగారు ఆర్గనైజింగ్ సెక్రటరీగా కొత్తపేట కళాసాహితి ఆవిర్భవించింది.

1989లో శుక్ల ఉగాది రోజున స్థానిక ఆర్యవైశ్యవర్తక సంఘభవనంలో ఏర్పాటు చేయబడిన సాహిత్య సభ, కవి సమ్మేళనం వైభవంగా, సర్వాంగసుందరంగా రోజంతా పూరించిన ఉత్సాహంతో జరిగింది. సాహితీ సభలకు, కవిసమ్మేళనాలకు అధ్యక్షునిగా నిరంతర సాహితీసంచారి, నిత్యయౌవనుడు నాకు అత్యంత ప్రియతములు అద్దేపల్లి రామమోహనరావుగారు వ్యవహరించారు. అందులో జిల్లాకు పరిమితం చేసి రప్పించబడిన 30 మంది కవుల కవితల్ని వినిపింపజేసి, వారందరినీ శాలువాలతో, జ్ఞాపికలతో దారి ఖర్చులతో సన్మానించడం జరిగింది. కవిమిత్రుడు ఎస్.ఆర్. పృథ్వి శాంతి పవనాలు' అనే కవితా సంకలనాన్ని ఆవిష్కరింపజేసారు. పెద్దాపురం నుండి వచ్చిన పండితులు పంపన సూర్యనారాయణగారు వేదుల వారి కవితావైభవాన్ని, అద్దేపల్లి వారు శ్రీశ్రీ కవిత్వము, సమాజమూ వివరించగా, ఇతర పండితులు, పెద్దల వివిధ విషయాలపై మాట్లాడారు. ఆ తర్వాతి సంవత్సరము ఆ తదుపరివత్సరమూ ఉగాది రోజునే సమ్మేళనాలు జరిగాయి. కవులసంఖ్య, అద్దేపల్లివారి

ఉత్సాహమూ పెరుగుతూ రావడం, అయ్యో అద్దేపల్లి వారి ముందు కవిత్వం చెప్పలేకపోయామే అనే బాధను కొందరు రాలేకపోయిన కవులు వ్యక్తపరచడంతో, కొత్తపేట ఉగాది సభ, ఉగాది తర్వాత వచ్చే ఆదివారానికి మార్చబడింది. 30 మంది కవులతో ప్రారంభమైన సమ్మేళనం వందకు చేరింది. కొత్తపేట కవిసమ్మేళనం ప్రత్యేకత, కవుల స్థాయి, ఇవ్వబడుతున్న ఆతిధ్యం అద్దేపల్లి వారి ద్వారానే రాష్ట్రమంతా ప్రాకింది. సుబ్బరాజు గారి సౌజన్యంతో వేదిక వారి స్వగృహ ప్రాంగణం 'ఏరువాక' కు మార్చబడింది. కవి సమ్మేళనాలతోబాటు కృష్ణశాస్త్రి శతజయంతి, శ్రీశ్రీ శత జయంతి, కరుణశ్రీ, జాషువ కవుల కవిత్వంపై కవిత్వంలో మానవత్వం - వంటి అనేక విషయాలపై సింపోజియంలు, ద్వానా శాస్త్రి, రెంటాల వంటి విమర్శకుల ఉపన్యాసాలు కవిత్వంతో సమానంగా ఆకట్టుకునేవి. గ్రంథావిష్కరణలు ఇక్కడ మరో ఆకర్షణ. బుద్ధుని సంపూర్ణ జీవిత చరిత్రను 'తధాగతీయం' పేరుతో ఉద్గ్రంధంగా వెలయించిన గ్రామపెద్దలు అద్దంకి కేశవరావుగారి గ్రంథావిష్కరణ అవకాశం వారి తనయులు, కవి అద్దంకి బుద్ధ చంద్రదేవ్ కళాసాహితికి ఇవ్వడంతో బేతవోలు రామబ్రహ్మంగారు గాడేపల్లి కుక్కుటేశ్వరరావుగారు వంటి ఉద్దండుల నిర్వహణలో జరగడం ఒక చారిత్రక ఘట్టం.

ఒక కవితో ప్రారంభమైన కొత్తపేట కవుల సంఖ్య ఈ రోజు డజను వరకూ పెరగడం నిర్వాహకులు అందిస్తున్న ప్రోత్సాహాన్ని కవులు అందిపుచ్చుకోవడమే కారణం. శ్రీకాకుళంనుండి గుంటూరు వరకూ కవులు తరలిరావడం నా ప్రయత్నం, అద్దేపల్లి ఉత్సాహం, ఆస్థాన శిల్పి రాజ్‌కుమార్ వుడయార్‌గారి సౌజన్యం, కాంతి భారత ప్రియదర్శిని, తదితర విద్యా సంస్థలు, కవి గౌస్ గారి మిత్రులు ప్రసాద్ వంటి వారి ఆర్థిక తోడ్పాటు కారణాలు గ్రంథావిష్కరణలు ఎక్కువ కావడంతో బుద్ధవిజయం, బుద్ధజయంతి, (అద్దంకి కేశవరావు గారివి) భగ్వాన్ గారి "చంద్ర వర్షం" వంటి ఆవిష్కరణ సభలు విడిగా పెడుతున్నాము.

మిత్రుడు పృథ్వి తన మామగారి పేరు మీదుగా అందిస్తున్న సాహితీపురస్కారాలు సంస్థకు మరింత శోభను తెచ్చిపెడుతున్నాయి. సుబ్బరాజుగారి నిర్యాణానంతరం కాత్యాయనశర్మగారు గౌరవాధ్యక్షులుగా కొనసాగారు. వారూ కాలధర్మం చెందారు. మా అధ్యక్షులు పి.హరిహరదేవాంశరాజు గారు మంచి ఉత్సాహంతో సంస్థను నడిపిస్తున్నారు. ఇంటింటికీ తిరిగి అమ్మాయి పెళ్లి పిలుపులందజేసినట్లు కళాసాహితి ఆహ్వానాలివ్వకపోతే నాకు తృప్తిగా వుండదు. వచ్చిన వారినందరినీ నల్లా మాస్టారు స్వాగతించగా, నేను భుజంమీద చెయ్యేసి స్పర్శానందం పొందుతుంటాను. కళాసాహితి కొత్తపేటకే పరిమితం కాకుండా స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలను చెరుకు మిల్లిలో నిర్వహించి, కవి సమ్మేళనాలకు రానూ పోనూ కవులను చేర్చే ఏర్పాటు చేసింది. జి.పెదపూడిలో సుబ్బరాజుగారు నిర్మించిన రైతు కుటీరంపై ద్వానా శాస్త్రి గారితో కవిత్వంలో రైతు 'ఉపన్యాసం' కవి సమ్మేళనం ఏర్పాటు చేసింది.

2013లో మా సంస్థ రజతోత్సవాలను జరుపుకున్నప్పుడు మా సభ్యులు, అభిమానులు భారీఎత్తున ఏర్పాట్లు చేసి, నాకు సప్తతి నిర్వహించడం, నాపై ప్రత్యేక సంచిక తేవడం నా జీవితంలో మరుపురాని మధుర ఘట్టం. ఇప్పటివరకూ నేను తెచ్చిన మూడు కవితా సంపుటాలు, రెండు సమీక్ష, విమర్శ గ్రంథాలు కళాసాహితి కార్యక్రమాలలోనే జరగడం విశేషం. ఆయా గ్రంథాల ముద్రణ భారం వహించిన గూటం స్వామికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

ముప్పై ఒక్క సంవత్సరాలుగా కళాసాహితిని నడపడం నా ఒక్కడి వల్లనే కాలేదు. ఏడు జిల్లాలనుండి కవుల రాక ఇచ్చిన ఉత్సాహం వల్ల, మా అధ్యక్ష, కార్యవర్గ సభ్యుల వల్ల, ఇంతకాలం వేదిక నిచ్చిన రోటరీ క్లబ్ సహకారం వల్ల సాధ్యపడింది. కేశవరావు మాస్టారి శతజయంతి సందర్భంగా ఈ ఉగాదికి వారి అబ్బాయి బుద్ధుడు మాస్టారికి అభినందనలు. ఎన్నో సంవత్సరాలుగా క్రమం తప్పకుండా వస్తున్న, కాకినాడ, యానాం, ముమ్మిడి వరం రాజమండ్రి, అమలాపురం, కోనసీమలోని ఇతర ప్రాంతాల కవులకు అభినందనలు. కాకినాడలో సాహితీ స్రవంతి వచ్చిన తర్వాత కవులకు మరింత ఊపు వచ్చింది. వారు వాహనాలపై తరలివస్తున్నారు.

అద్దేపల్లి వారితో నాకున్న నలభై ఎనిమిదేళ్ల సహచర్యం వల్ల ఆయన 27 సంవత్సరాలు ఏకధాటిగా కవిసమ్మేళనాలను, సాహితీ సభలను నిర్వహించారు ఆయన దూరమవడం వ్యక్తిగతంగా నాకు, సంస్థగా కొత్త పేట కళాసాహితికి, రాష్ట్రవ్యాప్తంగా నడుస్తూ వున్న ఎన్నో సాహితీ సంస్థలకు తీరనిలోటు. ఇది ఒక నిత్య యౌవనుడి అకాలమరణం.

సుబ్బరాజుగారి కారణంగానే మహాకవి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, రచయిత మహీధర రామమోహనరావు, డా॥ బెజవాడ గోపాలరెడ్డి, కాళోజి, ఆరుద్ర, వంటి ఎందరో పెద్దలు కళాసాహితిని దర్శించారు. ఇది చరిత్రల చరిత్ర ◆

# స్వీకారం

## అద్వంద్వం కవిత్వం

**శ్రీరామ్**

వెల : 100/- పేజీలు: 92

ప్రతులకు : 99963482597



ఇతని కవిత్వమొక యుద్ధశకటం. ఇతని వాక్యం మరఫిరంగి. ఇతని పదం మందుగుండు సామాగ్రి. మళ్లీ చెపుతున్నా, ఇతను పదాలను ఎర్రవాగులో నానేసి, పెంచుతూ, వొలుస్తూ, తొలుస్తూ పేనుతున్నాడు. ఈ కవిత్వం తాడు ఎవరిమెడకో వేళ్లాడుతుంది. ఇతనివి తలారిచేతులు. ఉరితీయాల్సిన వాటిని జాబితీకరిస్తున్నాయ్.

**- సీతారాం**

## గాయపడ్డ విత్తనం కవిత్వం

**ఈ. రాఘవేంద్ర**

వెల : 80/- పేజీలు: 100

ప్రతులకు: 9494074022




ఈ కావ్యంలో ముప్పైఏడు కవితలున్నాయి. ఇప్పటికి రాఘవేంద్ర కవిగా పండించిన పంట ఈ కావ్యం. ఈ కవితలన్నీ చదివితే ఈ కవికి ఒక సామాజిక సంవేదన బలంగా ఉందని తెలుస్తుంది. ఈయన కవిత్వంలో వర్తమానమే వస్తువు. అనంతపురం జిల్లా కరువు నుండి సిరియా మారణకాండ దాకా ఈయన కవిత్వం విస్తరించింది.

**- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి**

## భూమిక

సుధామ- పీఠికలు - ముందుమాటలు

సంపాదకులు: **అల్లంరాజు ఉషారాణి**

వెల : 300/- పేజీలు: 470

ప్రతులకు: 9849297958




ఇవి సుధామ గారి పీఠికలు, ముందుమాటలు. ఈ సంకలనంలో కవిత, కథ, వ్యాసం, నవల, నాటకం, కార్టూన్, గళ్ళ నుడికట్టు ఇలా అనేక ప్రక్రియలలలో వచ్చిన గ్రంథాలకు ఆయా కవులు, రచయితలు, సాహిత్యకారులు సుధామ గారిచేత రాయించుకున్న పీఠికలు, ముందుమాటలు ఉన్నాయి.

**- అల్లంరాజు ఉషారాణి**

## బంగోరె జాబులు

సంపాదకులు:

**డా॥ కాళిదాసు పురుషోత్తం**

**డా॥ మాచవోలు శివరామప్రసాద్**

వెల : 150/- పేజీలు: 168

ప్రతులకు: 9000642079




బంగోరె జ్ఞాపకాలు ఆత్మీయుల్లో, పరిచయస్థుల్లో, బంధువుల్లో ఇంకా పచ్చగానే ఉన్నవి. నింగిదాకా నిప్పులు చెరిగే అగ్నిపర్వతం లాంటి తనే "యీ అంధకారంలో నాకు కనపడే చిన్న నక్షత్రం మీరు" అంటూ నిరాశగా ఒక మిత్రునికి రాస్తాడు. బంగోరె వ్యక్తిత్వం, తప్త, ఆర్ద్రహృదయం, అతని పరిశోధనలు, కృషి, అతని బౌద్ధిక జీవితం, అతడు నడిచిన దారి ఈ జాబుల్లో రేఖామాత్రంగా వ్యక్తమయినా మా ప్రయత్నం సఫలమైనట్లే.

**- కాళిదాసు పురుషోత్తం**

## శ్వేత గులాబితోట

**డా॥ ఈదూరు సుధాకర్**

వెల : 80/- పేజీలు: 100

ప్రతులకు : 9491414007




విన్నది విన్నట్టు, కన్నది కన్నట్టు, అనుకొన్నది అనుకొన్నట్టు క్షణాల్లో కవితారూపం ధరించడం కొత్త కవిత్వానికి గొప్ప అలంకారం. ఎండా వానా, గాలీ వెలుతురూ, చెట్టూ పుట్టా ఎంత సహజాలో కవిత్వమూ అంత సహజంగా ఆప్యాయంగా మనిషిని స్పృశించడం ఆధునిక కవితా లక్షణమన్పిస్తుంది. సుధాకర్ కవిత్వంలోనూ ఇదే మనం చూడొచ్చు. సుధాకర్ వృత్తిరీత్యా వైద్యుడు. రోగి నాడిని ఎంత మెళకువగా పట్టుకోగలడో సమాజపు నాడిని కూడా అంతే ఒడుపుగా పట్టుకొన్నవాడు.

**- విరవు బాలసుబ్రహ్మణ్యం**

## నాన్న పచ్చి అబద్ధాల కోరు

**కవిత్వం**

**సురేంద్ర రొడ్డ**

వెల :120/- పేజీలు: 96

ప్రతులకు: 9491523570

స్వచ్ఛమైన భాష, సంక్లిష్టత లేని వాక్య విన్యాసం, అస్పష్టత అయోమయానికి గురిచెయ్యని భావుకత, నిర్మలమైన మనసు నుండి జాలువారిన మార్మిక కవితా నిర్మాణ దక్షత, ఆత్మ న్యూనత కనిపించని అభివ్యక్తి నవ్యత సురేంద్ర రొడ్డ కవిత్వానికి పరిమళ మద్దింది.

**- బిక్కి కృష్ణ**

## లయతప్పిన గుండె కథల సంపుటి



యస్.డి.వి. అజీజ్

వెల : 100/- పేజీలు: 108

ప్రతులకు: 9133144138

పాలెగాడు, తెరిణెకంటి ముట్టడి, బుడ్డా వెంగళరెడ్డి, గులాం రసూల్‌ఖాన్ వంటి చారిత్రక నవలలు రాసిన రచయిత యస్.డి.వి. అజీజ్. లయతప్పిన గుండె కథల సంపుటి వెలువరించారు. పదిహేను కథల సమాహారం ఈ పుస్తకం. సరళమైన పాపులర్ శైలిలో నడిచే కథలు పాఠకుడిని ఆసక్తికరంగా చదివిస్తాయి. వాస్తవిక జీవిత అవగాహన కథలన్నింటా విస్తరించుకుని కనపడుతుంది.

## తెలుగు సాహిత్యంలో ఆత్మకథలు



ఆప్కారి సూర్యప్రకాష్

వెల : 150/- పేజీలు: 176

ప్రతులకు: 9848506964

ఆత్మకథలన్నీ ఈ వేగ యుగంలో చదివే సమయం లేదు కనుక ఈ పుస్తకం చదివి ఆత్మకథల సారాంశాన్ని 'కొండ అద్దమందు కొంచెమై ఉండదా' అన్నట్టు, అద్దంలో ఆకాశం చూడవచ్చు. ప్రభువెక్కిన పల్లకి గురించి కాక, సామాన్యుని జీవితం తెలుసుకోవడానికి, చార్మినార్ నిర్మాణంలో రాళ్ళెత్తిన కూలీల జీవితాలలోని కడగండ్లను తెలుసుకోవడానికి ఈ పుస్తకం దోహదం చేస్తుంది.

- ఆప్కారి సూర్యప్రకాశ్

## సాలోచన సాహిత్య వ్యాసాలు



అప్పిరెడ్డి హరినాథ రెడ్డి

వెల : 100/- పేజీలు: 300

ప్రతులకు: 9963917187

2004 నుండి 2018 సంవత్సరాల మధ్య రాసిన సాహిత్య వ్యాసాలు మరియు సాహిత్య సదస్సులలో సమర్పించిన పత్రాలను ప్రస్తుతం 'సాలోచన' పేరున ఈ పుస్తకం ప్రచురిస్తున్నాను. ఇందులో నలభైఆరు వ్యాసాలున్నాయి. వీటిలో నలభైఒక్క వ్యాసాలు ఇదివరకే వివిధ పత్రికలలో ప్రచురితమయ్యాయి. మిగతా అయిదు వ్యాసాలను కూడా ప్రచురణకోసం పత్రికలు స్వీకరించాయి.

- డా॥ అప్పిరెడ్డి హరినాథ రెడ్డి

## అంతరంగం కవిత్వం



బగ్గాం స్పందన

వెల : 100/- పేజీలు: 55

ప్రతులకు: 9490461596

కవితల్లో, కవితా శక్తి సామాన్యం అనుకున్నా తాత్విక ఊహాశక్తి అసామాన్యంగా వుందనటంలో అతిశయోక్తి లేదు. ఈ కవయిత్రికి 'కవితాంతరంగం' బోధపడింది. కవిత్వ శాస్త్రంలోని కొన్ని మెలుకువలు యింకా పెంచుకోవలని వుంది. మాత్ర, లయ, పదవినియోగం ప్రస్తుతం బీజరూపంలో వున్నాయ్. కొంచెం కృషి చేస్తే రెండవ కావ్యం నాటికి 'స్పందన' తెలుగు వారికి తెలియవలసిన అవసరం వస్తుంది.

- చందు సుబ్బారావు

## పూనాలో పూచిన నానీలు



సీతా సుధాకర్

వెల : 100 పేజీలు: 83

ప్రతులకు: 09765390399

'పూనాలో పూచిన నానీలు' పూచింది ఆమె హృదయంలోనే అయినా పూనా భౌగోళిక, చారిత్రక, అనుభవిక పరిసరాల్లో పుట్టడం వల్ల అవి 'పూనా నానీలయ్యాయి. పూనాలోని జన స్వభావం, యాంత్రికత, ట్రాఫిక్, సౌందర్యం, ప్రాచీన కట్టడాల చారిత్రకత ఇలా పూనా గురించే 40 నానీలు రాశారు కవయిత్రి. పూనా వ్యాజంతో పలు అంశాలపైనా కవితాత్మకమైన నానీలను వెదజల్లారు.

- డా॥ ఎన్. గోపి

## నా కలం కన్నీరొలికింది



కవిత్వం

పఠాన్ ఖాదర్‌వలి

వెల : 100/- పేజీలు: 112

ప్రతులకు: 9492804985

కాలం కన్నీటిని తుడిచి, కాంతిసుధల్ని పండించిన కవే ఖాదర్‌వలీ గారు. నిస్సందేహంగా ఆయన గమనం పరిపక్వత వైపుకి పురోగమిస్తుంది. అందుకు సాక్ష్యం ఈ అక్షరలక్షలే. అంచాత, నిగళాలు తెంచుకున్న ఈ పసిడిగళం నుండి మరిన్ని జనహిత జలపాతాలు జాలువారాలని శుభకామిద్దాం!

- వేంపల్లి అబ్దుల్ ఖాదర్

## విశాఖలో మహిళా దినోత్సవ కవి సమ్మేళనం



అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా సాహితీస్రవంతి విశాఖ శాఖ మహిళల అంశాలపై విశాఖపట్నంలోని పౌరగ్రంథాలయంలో మార్చి 7న 'కవి సమ్మేళనం నిర్వహించింది. ఇందులో 10 మంది కవయిత్రులతో సహా 29 మంది కవులు తమ కవితలను చదివారు. ఈ కవితలలో మహిళలు నేడు సమాజంలో ఎదుర్కొంటున్న అనేక సమస్యలను ప్రస్తావించడం జరిగింది. కార్యక్రమానికి ఎ.వి.యన్. కళాశాల తెలుగు శాఖాధిపతి ప్రొ॥ అయ్యగారి సీతారత్నం ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించారు. సమాజంలో స్త్రీలు నేడు అనేక విషమ పరిస్థితులు ఎదుర్కొంటున్నారని, వాటిని ధైర్యంగా ఎదుర్కొని ముందుకెళ్ళాలని, వామపక్షాలు, వారి ప్రజాసంఘాలు నిస్వార్థంగా మహిళల అభ్యున్నతికి కృషి చేస్తున్నాయని, ఆ కృషికి అందరూ తోడ్పాటునివ్వాలని కోరారు. సాహితీస్రవంతి ప్రత్యేకంగా మహిళా అంశాలపై కవి సమ్మేళనం నిర్వహించడం అభినందనీయమని అన్నారు. ఈ సందర్భంగా ఇటీవల ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో సభ్యురాలిగా నియమితులైన సాహితీవేత్త శ్రీమతి జగద్ధాత్రి గారిని సత్కరించారు. శ్రీమతి జగద్ధాత్రి తనకు జరిగిన సత్కారానికి ధన్యవాదాలు తెలుపుతూ, కవులు తమ కవితలలో వస్తువు, శిల్పం మరింత మెరుగుపరుచుకోవాలని కోరారు. కార్యక్రమానికి సాహితీస్రవంతి విశాఖ శాఖ అధ్యక్షులు ఎ.వి. రమణారావు అధ్యక్షత వహించగా, కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు, సభ్యులు శివకోటి నాగరాజు, సుజాతామూర్తి, కృష్ణవేణి తదితరులు సభాకార్యక్రమాన్ని సమన్వయం చేశారు. ♦

## అనంతపురంలో మహిళా దినోత్సవ కవి సమ్మేళనం



ఎంతో చారిత్రక నేపథ్యం కలిగిన అంతర్జాతీయ మహిళా దినోత్సవ స్ఫూర్తిని తదుపరి తరాలకు అందజేయాల్సిన మహత్తర బాధ్యత సాహిత్య కారులదే అని ప్రముఖ కవి, కవిత్వ విమర్శకులు తూముచర్ల రాజారాం పేర్కొన్నారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా మార్చి 8న సాహితీ స్రవంతి అనంతపురం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో లలిత కళాపరిషత్తులో జరిగిన కవి సమ్మేళనం లో పాల్గొని ప్రసంగించారు. సాహితీ స్రవంతి జిల్లా ఉపాధ్యక్షురాలు జ్యోత్స్న అధ్యక్షతన జరిగిన సభలో లలిత కళాపరిషత్తు కార్యదర్శి, న్యాయవాది పద్మజ మహిళల కోసం సాధించుకున్న చట్టాల గురించి వివరించారు. ఐద్వా జిల్లా కార్యదర్శి సావిత్రి మాట్లాడుతూ ఎందరో మహిళల త్యాగాల కారణంగా మహిళా దినోత్సవం జరుపుకుంటున్నామన్నారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనాన్ని సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షురాలు ప్రగతి సమన్వయం చేశారు. గాయత్రి రామోజీ, యాడికి సూర్య నారాయణ రెడ్డి, ఉద్దండం చంద్రశేఖర్, యమున, రామచంద్రరావు, హేమమాలిని, దాదా ఖలందర్, మధురశ్రీ, విద్యావతి, లక్ష్మి, కుంచె లక్ష్మి నారాయణ, చిలుకూరి దీవెన, ప్రగతి, కృష్ణవేణి తదితరులు మహిళా ఇతివృత్తం పై కవిత్వం వినిపించారు. కవితలను ప్రముఖ కవి రాజారాం సమీక్షిస్తూ కవులను అభినందించారు. సాహితీ స్రవంతి జిల్లా ఉపాధ్యక్షురాలు యమునా రాణి ఆహ్వానం పలకగా, కమిటీ సభ్యులు హేమమాలిని వందనసమర్పణ చేశారు. చెన్నా రామ్మూర్తి, రియాజుద్దీన్, నాగేశ్వరాచారి, అక్షరమాలి సురేష్ తదితరులు ఈ కార్యక్రమం లో పాల్గొన్నారు. ♦



తెలంగాణ సాహితి ఆధ్వర్యంలో మార్చి 7న మహబూబ్ నగర్ లిటిల్ స్కాలర్స్ హై స్కూల్, కాళోజీ హాలులో జరిగిన అంతర్జాతీయ మహిళా దినోత్సవం. వేదికపై వక్తగా శ్రీమతి యస్.సుభాషిణి (అ.ప్రొ తెలుగు విభాగం), వి.పుష్పలత ,కె.ఎ.ఎల్.సత్యవతి, యస్. జగపతి రావు ,వల్లబాపురం జనార్దన, బాదేపల్లి వెంకటయ్య గౌడ్



సాహిత్య వ్యాససంపుటి "సాలోచన"లి పుస్తకాన్ని మార్చి 16న కళ్యాణదుర్గం మండలం, లిడూరదకుంట గ్రామంలోని మా జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాలలో వార్షికోత్సవ సభలో ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో పాఠశాల ప్రధానోపాధ్యాయులు బి వెంకటేషులు, విశ్రాంత ప్రధానోపాధ్యాయులు యస్.బసిరెడ్డి, పాఠశాల కమిటీ అధ్యక్షులు దొణస్వామి, సభ్యులు కరెన్నచౌదరి తదితరులు పాల్గొన్నారు.



డా॥ ఎన్. గోపి రచించిన 'చైనాలో కవితా యాత్ర' గ్రంథాన్ని హైదరాబాద్ రవీంద్రభారతి సమావేశ మందిరంలో ప్రముఖ రచయిత్రి ఓల్గా ఆవిష్కరించారు. చిత్రంలో కిన్నెర కార్యదర్శి మద్దాళి రఘురాం, మినిమి సంపాదకులు వల్లభనేని అశ్వనికుమార్, కృతి స్వీకర్త డా॥ కె.వి.రమణ, జయజయశంకర టివి సిఇవొ డా॥ వోలేటి పార్వతీశం, కవిగోపి, ఇండోచైనా మిత్రమండలి సహాయకార్యదర్శి డా॥ జతిన్ కుమార్, ఉస్మానియా తెలుగుశాఖ అసిస్టెంట్ ప్రొఫెసర్ డా॥ ఎస్ రఘు, నేటినిజం సంపాదకులు శ్రీ బైస దేవదాస్



విజయవాడలో మధు మహాలక్ష్మి కల్చరల్ సెంటర్‌లో మార్చి 24న జరిగిన 'స్త్రీ కథలు 50' పుస్తకావిష్కరణ దృశ్యం. చిత్రంలో ప్రముఖ కథా రచయిత్రి పి. సత్యవతి, పాటిబండ్ల రజని, చల్లపల్లి స్వరూపరాణి, రాధిక, వేంపల్లి సురేష్, కాకుమాని శ్రీనివాసరావు

# తెలంగాణ సాహితి నూతన రాష్ట్ర కమిటీ ఏర్పాటు



వల్లభాపురం జనార్దన
అధ్యక్షులు



కె. ఆనందాచారి
ప్రధాన కార్యదర్శి

హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన సమావేశంలో మార్చి 17న తెలంగాణ సాహితి నూతన రాష్ట్ర కమిటి ఏర్పడింది. ప్రముఖ కవి వల్లభాపురం జనార్దన రాష్ట్ర అధ్యక్షులుగా, ప్రముఖ కవి కె. ఆనందాచారి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. రాష్ట్ర కమిటీ సభ్యులు జి.నరేశ్, నస్రీన్ ఖాన్,కె స్ఫూర్తి, తంగిరాలచక్రవర్తి, భూపతి వెంకటేశ్వర్లు, సలీమ, అనంతోజు మోహనకృష్ణ, కపిలరాంకుమార్, వెన్నెలసత్యం, మండవ సుబ్బారావు, వెంకట్ పవార్,వహీద్ ఖాన్,కటకోజ్వల,రమేశ్, ఎం.డి ఖాజామొయినుద్దీన్

## పలమనేరు బాలాజీ కి మాడభూషి రంగాచార్య కథా పురస్కారం





కథా రచయిత పలమనేరు బాలాజీకి 'ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు' కథా సంపుటికి గాను మాడభూషి రంగాచార్య కథా పురస్కారం లభించింది. మార్చి 23 న హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయం నేషనల్ బుక్ ట్రస్ట్ ప్రాంగణంలో ఈ పురస్కారాన్ని మాడభూషి రంగాచార్య స్మారక పురస్కారం కమిటీ నిర్వాహకురాలు శ్రీమతి లలితా దేవి, తెలంగాణ రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ నాళేశ్వరం శంకరం, ప్రముఖ సాహితీవేత్తలు నగ్నముని ,ఏ కె ప్రభాకర్ , బి.వి.ఎన్.స్వామి అందజేశారు. పలమనేరు బాలాజీ కథా సంపుటి 'ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు' ని ప్రముఖ సాహితీవేత్త ఏకే ప్రభాకర్ సభకు పరిచయం చేశారు. ◆

## పుప్పాల శ్రీరాం కవితా సంపుటి 'అద్వంద్వం' కు డా॥ ఉమ్మడిశెటి సత్యాదేవి పురస్కారం







ఉమ్మడిశెట్టి సత్యాదేవి 31వ సాహిత్య పురస్కారానికి 2018 సంవత్సరానికి గాను పుప్పాల శ్రీరాం కవితా సంపుటి 'అద్వంద్వం' ఎంపికయినట్లు అవార్డు వ్యవస్థాపకులు డా॥ ఉమ్మడిశెట్టి రాధేయ ఒక ప్రకటనలో తెలిపారు. ప్రముఖ కవులు ఆశారాజు, జి. వెంకటకృష్ణ, అద్దేపల్లి ప్రభు ఈ అవార్డు ఎంపికకు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించినట్లు ఆయన తెలిపారు. ఏప్రిల్‌లో అనంతపురంలో జరిగే కార్యక్రమంలో ఈ పురస్కారాన్ని అందజేయనున్నట్లు తెలిపారు. పుప్పాల శ్రీరాం తూర్పుగోదావరి జిల్లా కడియంలో ఆంధ్రాబ్యాంక్ మేనేజర్‌గా పనిచేస్తున్నారు. ఇటీవలే వెలువరించిన 'అద్వంద్వం' ఆయన తొలి కవితా సంపుటి. ◆




Printed, Published and owned by V. Krishnaiah 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

SAHITYA PRASTHANAM RNI N0.APTEL/2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
PR3VH02A196 f Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 28.03.2019





If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSUM02A 196 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |